ర్మించుమ ప్రార్థించు శంకచేశరణొందుశంకరుండు । జలధిసొఁచ్చిబారుహగ్రి యునుజడధియగుచు । గట్టుమెట్టును బులితోలు గట్టుదంట। దెసలదొరలకు నిటువంటదెసలదొరయఁ । గలరెవరులింక నతనితోఁగలనికెదుర ॥ క ॥ ఓ విప్రులారవినుఁడీ । నావచనము నేటనుండి నన్నేలుహయ । గ్రీవునకుయాగ భాగములీవలయున్వహ్నిముఖులకీవలదనినన్ ॥ సీ ॥ ఏమేమితాఁగాకయుఁ క నెవ్వరున్నారు యాగభాగంబులకెసుమవారు । తనకేలవచ్చెనింతమదాంధ కారంబుదనువాల్లఁడే మొక్కోయనెడివారు । నలుకకదుర్భాషలాడఁబెదుంత జిహ్వామెచీల్చవలయుఁబోయనెడివారు । నింతవింతలుపుట్టెసదియేమిహోంటు వోయంచుఁజిత్తమునఁజింతించువారు । నాదిగియేమనకూరకేయుండువారు। నేమియుత్తరమంచునూహించువారు । నగుసదస్యులలోఁగొందఱార్యులిట్టు। లనిరిసమయోచితంబుగాదనుజుఁజూచి ॥ గీ ॥ నీవుసెప్పినబుద్ధియెంతేనిలెస్స। కాదనఁగరాదుమాకులోకములకెల్లఁ । నేతఁగాడెహయగ్రీవనిశిచరేంద్రుఁ। డైననొకమాటగలదెట్టులనినవినుము ॥ క ॥ వేదోక్తవిధినిమేమా । యాదివి జులకొఱకెయిత్తుమధ్వరభాగం । బేదికర్మనస్వాతంత్ర్యం । బేగిమీకనినదను జుఁడేగిరయమునన్ ॥ శా ॥ ఆవార్తల్వినిపింపదైత్యపతిరోషావేశముప్పొంగనా । హా వేదంబుల యాగభాగములమర్త్యశ్రేణికేకానిమా । కేవంకంబ నిలేకయుండునటుగానేర్పాటుగావించెఁగా ।నీవేగంబహరించితశ్రుతులభగ్నీ భూతముల్సేసెదన్ ॥ గీ ॥ అరయఁగాఁగశ్యపబ్రహ్మకగ్రమహిషి । యైన దితిపుత్రులముగాననాదిదేవ । తలము మీమట్టిమాకునధ్వరములందు । భాగములులేమిచేసుపాపంబుగాదె ॥ గీ ॥ అహహసత్రింప్రఁగుఁటికెనిటగవరుగా కాని మేమహర్జలము గాదెకాయటంబుఁ । బరిహాసించుచుసత్యంతపరుషరోష । రసకషాయితనేత్రుఁడైమసరవిభుఁడు ॥ గీ ॥ ఇంకనేఁడుమొదలు నెవ్వ రువేదము । ల్దలఁచురట్టివారుదండ్యులగుదు । రనుచుఁజాటఁజెసెఁనలలోకం బుల । దానవులకుఁగలదెధర్మచింత ॥ వ ॥ అంత ॥ క ॥ ఆవార్తవెల్లనారదు । చెవినిబెఁడెంతదుడుకుచేసెనటంచున్ । భావంబుగలఁగపుత్రుఁడు । నే వేగన్వచ్చెదైత్యవిభుసభఁజేరన్ ॥ క ॥ వచ్చినమునిపతితోఁదన । ముచ్చటద

నుజుండు దేల్పమునిపతిదనలో । నచ్చెరుపందుచునిదియేమి । మిచ్చఁదలంచితివి
దానవేశ్వర చెపుమా ॥ గీ ॥ అకట టాస్వయంవ్యక్తములైనశ్రుతుల । నౌను
గాదనఁదగునెయయ్యాజున్నకైన। సురులయందునుధర్మమసురులయందుఁ। గలు
షములుసుగల్గమికుఁభాగములుగలవె ॥ క ॥ కలకాలముపరకాంతలఁ। గలయం
దలఁచుబలుహింసగలగుణమయ్యుం । గలవేధర్మంబులుమీ । కలకలహములం
జెకాకయసురాధీశా ॥ గీ ॥ అనినవాగ్రహమొదవలోనడఁచి సెలవి । వారఁ
గానవ్విదైత్యేయుపెరుఁడనియె । నెంతమాటాడనితిచ్చెద రేనెఱుంగ । నేసుధాం
ధుఁ ధర్మంబులింతయేల ॥ సీ ॥ అమరనాయకుఁడహల్యాకాముకుఁడుగాఁడె
శిఖిబుషిస్త్రీలకాశింపలేదె। సతతంబుయెముఁడుహింసకుఁబాలుపడఁడెరా
త్రుసులలోపలివాఁడుగాఁడెనిబుతి। వీర్యంబుఘటములోవిడువఁడెవరుణుండు
పవనుండుగన్యలఁబట్టలేదె । శివకపరాధంబు సేయఁడేధనదుండుభర్గుండౌన
ర్పఁడెబ్రహ్మహత్య। హరియుభృగుపత్నిఁ నొంపఁడేయజుఁడుగూఁతుఁ। గలయఁ
డేశశిగురుకాంతఁగలసికొనఁడె । యింకశుద్ధాత్ములగువేల్పులేరివేలు। మడఁ
చియెుఱఁగింపఁడేఁగన్నవాసవర్య॥ గీ ॥ తాముచేసినయవియెల్లధర్మములఁ
ట। మేముచేసినదఘమఁట మేలుగాదె । యేకరణివచ్చెవారలకింతయగ్ర । గ
ణ్యతయుమాకునింతలాఘవముజగతి ॥ ఉ ॥ ఎక్కడిధర్మమేటిశ్రుతులింకన
నేటికినేనురాజనై । పెక్కువము జ్జగంబులనధైర్యపరాక్రమశీలనేలన । న్నె
క్కుడుభక్తితోఁగొలువనిచ్చెదఁగోరినవారికోరిక। లక్కునవోర్తుఁగానిపరదై
వములన్భజియింపనోర్తునే ॥ గీ ॥ మీరువిచ్చేయుఁడనుచుసమృద్ధఁ బోవ । మె
సఁగడిగ్గనలేచియయ్యాసురవిభుఁడు । నగరిలోనికిఁబోవదానవగురుండు । న
చ్యుతుఁడెచక్కఁ బెట్టెమనమనుచుఁజనియె ॥ సీ ॥ మునివృత్తినోమనిముక్కుప
ట్టిజపంబుచేయఁడొక్కరుఁడేనచిత్తశుద్ధి । నగ్నియేస్వాహాయటంచుప్రేలిమి
యంపఁగొక్కఁడైనమూఁపాలనిలనోసఁగఁబోఁడు। హరిరోహరియటంచునాయా
యుపుణ్యతీర్థంబులనొక్కఁడైనన్నానమాడఁ। మపదేశమొనరింపరొక్కఁడైనత్త్వము
సిద్ధాంతనామ వేదంబులసరవిఁనొక్కడివి। భూసురులలోననింతలేభక్తి చేశ। నైనఁ
జిత్రాయనమఃయనిపాన్నమెడర । నేమి దెలుపుదునింకశ్రీరాముఁరామ । అనఁ

పదోసంబు నాటిదుర్దశల తెఱఁగు ॥ గీ ॥ లేశమాత్రంబు ధర్మంబు లేక తనరు జ
నులనావృష్టి నతివృష్టి సమయ విలయ। సమయమగుటయుఁ బెల్లు గ్రైక్యమును
జెంద। భువనమోహనమసురపుంగవుఁడు చేరి ॥ మత్తకోకిల ॥ ఇంక నాకిది
వేళయంచు ననేకసంగరరంగని। శ్శంకబాహుసహస్రనాథుల సైన్యనాథులఁ
బుత్రులన్। బంకజాక్షులఁ గార్యదక్షులబంధులందగువారలం। గొంకకప్పరి
నిల్పి దానవకుంజరుండు మదాంధుఁడై ॥ సీ ॥ మందులముడి తాటమలఁచి వేసిన
సిగఁబొల్పుగానఁగనీని బొమిడికంబు। పరులకుఁ దానుగన్పడకుండ ఫాలభాగ
మునఁ బెట్టినయట్టి కావిబొట్టు। నడుపంకఁ బచ్చ రాపిడివంకఁ బొంకించి చారిక
ట్టిననీలిచాయదట్టి। వలకేలఁ బెనుడాపలి కేలఁ గేడెంబునంగంబునందు వజ్రాం
గిజోడు। మీఱుమతియును దైతేయచోరభటుఁడు। కురుచకన్నపుఁ గత్తిసో
కుల్పాడిభరణి। మురాలికల్మణులుల్వాకట్టు మొదలుగాఁగ। ఘోరసంగ్రహణీయ
వస్తువులుగొనుచు ॥ వ ॥ ఇత్తెఱంగున నత్తుంగగ్రీవుండు త్వరంగితోత్సాహ
సాహసంబులు మనంబున నెసంగొన నభంగుఁడు మురభంగ చంగన్మణిస్థగితగోపు
రంబగుపురంబు వెలువడి నలుగడలం గడలి విలోకింపుచు నాకించుక గొంచకరసా
తలకూర్మియమాణవిరించి చంచలలోచనాకరాంచల సముంచితవిపంచికారవ
వంచనాచుంచు చంచత్తరంగాయమాన నాగకన్యకానన్యసాధారణగానూన
గానతానమానంబుల కుంజొక్కుచు మయమాయానియమితో పరిహరిత్సరి
చ్ఛదవితానాయితశోయధిం జొచ్చి ఘనాఘనఘనాపఘనజవజాయమానపవ
మానదోధూయమాన జలచరవర్గంబగు బాహుద్వయుద్వయస మార్గంబుప
ట్టిపోవుచు నాడాడసభ్యపహారంబులకై సిహారంబులసమిష్ట పహారంబులక
రతలప్రహారంబులం జమున కుపహారంబులు సేయుచు నక్రంబులగు నక్రంబుల
చక్రంబులనాక్రమించి చకచ్చేయుచుఁ గులాచలచక్రక్రమవక్రచంక్రమవిక్ర
మాభితక్షుభితసర్వతోముఖత్వరితసర్వతోముఖపరిపతజ్జలచరగ్రసనవ్యాస
నవ్యగ్రపరివృత్తాయమాన నానావిధపక్షిభాసనంబులు నొచ్చియుదరంబులు
వ్రచ్చియు గాఢతరకంచుక వ్యూఢోటుసూటిఫణిజెల్లనమై నాశాదికులపర్వతం
బులం దాఁకుచు నిజావలోకనభయపలాయమానమానుషీ వితానంబు లన

పసరపదవిలగ్నవిద్రుమలతావలయపతితజలమాణవకులంగనుంగొని హసింపుచునఖండగండశైలమండనాయితపిచండిలమదప్రచండసముద్దండంబులై యొండొండభండనంబులుసల్పుచుఁ గాండ వేదండకాండప్రకాండంబులనడుమదూరిహారిదంతదంతిదంతురితకాంతిమంతంబులగు తదీయదంతిదంతంబులం బెకల్చి వరుణాంభోజనయనా కుచకుంభవిజృంభమాణావష్టంభ సంరంభంబులగు కుంభంబులమౌక్తికంబులెడల ద్రవేయునెడలజడిసి పరువిడ బెడిదమగుఘీంకారంబులనంకురించిన శంకాతంకంబులవడంకుచుఁ దమతమయంగనామణులొసంగుహాతాలింగనంబుల నుప్పొంగు జలమానుషకుమారవర్గంబులమ్రొక్కులుగైకొంచు నెడనెడఁ ద్రోవకడ్డంబై మెలంగు జలభుజంగంబులం గనుంగొని దుశ్శకునంబనితలంచుచుఁ జేనొడిసి జిరజిరం ద్రిప్పివైచు నెడఫణామణులు చెదరి విస్ఫులింగంబులగములవలెఁ బ్రాపట్టియేపట్టున నిలువంజాలక మూలమూలకొరుగుమకరకర్కటకాది జంతుసంతానంబులకు బడబానలసంతాపంబునకుఁ గొంతచింతింపుచు భవిష్యత్కూర్మధృతమందరవసుంధరాధరసూచకంబులగుచుగిరులక్రింద నందందఁ గ్రుందుకొనుకూర్మంబులు గ్రుంగ శృంగంబుల మెట్టి లంఘింపుచుప్లుతపరిప్లుతసముజ్జ్వలదౌర్వజ్వలనజ్వాలికాసంతాపశర్కరాయితేక్షురసవ్యంజనసమంజసంబులగుదుగ్ధంబులుగ్రోలుచుందనివిసాలక లవణరససంమిశ్రంబులగుదధిఖండంబులమెసంగుచు శుద్ధోదకంబులగండూషింపుచు హేలాపథాధారిగ హాలారసపానవేలావిలోలాయితకాలానలకీలాకులసమాకులాభీలారుణశోభాలవాలవిశాలలోచనగోళంబులు ద్రిప్పుచుసోలుచు జంబూప్లక్షాదిద్వీపవృక్ష ద్విత్రిమాత్రావశిష్టశాఖావలంబనంబునం గొంతవిశ్రాంతుండగుచుదివాకరమార్గంబుఁ గ్గమించి సుధాకరపథంబంటి తారాపథంబునకెగసి బుధాదిగ్రహంబులనతిక్రమించి ధ్రువమండలంబుదండకుం జేరి మహర్లోకపథంబునం బయలుదేరి ప్రాప్తసంయుగవిలయ సమయసముత్థితసప్తసప్తిదీప్తితప్తులగుచునుపరిలోకంబులవలసలుచేసినఁగలి తమతమయాగారంబులఁజేయువారి నాలోకింపుచు వాహాదిపజితుష్టైపిరాజిలువై రాజలోకంబగు జనలోకంబుఁ బ్రవేశించి యవ్వలశతానందనందన సనకసనందనాదిముని

బృందారకమునిబృందసహస్రారవింద బంధుబంధుర ప్రభాదురవలోకంబగు
తపోలోకంబస్తోకప్రయత్నంబునంగడచి యాకడంజనిచనీ ॥ సీ ॥ కడవన్నెత
ళుకుబంగరుకోటకెంజాయసంజకెంజిగిరంగునవధరింపఁ । దోరంపుముత్యా
లతోరణంబులకాంతిచొక్కమాచుక్కలబెక్కుసూప । జేజేలరాతాలచెలు
వంపుగృహపాళి కటకిచీకటిగుంపుగరిమనింప । రాణించుజాతివజ్రాలమేడల
డాలుపండువెన్నెలచెన్నుపరిఢవిల్ల ।వివిధమాణిక్యదీపములెల్లెలుఁగుచుండ।స్మ
రరణశ్రాంతమిథునలోచనసరోరు। హములుముకుళింపనైశధర్మములనొందు
సత్యలోకంబుగనుఁగొనెవైరాగ్యవిభుఁడు॥ చ॥ కనుఁగొనివిశ్వకర్మకరకౌశలిమె
చ్చుచురాజవీథులం। జనిచనిముందటన్వెలిహజారమువెల్వడివచ్చుచున్నయా।
సనకసనందనప్రముఖసంయములంగని పెద్దకొల్వుదీ । రెనలువయందునెంచి
నడురేయినిశాంతమునొచ్చియచ్చటన్ ॥ సీ ॥ ఉపసృష్టి క్రమమెల్లనొప్పించి
బహుమానమందివచ్చినకర్దమాదిఋషుల । జనులకర్మశరీరసంఖ్యలెల్లదినాం
తకమువేసిలిఖియించుకరణికులను। తమతమయాదిపత్యములుదీరహజారమం
దుఁగాచున్నయింద్రాదిసురుల । వినికివేళయటంచువీణలతంత్రులుసారించు
తుంబురునారదులను । తానవరుసలుపెంచుగంధర్వగాయ । కులనుజతగూ
డునట్టువకులమువారిఁ । గాసెగట్టువియచ్చరకంబుకంధ। రలనుజూచుచుఁగ
క్ష్యాంతరములుగడచి ॥ సీ ॥ తోరంపుసాంబ్రాణిధూపధూమముగట్టుపగదా
యబాబాలబారుదీర్ప । బంధురమురజాదిధింధిమిధ్వానంబుబహుళగర్జావి
జృంభణమునెఱప । వేలుపుమిన్నలవివిధభూషణకాంతి శక్రచాపస్ఫూర్తిన
వధరింప। తిరుపులగట్టుబిత్తరులమైదీఁగెలు గ్రొక్కారుమెఱుఁగులకొప్పుఁజూ
పఁ। బుష్పవర్షంబువడగండ్లపోలుపుదెలుప । సారస్యమృదుగీతికామృతాసా
రమెసఁగ । వర్షవేళనుబోలునవ్వనజభవుని । నాట్యశాలనుదడసెదానవ
విభుండు ॥ గీ ॥ అజుఁడుగొలువుదీరి యంతిపురంబున । కరుగుదనుకనొక్క
యరుగుగప్పు । రాలలోనఁగానరాకుండడాగియా। వెనుకమెల్లవవలఁజనుచు
నెదుట ॥ గీ ॥ భానుపరిపూర్ణనీహారభానుచిత్ర। భానుభానుమహోజనిస్థా
నదృశ్య । మానమాణిక్యదేదీప్యమానమైన । కేళికాగేహపాళివీక్షించికొను

చు ॥ సీ ॥ శారికాకలకంఠసగుణనిర్గుణవాదనిర్ణయప్రవణవాణీశుకంబు। ర
థవియోజితమనోరథమనోజ్ఞవిహారహారివాహనరాజహంసకులము। అశ్రాం
తవికచ హేమాంభోజవిహరమాణజ్ఞాతవిగహీరథాంగయుగము। భార
తీగళరవాభ్యాసనలీలాలోలకవకేవకలరవకలకలంబు। గురుకుచాహాసపుషిత
చకోరకంబు। గానవిద్రవమాణశృంగారసౌధ। చంద్రకాంతాంబుకణపా
యిచాతకంబు। నగుచుంజెల్వొందుఁ గేళిగృహంబునందు ॥ మ ॥ తళుకుంజప్ప
రకోళ్లమంచమున నిద్రాజాజిపూసెజ్జపైఁ। బలుకుంజిల్కలకొల్కి రాచిలుక
బాబాసాహిబూనెయ్యపుం। గలనన్ సౌఖ్యముగాంచి మైబడలఁగా। గాటం
పుసెట్టూపపు। ల్వొలయన్నిద్రితుఁడైనపద్మభవునాలోకించి యాలోపలన్॥
గీ॥ అతులమాణిక్యదీపములార్చరామిఁ। దనదునెమ్మోముచాయనత్తఱిశయిం
చి। యున్నయుడిగంపుప్రాబోండ్లయొడలిమీఁదఁ। బారనిద్యాకయొకయోరఁ
జేరనరిగి ॥ మ ॥ అతులంబైతగు బ్రహ్మవర్చసముడాయన్రామిఁబాంచున్న
చో। నతివేలాయితనాసికాసుషిరయాతాయాతనిశ్వాసమా। రుతసంక్షు
బ్ధచతుర్ముఖంబులనుమూర్తుల్దాల్చి వేదాళిని। స్సృతమైనన్ హరియించెదక్షు
ణమరతోభర్తవిభ్రాంతుఁడై ॥ సీ ॥ హీరకుట్టిమభూములుసుకనేలలటంచు
ఘట్టిగానడుగుబెట్టి వెఱచుఁ। బచ్చరాకట్నంబు పచ్చికపట్లని వెడవెడముని
ద్రవ్వెల్లనడచిపోవు। సిలువుటద్దంబులనీడలు పరికించిపరులంచుఁ జేకత్తిపదిలపఱ
చుఁ। దానువచ్చినత్రోవగానకతలబొప్పిగట్టిగాఁ గుడ్యభాగములఁదాఁకుఁ।
దడఁబడుచునిద్రవోయెడితరుణిబోండ్ల। పాదములమెట్టుఁగానిమున్నటిదె
ధైర్య। మూనలేఁడయ్యె వినుమెంతవానికైన। దొంగతనమున్నయప్పుడెదో
డరుభయము ॥ మత్తకోకిల ॥ అంతనొక్కక్రమంబునందనుజాధినాథుఁడు భా
రతీ। కాంతుకేళిగృహంబువెల్వడికంధిగర్భముఁజేరఁబో। నెంతయున్మొఱ
వెట్టెవేదములీశ్వరామమదేవతా। హంతచేఁబడకుండఁబ్రోవవెయ్యంచు బె
ట్టుగభూవరా ॥ గీ ॥ అప్పుడచ్చెరువందుచునంబురాశి। దరినినుండెడిసప్త
షిఁవరులిదేమి। యార్తనాదంబుకపటమీనావతార। తేఁటతెల్లమిగామా
కుఁదెల్పవయ్య ॥ ఉ ॥ నావుడు శాంబరీశఘరనాయకుఁడిట్లను మానులారవా

జీవిభుఁడిప్డుమై మఱచి నిద్దురవోవఁగఁ జూచి యాహయ । గ్రీవుఁడు చోరవృత్తి
నిహరించి తముం గొనిపోవుచుండఁగాఁ । గావఁగ దిక్కులేమిఁ గడఁకన్ మొఱవె
ట్టుఁదొడంగె వేదముల్ ॥ ఉ ॥ కావున నమ్ముచ్చు రక్కసుని గ్రక్కున నొక్కట
నుక్కడంచి వే । దావళి నుద్ధరించి క్షణదాంతవినిద్రితుఁడైన బ్రహ్మకిఁ । బోవఁ దె
నంచు మీఁచె జలముల్ బలముల్ గలయంబుయోధినిం । తేవడిమీఱడించి దురతి
క్రమవేగపరాక్రమంబునన్ ॥ మ ॥ సముయాంభోనిధిఁ జొచ్చి చండతరచంచ
ద్వాలమల్లార్పుచున్ । సమరోజ్జృంభితజంభశాసనభుజాస్తంభాగ్రదంభో
ళిదు । ర్ధమశృంగంబున వేదచోరపురవప్రశ్రేణికల్ నుగ్గునూఁ । చముగాఁ దాఁ
కెసుధాశనాసహానయోషా గర్భనిర్భేదియై ॥ మ ॥ అటు లందాఁకిన యంత
దంతికరలూనాబ్జంబు చందంబునన్ । స్ఫుటితంబైన పురంబు వెల్వడి యొరత్తుగో
పీరులిక్షించిరో । చ్చాటలేదిట్టికడాని చోఱ యుదిగొంచుం బోయి చేకానగా
గా । ఘటియింపం దగుదైత్యనేతకనిదోర్గర్వంబఖర్వంబుగన్ ॥ గీ ॥ గాలము
లువైచువారదికాదటంచుఁ । బెన్వలలు వేయువారవి పనికి రావ । టంచు వడిగా
రచేకళ్లైయలఁచువారు । నైనయసురులకనిమొనమ్మత్స్యమూర్తి ॥ ఉ ॥ ధీ
వరులార గాలము తుదింబదిలంబుగ నెఱ్ఱగుచ్చి మీ । రీవగ వైచినం దగుల నేటికి
నాకిది వింతమాంసముల్ । గావలెనంచు వచ్చితిని గావున నీవలె నేఁడు మీరు హా
య । గ్రీవుని గ్రుచ్చి వైపుఁడు హరింపుడు నంతట మిమ్ముఁ జేరుదున్ ॥ ఉ ॥ ఇంత
ప్రయాసమేల చనుఁడిప్పుడ యంచును వారు సూడఁదా । నింతయి యంతయై వెను
కనేనుఁగ యంతయు కొండయంతయై । యెంతయుఁ బెద్దయై కడలి నెల్లఁ ఁసనిండిన
హస్రయోజనా । క్రాంతతనూవిలాసముల గన్పడఁ జూచి నిశాటసైనికుల్ ॥
క ॥ నరభక్ష్యమైనమీనము । నరభోజనభక్ష్యమౌనసఁగఁ జిత్రంబే । పరికించె
దమిట నేఁడా । సురపతనిను దినుట నీవసురపతిఁ దినుటన్ ॥ మ ॥ పదరంగా రణమే
మి గణుంచు దనుజల్ బాహాబలప్రౌఢచేఁ । గదలన్ దుముసేఁ బెలంబాడుచున్
ఖడ్గంబులం జించుచున్ । గదియన్ స్నగ్గోని మత్స్యమొక్కపరిశృంగంబట్టి టుంద్రిప్పఁ
గా । నుదరంబుల్ శిరముల్ దెగంబడి రిదైత్యవ్యూహ వేలోకకటన్ ॥ శా ॥ ఆవా
ర్తల్ హాత శేషసైనికుల చేనాలించి సేనానిదా । నీవేళం జనిదానిఁ దెత్తునని వేమ్మే

తెరఁద ద్వాలలీ । లావిక్షిప్తమహాన గాళిపఙ్క్తి ప్రాలంగూలసైన్యంబుతో । దే
వారాతివరూథినీవిభుఁడు మధ్యేరాజమార్గంబునన్ ॥ వ ॥ అంత ॥ శా ॥ వా
లోత్క్షిప్తగిరుల్సురారిపురిపై ప్రాలస్వీశీర్ణంబులై । రాజన్గోపురముల్ గ్రహం
బులురిలెం బ్రాసాదముల్ నుగ్గులై । తూలెన్గోటలుగ్రుంగ సౌధములుదోర్ప్రోచ్ఛి
న్న భిన్నంబులై ప్రీలెన్మంటపకోటులొడ్డగిలె నావిఘూర్ణాత ఘోషంబునన్॥
గీ॥ వాని లోపల నొక్కపర్వతమువచ్చి । దానుగొలువున్న కేళిసౌధమునఁ
బడినఁ। బగిలిపైఁబడఁజేతులఁబట్టియనల । వైచి వెల్వడివచ్చినిశాచరుండు॥గీ॥
అగము రాఁగారణంబేమియనుచు మంత్రి । జనుల నడిగినవారలువినయమున
ను। దేవయొకపైఁడిచోఁఱ యీదీవిచేరి । విస్మయము సేయుచున్నది వివిధగ
తుల ॥ సీ ॥ తిమితిమింగిలముఖ్య దీర్ఘమత్స్యంబులఁగొమ్మునఁగుములు గాఁ
గ్రుచ్చి మెత్తుఁ। దనసంతతికి శేఁతగొనివచ్చు రీతిదిక్కరిశరీరంబులగరులనాను।
దృఢవాలమునగట్టులెగయంగఁ గొట్టుచుఁ గేళిమైఁగందుక క్రీడసలుపు। నుగ్ర
సత్వాహారము పశమించుటకునాబడబానలముగ్రోలిపారవిడుచు । నాశర
చ్ఛేదనముఁదృణప్రాయముగను । సలుపు లేవింతయదివె కావలెనటన్న । గు
టుకుమనకుండ బ్రహ్మాండకోటిమ్రింగి । సప్తజలధులు ద్రావ దేక్షణములోన॥క॥
అనిమంత్రులువినిపించిన। వినినవ్వుచు లేచి దైత్య విభుఁడదియేదీ । కనుఁగొంద
ము గాకనితెను । దనుజులుగొలువంగవార్ధితటగతుఁడగుచున్ ॥ మ ॥ కనియె
న్దానవసార్వభౌముఁడెదుటన్ గల్పాంతపాథోధిరా । డనుగామీనముసాధు
లోకవిపదాయాసచ్ఛిదావ్యాజసం । జనితోద్యత్కరుణాధృతాయతతరీస
ప్తర్షిగాభూమీనము । ఘనదంష్ట్రాంగవిభాజితాయుతతిమీకామీనము న్మీన
మున్ ॥ చ ॥ కనియిదిమీనుకాదులయకాలమహాబలనీయసూనకాం । చనపు
ధరంబయంచుమదిసందియమందుచుఁగాలరుద్రశూ । లనిభసహస్రదంష్ట్రిబు
జ్వలద్బడబానలకీలలోలిలో । చనములుధూమకేతుసదృశంబగువాలముచూ
చీనివ్వెఱన్ ॥ మ ॥ ఇదిమీనంబగునైననేమియసిచేనింతింతగాఁద్రుంతునో।కుది
యంగొట్టుదునోగదన్నిశితమాకుంతంబునంగ్రుచ్చియో । త్రుటనోమీఁదికినిష్ప
డంచుమిగులస్థుర్వారగర్వాంధుఁడై । కదిసెంజూచిమృషార్థుసాక్షిపుఁడుజా।

గ్రద్వాలమల్లార్పుచుఁ ॥ గీ ॥ శార్ఙ్గలీలావినిర్ముక్తశరములరిపు । సేనఁగీ
లాలసిక్తంబుఁ జేయుశౌరి। శార్ఙ్గలీలా వినిర్ముక్త శరములరిపు। సేనఁగీలాల
సిక్తంబుఁ జేసెనపుడు ॥ ఉ ॥ ఓరినిశాచ రాధమ పయోముహగర్భుఁడు నిద్ర
వోవఁగా । నూరక యేల తెచ్చితివి యుత్తమవేదములంతయు నేమిచే । కూరౌ
ను నేఁడు నీకకట కోఁతికి మానిక మేలగూలఁగాఁ । గారణమింటఁ జేసి చెడు గార్య
ము చేసితివింతెయుమ్మోయిన్ ॥ క ॥ అనవినినీవా యెవరో। యనియుంటినిమం
చికార్యమా యెను నేఁడే । సినపుణ్యంబునఁగానినుఁ। గనుఁగొనఁగాఁగలిగెనిఁ
తకాలంబునకున్ ॥ శా ॥ నేనేనక్కనఁబూతునో యనుచు నెంతేభీతి వారాశి
లో । మీనంబై మిడుకంగఁజొచ్చితివయో మేలే హరీదీనికిం । కేనేమందును దా
గఁబోయినఁదలారిల్లయ్యె నేఁడేడకుం। బోనాఁజిక్కితివంటయింటిశశ్వమహాబా
నంప్రుఁ బెన్గూటకిన్ ॥ చ ॥ ఇదె కనుఁగొమ్మటంచునిట లేక్షణరూక్షకటాక్షవీక్ష
లం । గుదిగొనినిప్పులుప్పతిల ఘోరతరభ్రుకుటీకరాళమై। వదనము భానుమం
డలము వైఖరిఁ జేగురుచాయమించఁగా। కదఁగొనిత్రిప్పి నైచెలయుకాలమహో
ద్ధతితీరుమీఱఁగన్ ॥ తే ॥ అగదాదండముద్దండమగుచుఁ దాఁకి। తోఁక వెంట్రు
కమైననుదులుపదయ్యె । నేమి చెప్పుదుఁ బృథురోమనామధేయ । మపుడుసా
ర్థకమయ్యె మత్స్యంబునందు ॥ వ ॥ అంత ॥ మ ॥ ఘనరోషంబున మీనమూర్తిజ
నిజశృంగంబెత్తితీరస్థుఁడై । మనుజాశి స్రభునేయఁగాఁ దెగియెరంభాస్తంభ
ముంబోలితత్ । తనువచ్చోనరుణోదయంబయినచందంబొప్పరక్తౌఘము। ల్వ
నధిం దేలెవిని బ్రతండగఁ జతుర్వక్త్రాబ్జముప్పొంగఁగన్ ॥ గీ ॥ నిదురమేల్కొ
నివేగముల్నెమకికొనఁ । జాలకంభోజభవుఁడబ్ధిఁ దేలియాడు । మీనమూర్తిఁ
గనుంగొనిమేనువాంగఁ। జేరిప్రణమిల్లి సన్నుతిచేసెనిట్లు॥ శా ॥ శ్రీమీనాకృత
యేన మోభగవతే సృష్ట్యాదిసంధాయినే । హైమాహార్యరుచే హృతానతశు
చే సారావపాథోచునే । సాముద్రాంబువిహారిణే దితిజనుస్సంహారిణే హారి
ణే । స్వామిన్పాహి కృపాహి తేహితతరాసద్వేష దేహాశ్రుతేః ॥ మ ॥ అనివ
ణేశాంచు సువర్ణాగఘనకపేవాళిం బ్రసాదించిగ్ర । త్కనఁడై త్రైలోక్య
ముసృష్టిసేయుమని శ్రీకాంతుండు పంపన్ససా। దనివాణీశ్వరుఁడాగమోక్త

ముగ సూర్యాచంద్రతారల్దివం । బునుభూమీనభము ల్సృజించెను యి థాపూర్వంబుగా నంతటన్ ॥ క ॥ అనఘుండగు సత్యవ్రతు । మనుపట్టము గట్టెశౌరి మన్ననఁజతురా । ననఁడాతఁడె వైవస్వతుఁ । డను పేరుంగలిగి యిప్పుడల రెన్నిగులన్ ॥ మ ॥ మనుజాధీశ్వర యిందిరా రమణు శ్రీమత్స్యావతారంబుభక్తివివిన్న ట్టిక్రృతార్థుల్ లుత్తమరమాదీర్ఘాయురారోగ్యముల్గనిసత్యవ్రతసార్వభౌమునిగతింగల్పాంతరస్థాయికీ । ర్తినిజెన్నొందుదురబ్జనాభుకరుణాదృష్ట్యైకపాత్రంబులై ॥ క ॥ అని శ్రీవైశంపాయన । మునిముఖ్యుఁడు దెల్పవినిప్రమోదాన్వితుఁడై । జనమేజయుఁడవ్వలికథ । యనఘా వినవలతుఁ దెలుపు మనియడుగుటయున్ ॥ మ ॥ తనయాగ్రేసర రామదాస విలసత్సాహిత్య హృష్యన్మనో । వనజాశంకరదాసగానకలనావైయాత్యావీణానువా । దన సమ్మోదనపద్మనాభ పరితోదారార్థశృంగారఖే । లన పద్యాదరరంగశాయిమధురాలాపప్రియంభావుకా ॥ క ॥ లక్ష్మ్యంబికామనోహర । లక్ష్మీకరుణాకటాక్షులక్షణలీలా । లక్ష్మణవాణీవైభవ । లక్ష్మణపూర్వావతారలలితాకారా ॥ కవిరాజవిరాజితము ॥ ధనపతి తారణదుర్మదతారణదాన యుతారణరంగహరా । ఘనగిరివారణగర్జితవారణగంధిలతోరణమధ్యపురా । యనఘవిచారణహర్షితచారణయంబుధిచారణకాంతిఝరా । వినమితకారణవీరనికారణవిక్రమకారణదైత్యహరా ॥

గద్య ॥ ఇది శ్రీరామభద్రదయాభిరామ భద్రకరుణాకటాక్ష వీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట్రభాషా కవిత్వసామ్రాజ్య ధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవులనాగనామాత్యసుధాసముద్ర సముద్భవపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతంబైన దశావతారచరిత్రంబను మహాప్రబంధంబునందుఁబ్రథమాశ్వాసము.

మొదటియవతారంబగు

మత్స్యావతారంబుసమాప్తము.







# కూర్మావతారకథ.

## ద్వితీయాశ్వాసము.

శ్రీనారీమణికరుణాం । భోనిధిసంభవవిచిత్రభోగానంద । స్థానవి
చక్షణచంచ । న్మానాగుణకృష్ణపద్మనాభునికృష్ణా ॥ గీ ॥ అవధరింపుముజన
మేజయక్షితీశ । శేఖరునకిట్టులనువ్యాసశిష్యమౌని । ధారుణీనాథకూర్మావ
తారమిఁకను । దెలియఁజెప్పెదవినుమని తెలుపఁదొణఁగె ॥ గీ ॥ జగముసృజి
యింపఁబోషింపసంహరింపఁ । జాలుమూర్తులఁగనిపెంపఁజాలినట్టి । యత్రి
కనసూయకునుసాటినైనమౌని । దంపతులుగల్గు రెజగత్త్రియమునందు ॥ క ॥
ఆదంపతులకుగిరిక । న్యాదయితాంశమునఁబుత్రుఁడనఁబొడమిస్వతః । ప్రా
దుర్భూతజ్ఞానుం । డైదుర్వాసస్తపోధనాగ్రణివెలయున్ ॥ క ॥ కోమలప
ల్లవనిభవా । సోమునిఁబరిపీతవసనసోమునిసుషమన్ సోమునిఁబోలినదుర్వా
సోముఁనినుతియింపఁదరమెసోమునికైనన్ ॥ క ॥ ఆలీలాశివుఁడానం । దాళో
లపయోధిమగ్నుఁడైయెల్లపుడున్ । బాలునివలెనున్మత్తుని । పోలికఁజరియిం
పుచుండుభువనములందున్ ॥ క ॥ అతఁడొకనాఁడుసువర్ణ । క్షితిభృత్తట
విహరణంబుసేయఁగనత్యా । ద్భుతమైయొకవాసనరా । మతినెంతయుఁజెలఁ
గిభృంగమార్గోన్ముఖుఁడై ॥ సీ ॥ గంధర్వ భామినీ గానశ్రుతీభవతీరాచకసిక

షట్పదోద్గీర్ణరవము । కపిధూతశాఖిశాఖాపతజ్జాంబవ గ్రహయాళుమునికన్య
కాజనంబు । లగ్నకాషాయకాలస్కంధ మిషతటిత్వద్విలోకననటద్బర్హి
ణంబు । శుకదష్టమాకందమకరందవాహినీతరణలీలాలోలహరిణకులము। స
తతమునిదత్తహవిరన్న జనితతుంద। భారసుత్రామవహనదుర్బలఘనప్ర। కా
మబలవర్ధనోద్దామహోమధూమ। పావనంబగునాకశ్రుతపోవనంబు॥గీ॥కాం
చి తత్రత్యమునులాకస్మికముగ । తనునిరీక్షించియయ్యష్టతనునిఁగన్న । కర
ణిభక్తియొనర్పఁగ్రేఁగంటఁగోనుచు। వాసనాహేతువరయుచువచ్చి మేదు
ర ॥ సీ ॥ చిన్నిప్రాయము దానిఁజిన్నారిపొన్నారి యంచరానడలసోయగము
దానిఁ। గోదమగుబ్బలదానిఁగ్రొమ్మించుగ్రమ్మించు నెమ్మేనినిగనిగన్నిగలదాని।
ముద్దుపల్కులదానినిద్దంపుటద్దంపు ముఱిపెంపుసోము నెమ్మోముదాని। రవ
లపావలదానిరంగారుబంగారుతమ్ములఁగేరుహస్తములదానిఁ। జెలువుగలదా
ని నెఱనీటుగులుకుదాని । సొగసుగలదానిబెళుకుకందోగలదాని । సొలపుగ
లదానినొయ్యారమొలుకుదాని । నొక్కవిద్యాధరినిఁగాంచెయోగివరుఁడు॥
గీ ॥ అప్పుడాకయించుకేనియయ్యతివతంస। మాత్మఁజలియింపఁడీశ్వరాంశ
వతారుఁ । డీమహామహుఁడంచు మోహింపఁజేయ। వెలఁదిచేఁగాఁబోలునవ్వే
డవింటిజోదు ॥ సీ ॥ అతనుజపావృత్తినలరారుచెలికేలుదారసీనస్ఫటికాక్ష
సరమనంగఁ । బాణిపంకజమునఁ బ్రభవించియొంటొండదిగజారు తళుకుము
త్తెపుసరియన । హస్తాభిధానమోహాతిశయంబున ప్రాలిననక్షత్రమాలికయ
నఁ । గమనీయనవ్యశృంగారకరోర్మికాపరిపతజ్జలబిందుపాళియనఁగ । నఖ
రనిష్క్రాంతకాంతిసంతానమనఁగ । మధుకరాకర్షణఘుటికాసమాజమనఁ
గ । హస్తగతకంతుభాగ్యరత్నాళియనఁగ । నలరుసంతానసూనమాల్యంబు
గాంచి ॥ గీ ॥ మేలుగావలెబాలనీకేలిపూల। దండగనిచేరుమౌనిమార్తాండుఁ
జూచి । దండనుండుపధూటికై దండవదలి। దండముని కేలుమోడ్చి వేదండగమ
న ॥ క ॥ కులుకువలిగుబ్బెగుబ్బలఁ। జిలుకుంబయ్యెంటఁజక్కఁజేర్చుచుఁబలికె।
న్గలకంఠబెళుకుకన్గవ । తళుకులువేఁజాకరకుసుమదామముగూర్పఁ ॥ఉ॥ఓ
మునిసార్వభౌమతపనోపమధామగుణాభిరామను । త్రామముఖామరుల్భావ

సుదంచితకీర్తులు సన్నుతింపఁగా । నేము నుతింప మీపదము లెన్నఁడు నేఁగను
ందు సేయనే । డీమెయి సంభవించె ఫలియించెను గోరిక లెల్లఁ గొల్లగన్ ॥ క ॥
కావలసినఁ గైకొనుమా । పావనముగఁ గాక నాదుభవమదవీయం । బీవనమం
చుమునీంద్రున । కావనితప్రసూనదామము మోదమునన్ ॥ క ॥ ఇచ్చినమచ్చి
కఁబుచ్చుక । యచ్చెలి మెచ్చుచు మునీంద్రుఁ డౌదలఁ దాల్చెన్ । జిచ్చరకను దే
వరసైపి । నచ్చరినది దాల్చి చెలువ మచ్చుపడంగన్ ॥ గీ ॥ ఇటులఁ దాల్చి సం
తుష్టహృదయుఁడగుచు । నలికరమునఁ గైకొనియమతమ్మిఁ । గన్నుఁగవనొ
త్తికొనుచు వత్సంబుఁ జేర్చి । కంఠమున వైచి యవల నుతరింపఁ జనుచు ॥ సీ ॥ గం
ధర్వాలగ్రభాగమున జోడనమించు ఘోటులధుమికించుకొనుచునడువ । వెను
దంధనుద్దండ వేదండ కాండము ల్పమదమంథరయానసరణినడువ । నిరువం
కలకలంకవరరత్ననిర్మితహాటకరథకోటులలరుఁ జేర । వెలిదాలు గ్రమ్మించు వి
చ్చుకత్తుల వేల్పుమూఁక లెల్లెడలఁ గ్రమ్ముకొనినడువ । రంభ నాట్యంబు మిగులసం
రంభమెసఁగ । వెల్లయేనుఁగు నెక్కి రీవెల్లమెఱయ । వెలయు వేడుకవాహ్యాళి
వెడలివచ్చు । నమరనాయకుఁ గాంచి సంయమివరుండు ॥ గీ ॥ చేతిపూదండ
మీఁద వైచిన సురేంద్రుఁ । డదికరంబునఁ గైకొని మదకరీంద్ర । కుంభమున నిల్పెఁ
జెలువ వ్యోశంభుశైల । శృంగసంగతగంగాతరంగిణియన ॥ గీ ॥ అంతఁ జం
చలకుంభికుంభాగ్రనిహిత । పుష్పదామంబు దిగజారి భూమిఁబడియె । దేవవి
భురాజ్యగర్వత మోవినాశ । సూచకంబయి పడుతోఁకచుక్కయనఁగ ॥ వ ॥
అంత ॥ క ॥ శీకరమదధారాజల । శీకరభీకరము ప్రోల్లసితమధుపాళీ । శ్రీక
రమాకరమునగం । ధాకరమాల్యంబు దిగిచి గుత్తుటెఁగడఁకెన్ ॥ గీ ॥ చరణ
ములఁ ద్రావి కర్ణదేశములసోఁకి । యాశ్రితాళులు మొఱవెట్ట నాలకించ । కలరు
సరిరాచెమడకరియెఁ లెకాదె । యాశ్రితులయుక్తు లేలమదాంధులకును ॥ క ॥
ఈమెయిఁ బ్రానిచ్చిన సుమ । దామము సామజము గదిచి తరఁబోరలింపం । గా
మునిగనుఁగొని దోలుతం । గా మునిహరియించు హరునిగతి నుగ్రుండై ॥ చ ॥ క
టతటముల్ చలింపఁగడకన్నుల నిప్పుకలుప్ప తిల్లభూకి । కుటినటియింప నెమ్మొ
గము కోటరవిప్రతికోటి గాఁగని । స్ఫుటపటుదీర్ఘనిశ్వాసనముల్పలితంపుశిఖ

ల్విదిగ్వ్యఁగాఁ గిటకిటపండ్లు గిటిపలి కెంజటిభూజటాట హుంకరింపు దుక్ ॥ ఉ ॥
కన్నుఁ బ్రహ్మ రెండవసఁగఁగా నగఁగ లేవని గౌతముం డుదాఁగ కన్నులు వేయు సం
గనధికంబు గనష్టమదాంధకారసం । ఛన్నము లౌట చేఁ దెలియఁజాలవు దన్మద
కారణంబునిం । కన్నిను గూడ నీయకుపకారము చేసెదఁ జూడు వాసవా ॥ ఉ ॥
ఏమనవచ్చు నింకఁ గసురేశ్వర నే సుమదామ మిచ్చినన్ । స్వామిమహాప్రసాదమ
నిచయ్యావనం దిప్రమోదలక్ష్మినె । మ్మోము వికాసమొంద నిజమూర్ధ్నమునం
ధరియింపకీగజ । గ్రామణి చేతికిచ్చికసుగందవొనర్చితి ధార్త్యమెన్నఁగన్ ॥
ఉ ॥ ఇంచుకఁగాని మేమెఱుఁగ మేభవదీయమహాత్వమోరిసం । క్రందననన్ను
నెవ్వఁగఁగాంచితివిప్పుడు విప్రుమాత్రుఁగా । డెందమునందలంచితి వొడెప్పర
మప్పని నన్ను విన్న గో । విందధృతాబ్జరోచిరరవిందభవాదులు దల్లడింపరే ॥
చ ॥ ఎఱిఁగెదు గాక మాటలిఁక నేటికి నేటికి మాటిమాటికి । స్మఱచితె నా మహా
త్వము సమస్తజగజ్జనగీయమానమై । మెఱయు వసిష్ఠముఖ్యులగు మిక్కిలి శాంతు
లరిఁజూచితో । యతిముఖివజ్రశుంఠవ్వగదాయవిదారణకారణాయుదా ॥
చ ॥ అలకవు బ్రహ్మహత్యకుఁ బరాంగనసంగతికోట లేదు జ్ఞా । తులపగనీకవశ్య
మగుదోసము సూడవు యజ్ఞవిఘ్నముల్ । సలుపుట కైపరోన్న తకిన్సైఁపవు నీకు
సురేంద్రపట్టమున్ । నిలిపిన ధాత దూఱవలె నిన్న న నేటికి గోత్ర నా ॥ సీ ॥ అ
విపక్షవిచ్ఛేదవాయుత్రకరుఁడవీవ విపక్షరక్షణోదారుఁడ నేఁడు పాకశిక్షణద
క్ష పవి యేవు సర్వతోముఖపాకపోషణోన్ముఖుఁడ నేఁడు । ఘనశిఖలాబంధకర
ణలోలుఁడ వీవు బహుఘనజీవనప్రదుఁడ నేఁడు । పుణ్యజనద్వే పూరితాత్ముఁ
డవీవు పుణ్యజనావాసకర్త్యుఁడ నేఁడు । సతతసత్వవిభాసి రా పగుణాతిదూ
రుఁడద్భుతవనధినిస్తుల్యుఁడెందుఁ । దలఁపఁ ద్రైలోక్యలక్ష్మియా న్యోజేరు । నీ
కు నెవ్వోదియుఁక మీఁద నిర్జరేంద్ర ॥ క ॥ భూసురులకు నవమా ము । సేసిన నె
టువంటివాని శ్రీయు వెలయునే । వాసవ మముఁ బోటులకుం నం జేమిచిం
త చేయఁగవంకన్ ॥ చ ॥ అనవిని గుండె ఝల్లన సురాధిపుఁ డభ్రమువల్లభంబు
చ । య్యావడ గివ్లైవాటు గభుజాగ్రమునం దగు మేనిజాళువా । జిసుఁగు మెఱుం
గు బంగరువు చేల చెఱుంగు కటీతటంబునం । బెనఁచి మునీంద్రు పాదములమీఁద

ట్రవాలివినీతిమీఁదఁగలె ॥ క ॥ స్వామీ నేమి దాసుఁడ। నామీఁదం గోపమునుంచవా యమెకరుణా । క్రోధములకటాక్షవీక్ష । శ్రీమెఱయఁగఁ బ్రోవనతులుచేసెదమీ కుఁ ॥ క ॥ భవనిభమీరిపు డెన్నిన। యవగుణపుంజముల కెల్లనాస్పదమగున్యే నవివేకినౌదునైనన్ । భవదంఘ్రులుచేరినాఁడఁ బాలింపుదయన్ ॥ క ॥ నేరిచిననేరకున్నను । గూరుచుకొని రాకమీరెక్షోపించినని । వ్వారికమాకుశరణ్యాబు । కారుణ్యంబుంచవయ్యా కరుణావార్ధీ ॥ క ॥ పెక్కువగలహరియిటు వలెఁ । బెక్కువగలవేడమానిపృథుహుంకార । మ్మెక్కువగలఁజేయఁగలో। మక్కువగల యట్టులని మెమఘవునితోడన్ ॥ గీ ॥ విబుధనాయకనీవెంత వేడికొనిన । నాకుదయరాదు శాంతియెన్నఁడు నెఱుంగ। నట్టిమానులు వేఱెమమ్మెట్టులఁగనకు । కఠినచిత్తుని దుర్వాసుఁగా నెఱుంగు ॥ గీ ॥ గౌతమాదులునిన్నాకథనునిఁజేసి । వినుతిసేసిననీవును విష్ణువీఁగి । యిటులనవమతిచేసితి వింతెకాని । యెఱుఁగలేవైతిమమ్మెకయించుకైన ॥ సీ ॥ తనకుఁ బ్రత్యుత్థానమొనరింపకుండినతమియించుకొనబృహస్పతిని గాను । దనభార్య బలిమిఁబట్టినఁజూచుకొని తాళు కొననేనుజోతథ్య మునిని గాను । దానంపిన త్రిశంకుధరణిఁ ద్రొబ్బఁగనుగాంచియును సైరింపఁగౌశికుఁడఁగాను । దనయాగమున నాయుధమును వైచిన తప్పుఁబాటింపమికి గురుభార్గితగాను । దనకళత్రంబులోఁ జేసికొనుటమెఱిఁగి। యమితనేత్రములొసఁగగౌతముఁడఁగాను । వసుధనక్షాంతిసారసర్వస్వమగుచు। వెలయుదుర్వాసుఁగాననుఁ దెలియుమింద్ర ॥ గీ॥ ఊర్వశీనందనుఁడు మేనకోపభర్త। వేగనీయిల్లుగాచి దీవించియక్ష। తంబులొసఁగెడివారునీతప్పుసైఁప। వలయుఁగాకేల సైరింపవలయు మాకు॥ మ॥ కుటిలభ్రూకుటికంబు క్రోధదహనక్రూరజ్వలజ్జ్వాలికా। చటులాక్షంబు రథచ్ఛటాకీటకిటాస్వానంబు శేషాహివి । స్ఫుటఫూత్కారకరాళనిశ్వసన సంపూర్ణంబు ఘూయోనట । త్కటమామద్వచనంబుగన్గొనఁగశక్యంబే పురారాతికిన్॥ క॥ త్రైలోక్యరాజ్యసంపద। చాలావశమయ్యెననుచుఁజర్చింపంగా। నేలాయిఁకక్షీరాంబుధి। పాలౌనసిచనిమెమానిపాలకుఁడధిపా॥గీ॥ శాంతిలిదితంద్రియనసూ। యజనసియనజఁ।డమృతదీధితియట్లయ్యెనాగ్రవృత్తి। వినువలేఁడవ్యాసర్వ

లావులు చలింపఁగఁ దలదిక్కులకున్నై గరుడకులము । నిరవలంబంబునఁ దిరుగుచుఁ
జెలినోరు చెఱచుచుఁ జనియెఁ గిన్నరకులంబు । జోడనవీడి యచ్చోనిబ్బరపుఁబ
ర్వనసై దాఁటుదోడఁ గెఁ గంధర్వకులము । వెఱచి తా నాకులవృత్తిఘనముద్రిప్పి
పాత్రాళముం జొనప్పన్న గపతి । కౌశికాదులు పగతైనఁ గానలేక । గన్నుఁగప
లంమఁగి బిలంబు గప్పికొనినఁ । బలుచెనెల్లెడ బలిదష్టబలము మించి । కాంచ
నకోటిశిఖరంబు మాక్రమించినపుడు ॥ వ ॥ ఇవ్విధంబున బలిప్రతాపతపనతప్తంబ
గుచు పగఁ జెలితి పౌరుషరసాసారంబగు స్వర్గకాసారంబున సిలువంజాలక నిఖిలాని
మిష జాలకంబు సంచలింపుచు జీవనప్రదుండగు సరస్వతీరమణుం జేరంగోరి మే
రూపరిభాగభాగనితరసాధారణామణిగణాలోకచ్ఛన్నవిలోకిలోకావలోకం
బగు కమలభవులోకంబునకుఁ జని॥ సీ॥ వెలిదమ్మి రేకుపొత్తులచిన్ని పాపఁడునలు
మోముదమ్ముల వెలయుసామి । తళుకు బంగారు తొకకలవారువము జోదుబ్ర
తుకు ప్రొద్దుల లెక్క వ్రాఁత కాఁడు। కడుపు బంగారు బాకసము సేసినదొర
జీవసూత్రముల సృష్టించు జాణ । కెందమ్మిగద్దె యెక్కిన వేలుపుల పెద్ద పలుకుఁ
బూబోణికిఁ బ్రాణపదము । దినముఁ బోరిడు గాయకుఁ గనిన గేస్తు । కలిమిజ
వరాలునోముకకన్నబిడ్డ । కంతుగాఁదిలితోఁడులోకముల తాఁడు। నలువ గొ
లువున్న కనకమంటపముఁ జేరి॥ క ॥ అష్టదిగీశాదిసురుల్ । సృష్టను సాష్టాంగ
మెరఁగి స్వామీ కరుణా । దృష్టినిదృష్టింపుము బలి। దుష్టావష్టంభ మెల్లఁ దొలఁగిం
పు వెసన్ ॥ మణిగణనికరము ॥ అనిమరియును వినయముదగ విబుధు । ల్వనరు
హాభవపదవనజయుగముకైఁ। గనకమగుటమణిగణనికరరుచుల్ । పెనఁగొ
ననని సలిపిన విధిగరుణన్ ।' తరళ ॥ తరళభావముఁ జెందనేటికి దైత్యదానవ
కోటికిన్ । సరళనైఖరిముజ్జగంబులఁ జాలఁబ్రోదియొనర్పఁగా।గరళకంధరుఁ
డున్నవాఁడికఁ గ్రక్కునన్ రజతాద్రికిన్।తరలఁగావలెనంచుఁ జెచ్చెఱఁదమ్మిగ
ద్దియడిగ్గినన్ ॥ సీ ॥ ఒఱగంట మెఱుఁగెక్కు నొఱయంగఁగల తొక్కు హొన్నం
చుపక్కెరయు దుట్టుసూపఁ। దళుకు కారు మెఱుంగు దొలఁకుముకుమెఱుంగు
పగడపు సుపపెరఁదిగిదిగిర్చ్చ । సంజకెంజిగ నేలుచరణయుగ్మముడాలు వలయం
పు పంతి చెల్వంబుసూప। ముక్కునస సీయాఁడుముదురు తామరతూఁడుము తా

లకళ్లెంబునురువు నెఱపఁ । గళుకు మెఱుఁగు డాయలుభయభాగములయందుఁ।జి
లికిజగజంఘజల్లుల చెలువునింప । మలయునారాయించకొదమసాహిణినొక్క।
సాదితెచ్చినఁజూచి ప్రసాదియగుచు ॥ మ ॥ ఎలమి న్బంగరుటెక్క పక్కెర
హయమాయీ తేజిదాఁటింపుచు । న్నలుమోమయ్య హఁటాహఁటంగదలెఁజెం
తంగేరి జేజేలరా । యలుసాహెబాయని హెచ్చరింపసుభటోద్యత్ఖడ్గకాంతిచ్ఛ
టల్వలిపెంపుం జెలివల్వపావడలువైవస్తందుభుల్మ్రోయఁగన్ ॥ శా ॥ ఈ
లీలన్సురలెల్లరున్గొలువవాణీశుండుశీఘ్రంబుగాఁ । గైలాసంబునకేగి శంభునన
కుందతాత్పర్యంబెఱింగించిన : న్బాలాక్షుండొకకొంత సేపుమదిలోభావించి
వైరోచని । న్దూలింపన్ హరివేఁడఁబోదమనితోడ్తోసంభ్రమంబెచ్చఁగన్॥ఉ ॥
గుబ్బలిపట్టిగబ్బివలిగుబ్బలజొబ్బిలుతావికుంకుమం । గబ్బొనంగఁజాలునె
వఁగప్పినబొబ్బలివన్నెపచ్చడం । బబ్బురమైతనర్పఁబ్రమథావలియుబ్బుచువెం
టనంటఁగా । గిబ్బవయాళితేజిదుమికింపుచువచ్చెమహేశుఁడత్తఱిన్ ॥ క ॥
ఈరీతిసకలసిర్జర । వారముగొలువంగభవుఁడువారిజభవుఁడున్ । శ్రీరాం
భోనిధితీరముఁ। జేరినతుల్సలిపినుతులుచేసిరిభక్తిన్ ॥ సీ ॥ ఎయ్యదిప్రకృతివి
హీనమైసచ్చిదానందనిత్యప్రపూర్ణతవెలుంగు । స్వగతసజాతివిజాతీయభే
దముల్ గాంచునెయ్యదిసర్వకాలమునను । జీవేశ్వరాఖ్యలఁజెలఁగునెయ్యది
యవిద్యయువిద్యయునుపాధినైతనర్చు । జ్ఞానంబుజ్ఞేయంబుజ్ఞాతయుఁదాన
నైమవర్తించునెద్దిసర్వంబునందు । నట్టివేదాంతవేద్యమాద్యంతరహిత। మమ
లయోగీంద్రనిష్ప్రపంచాభిధాన । లక్షలక్షితమపవర్గలక్షణంబు । నైనబ్ర
హ్మంబు మూర్తమైయలరుఁగాఁతే ॥ సీ ॥ ఎవ్వాఁడుతత్త్వమసీతివేదాంతవా
క్యంబువాచ్యార్థమైయలరుచుండు । నెవ్వనికనుసన్న నీచరాచరములంబుట్టిం
చుమాయయద్భుతముగాఁగ। నెవ్వఁడుపరయోగిహృదయాబ్జమునఁబరంజ్యో
తిస్వరూపుఁడైయొప్పమిగులు । నెవ్వఁడులక్ష్మీసమేతుఁడై క్షీరాబ్ధిఫణిరాజుశ
య్యపైఁబవ్వళించు। నెవ్వఁడఖిలజగత్త్రాణహేతుభూతుఁ । డెవ్వఁడానతస
జ్జనాభీష్టదాత । యెవ్వఁడఖిలగుణాస్పదమెంచనట్టి । శ్రీవధూనేతసాక్షా
త్కరించుఁగాఁత ॥ వ ॥ అనియివ్విధంబుననంభోజసంభవశంభుదంభోళిధర

పక్షులదంభగంభీరవచోనిగుంభనంబులం బొగడుచున్నసమయంబున ॥సీ॥
దళమహాపద్మధనదత్తుఁడగువాఁడు పద్మాప్తవత్సవిభ్రమమువాఁడు। కరగ
తశంఖచక్రవిజృంభణమువాఁడు మకరకుండలదీప్తిమలయువాఁడు। భావిత
చ్ఛపరూప భావకుండగువాఁడు శ్రీముకుందాఖ్యచేఁ జెలఁగువాఁడు। ఘ
నసారకుందచందనకీర్తిగలవాఁడు నీలమేఘచ్ఛాయ నెగడువాఁడు। శ్రీవరఖ్యా
తిచే విలసిల్లువాఁడు। శ్రితనవనిధానరీతి వర్తిల్లువాఁడు। నఖిలలోకైకరక్ష
కుఁడైనవాఁడు। హరిగృహామయమూర్తిప్రత్యక్షమయ్యె ॥గీ॥ ఇట్టులఁబ్రత్య
క్షమయిన సర్వేశ్వరునకు। నపనిసాష్టాంగమెరఁగి బ్రహ్మాదిసురులు। నిర్భ
రానందమగ్నులై నిలిచియున్న। వారిఁగనుఁగొనియా దానవారి యనియె॥సీ॥
ఒకముఖంబున సృష్టి యొకఁగూడఁ జేసి చాగమునవచ్చితి వేమి కమలగర్భ। ధర
ణిభ్రమింపంబెంపు దొరకఁడేమె నెచిక్కసగమైతివిదియేమి చంద్రమౌళి। వేయి
భంగులకుఁగాపింపఁ జాలోచనక్రమము స్వాస్థ్యము లేదె ఖచరనాథ। దెస
లనొందినయట్టి తీరుగానఁగ వచ్చెఁ బలుకాడరేమి దిక్పాలురార। పెక్కువ
గలొంచెదవదేమి బిసరుహాప్త। చిన్నపోయెదవదియేమి శీతకిరణ। యితర
సుమనస్సులార మీరిట్టులవాడి। యుండ నేటికి నా మోదముడిగియనిన ॥గీ॥
అంబురుహగర్భుఁడనియెలోకైకనాథ। సహజమే సృష్టి యేమియుసాఁగనీక।
బలి నిలింపుల నెల్లఁ జంపఁగఁ దొడఁగెఁ। గించిదవశిష్టమయ్యె స్వర్గికులమని
న ॥క॥ ధననాయకసఖుఁడిట్లను। వనజోదర భైక్షమెదివసుధాస్థలిలో। జన
మెల్లబలిరుపాభా। జనమయ్యెన్నికరిమనినశక్రుండనియెన్ ॥గీ॥ స్వాస్థ్య
మెయ్యదిజలజాక్షశక్తిమెఱసి। నాఁడె స్వర్గంబు గైకొనినాఁడు బలియె। మె
న్నిభంగులఁ దలఁచిన నేమిగలదు। స్వామివారికృపాకటాక్షంబులేక ॥గీ॥ అ
గ్నిఁ బకోనదేశతలనిరిభక్తి। జైత్రగతిమించ వైరిమాజాతికెల్లు। గలుగునా
మోదమింకిట ఘనుఁడవైన। నీకృపామృతవర్షంబులేక శౌరి ॥గీ॥ అనినవి
వాసటోదరుఁడాదరమునఁ। గలిమిబలిమినినీకులోకములయందు। నీడుజో
డును లేము గావుయింద్రయేల। పలుకనోడిదివనపజ్రపాణివలికె ॥క॥ సర్వేశ్వ
రనినిపించెద। సర్వము విననవధరింపు సంపదలెల్లన్। దుర్వారతరదురాగ్రి

హా । దుర్వాసశ్శాపమునను దోయిధిఁ జేరెన్ ॥ గీ ॥ కానని శ్రీకమైన నాకంబు
నందు । నిర్వహింపఁగలేనై తిసీరజాక్ష । కలిమి సాలని వారికిఁ బలిమి గలదె । యిం
క నెయ్యది బుద్ధి సర్వేశ యనిన ॥ క ॥ ఓ నాయియింద్ర నా యెద । పైనుండె
డురమను గానఁ బ్రణయపుటలుకన్ । బూని యెటనిల్చెనోయని । యేనుండితిఁ
గాన జలధికేగుట యెఱుఁగన్ ॥ ఉ ॥ అక్కట లక్ష్మిఁ బాసి క్షణమైనను నేను వియో
గవేదనం । జిక్కఁగలానె యెట్లయిన శ్రీతరుణీమణి వచ్చునట్లుగా । నాకయియు
పాయ మెంచవలె నూహ యొనర్చితి లక్ష్మి రాకకున్ । గ్రక్కున వేల్పులెల్ల నమర
త్వముఁ బొందుటకున్ సురోత్తమా ॥ గీ ॥ కవ్వముగఁ జేసి మందరక్ష్మాధరంబు ।
వాసుకిని త్రాడుచేసి దుర్వారశక్తి । జలధి మథియింపుఁ డందునఁ గలుగు నమృ
త । మబ్జగేహిని పొడము సత్యమ్ము సుమ్ము ॥ గీ ॥ అదియుఁ గాక నైరావతా
దు లబ్ధిఁ । బొడముఁ బోయిన వెల్లను బూర్వసరణి । నింతయత్నంబు సేయ
నీకేక దేశ । మునను గూడదు దైత్యులపొందు లేక ॥ క ॥ బలవంతులైన దైత్యు
లు । గొలువఁగనున్నాఁడు బలిఁ గూర్చుకగలశీ । జలధి మథియింపుఁ డమృతము ।
గలిగిన తర్వాత వానిఁ గడవఁగవచ్చున్ ॥ గీ ॥ వినవె యిహామూషకన్యాయము
న ధరిత్రి । నాక్రమంబున నమరేంద్ర యసురవిభుని । తోడ సంధింపు మని పంపెఁ
దోయజాత । నాభుఁ డరుదెంచె వైకుంఠనగరమునకు ॥ సీ ॥ కాళోదరస్వా
మి ఘుషించుఁ బలుమాఱు వలిగాడ్పు దనుఁ జేరవచ్చెననుచు । శుకనారదాదు
లఁ జూడంగ నొల్లఁడు శుకనారదాఖ్యలఁ జొప్పడుటను । జెలివిష్ణుఁ దనకన్నుఁ దె
ఱచి దృష్టింపఁడు వామాక్షిరుచులు తీవ్రంబులనుచుఁ । దనదు పేరిచ్చి పెంచిన
మాధవుని జెట్లపాలుగఁ బంచు శాపంబొసంగుఁ । గన్నకొడుకు సుబగవానిఁ గాఁ
దలంచుఁ । దనువిపాండిమ నీశ్వరత్వంబుఁ దెలుపఁ భృగుసుతాయోగసంతా
పపీడ్యమాన । మానసుండగుచుండెను మాధవుండు ॥ ఉ ॥ అంతట నాదివస్ప
తి బృహస్పతి చెంతకుఁ జేరవచ్చి మా । ర్యంతరకాంతమౌక్తికవిభాంబులు పాద్య
ముగాఁగ మాలికా । దంతురభృంగఝుంకృతులు దంచిత మంత్రములై చెలంగ
న । త్యంత వినీతిఁ దత్పదములందుఁ గరాబ్జములుంచి యిట్లనున్ ॥ మ ॥ భవదా
శీర్వచనప్రభావమునఁ గా ప్రత్యర్థిజాదైతేయుగా । డవలేపాంధతమోవిలేపక

రణోద్యద్దివ్యతేజోవృషా । రవివిద్యోతవికాసిమత్కరశతారంబందునిల్చెక్ రథాం।గవలెన్నిజకరసుర్యనాగపదలక్ష్మీకాంతవాచస్పతీ॥సీ॥ దేవతావళికెల్ల జీవభూతుఁడవౌటజీవాఖ్యనీకుఁబ్రసిద్ధమయ్యె। వాణినీకేవశంవదమైచెలంగుటగీష్పతినామముకీర్తిఁగాంచె । బుద్ధినేమీగూపమునఁ బ్రవర్తింపఁగాధిషణాభిధానంబుదేజరిల్లె । నహిభయపరిహర్తవౌటచేఁజిత్రశిఖండిజాతాభిఖ్య గణనఁగాంచెఁ । దండ్రివలెమమ్ముఁబోషింపఁదత్వంబుఁజెల్ప। నోచుకతమునగురునామముచితమయ్యె । నీమహత్వంబునాకువర్ణింపఁదరమె । జలధిగాంభీర్య దేవతాచార్యవర్య ॥ ఉ ॥ ఇప్పుడదేమొనాదుదురదృష్టమునంబరిభావమొందినా । నెప్పుడునీకటాక్షబలమెంచుటనేభయమందనింకమీ । కప్పులలాశిభర్తసహితుఁడౌటకుపాయముసూడఁదీరుగా । కిప్పనినిర్వహింపఁగలశేయననాయన వజ్రికిట్లనున్ ॥ క ॥ నిస్సత్త్వుఁడవివతఁడతి । దోస్సారుఁడుమీకుసంధిదారకించుటకున్ । దుస్సహముతప్తయోరుభ । యోస్సంధియనంగవినవెరయోదివిజేంద్రా ॥ క ॥ వినుమునాచేనగుగతి । నానావిధములనుదనుజనాథుఁడునెయ్యం । బూనఁగఁజేసెదననితాఁ । బూనుకచనిమొక్ సుపర్వపుంగవుఁడంతన్ ॥ క ॥ ఒకపర్వతగుహదిక్కై । యొకసంయుతుఁడగుచుగురునియోగమనముసూ । చుకయున్నతజిక్ శుభసూ । చకములతోఁగురుఁడువచ్చిశక్రునకనిమెన్ ॥సీ॥ అమరేంద్రనీవంపననుకంపజనియింపఁబొలదిండి నెలజొరిపురముచేరి। వెలిహజారంబుననిలిచిగొల్లలునిల్పఁ బలికినేవచ్చుటదెల్పుఁడనుచు।నవరసంబులవారినసుసరించినవారుసమయంబుగాదనిజాగుసేయ। మంత్రులకెఱిఁగింపమంచిదెయనుటగాకెవ్వరుఁదెల్పరదేమొకాని । యసురపతితేనున్నరమ్మపొమ్మనఁగ నిచ్చ । కములుచేసుకతిరిగెడువాయకుండు । కలహభోజనుఁడతనికిఁదెలియఁజెప్పి। నన్నుఁబిలుపింపఁగానేనునిన్నరేయి ॥ గీ ॥ సమ్ముఖమునకువచ్చుచుఁజనుచునుండు । గరుడగంధర్వ యక్షరాక్షససుపర్వ। బలములెల్లెడఁదోలఁగఁద్రోబ్బఁగవశంబు। గానికక్ష్యాంతరంబులుగడచియవల గీ॥ మయవినిర్మితనవరత్న మయసభాంత । రమునఁజెలువొందుభద్రభద్రాసనమునఁ । గనకశైలాగ్రనీలమేఘంబనంగ। నిండుగొలువున్నబలిదైత్యునేతఁ

గంటి ॥ గీ ॥ ననుఁగనుంగొనినప్పుడె వినయమునను । లేచికూర్చుండుమనెడి
నిలింపవైరి । చేరియాశీర్వదించినఁ జేయిమొగిచి। రమ్మగూర్చుండుమనఁడెం
తరాజసంబొ ॥ గీ ॥ అపుడుమన నారదుండె నెయ్యంబుమీఱ। రాబృహస్ప
తియిందు రారమ్మటంచు । నొదిగిచోటిమ్యనందుఁగూర్చుంటినొదిగి । యి
వ్వలవ్వలదైత్యులట్టిట్టుదొఱియ ॥ వ ॥ అంత ॥ సీ ॥ బలపాకనముచిజంభ
పులోమముఖ్యదైత్యులమనవికెఁ జెవియొగ్గివినుచుఁ। జేరివినీతినాశీర్వాదమొన
రించుగౌతమాదులసుగ్రేఁగంటఁగనుచుఁ । దనధాటిపదములందమునవిన్పిం
చుగంధర్వులకుడుగరల్ దయనొసంగు । నవధారుదేవవేశ్యాభుజంగయటం
చుఁగంచుకుల్పొగడనుత్కంఠవినుచు ॥ హరిహరాదులతోఁబోరనలవిగాదు ।
మానుమనుశుక్రుతోమఱుమాడలుడిగి । కలవెయేవైనవింతవార్తలుదివంబు ।
నందునారదయనుచునయ్యసురవిభుఁడు ॥ క ॥ ననుఁజూచిననేనాతనిఁ । గ
నుఁగొనిసౌభాగ్యత్రమస్తుఘనతరతేజో। వనజాతహితోజ్జ్వలభూ । వనజా
తదితిప్రసూతవరయనిమతియుక్ ॥ మ ॥ బలిదైత్యేశ్వర తావకీనపరశుంభ
త్కీర్తితేజోరుచుల్ । దళమైలోకములాక్రమింపఁగసుధాధామోష్ణధామా
గ్నిమం । డలముల్నీరుమ్మైచనక్ శివునికంధత్వంబుప్రాపించినక్ । గులకాం
తామణిచెట్టఁబట్టుకొనియేగుస్వర్ధిభిత్పార్థియై॥ మ॥ అనిననవ్వుచుదైత్యభర్త
సురలోకాచార్యయేమీప్రియా। జనమన్నన్మటియేమిలేదఖిలముక్ సంపన్నమై
యుండుసీ। ఘనకారుణ్యకటాక్షవీక్షణమునక్ గాంక్షింపనేమున్నదై।నను విజ్ఞా
పనమొక్కఁడున్నదవధానంబొప్పనాలింపుమా ॥ గీ ॥ అమరపతినేఁడునీదునె
య్యంబుగోరి।నన్నుఁబంపినవచ్చితినాయమగుట।నన్నదమ్ములకేలవృథాహవం
బు।గలసియుండుటమేలెల్లకార్యములను॥ వ॥ అనినవిస్మయమానమానసుండు
ను స్మయమానవదనుండునునగుచువిరోధిస్మయమానహరణబలియగుబలియి
ట్లనియె ॥ గీ ॥ నాట్యమీక్షింపనేనొకనాఁడురంభ । నంపుమనిచెప్పి పంపహా
స్యంబుచేసి।కదలికాతరువంపినకండక్రొవ్వు।దీఱెనేనేటికైననద్దేవపతికి॥క ॥వి
నుముబృహస్పతియుఁకనై।ననుభక్తినినన్నుఁగొలిచినసుమన్నింతుక్।దన నేరము
గాకున్న।న్విననేరముదోడితెమ్మునేగమియునినక్॥క॥వచ్చితినిచ్చటికేనువి। యు

చ్చరసులనాథవింటివాబలిమాఱ్క్యమ్మిచ్చకువచ్చినరీతిం। జెచ్చెఱం గావింపు మేమి
చెప్పుదునింకఁ॥సీ॥హస్తీంద్రకుంభంబులప్పళించుకరంబుదనుజపాదములొత్త
ననుపుపఱపు।సురకిరీటములనుంచుపదంబుదైతేయనాథుతేజీవెంటనడవనేర్పు।
వందిమాగధులకైవారంబు వినుచెవివిబుధారిరాకట్లు వినఁగనేర్పుఁ। హరి
యింతుఁ బాలింతు ననుమాట లయ్యజియ్య యటంచు వినయోక్తు లాడఁ
గఱపు। మాబలీంద్రునితోటి నెయ్యంబు గోరి। తేనియీరీతి సేవకవృత్తి గాని।
దొరతనంబులు మెఱయింప దొరకదింక। నీకు నెటువలెఁదోఁచునో నిజ్జరేం
ద్ర॥ వ॥ అనియనుంగాక నేను నిలింపవైరిచేతనంపించుకొనివచ్చు నెడమా
ర్గంబున నారదుం గాంచి నేవచ్చిన వెనుకనచ్చటవిశేషంబు లేమియనియడిగిన న
తఁడిట్లనియె॥ సీ॥ మనకువారికినైకమత్యంబుగలుగు నేపొసఁగదటంచుజంభుం
డునాడి వైరులయందువిశ్వాసంబు గావింపనాయంబు గాదనినముచిపలికెఁ।
గపటంబు గానినికరంబు గాదిదినమ్మఁబోకుఁడీయంచునుబాకుఁడనియె। నామా
టనిజమెయీయమరులతోసంధిగీడటంచునుహయగ్రీవుఁడాడె।దనుజనాయకుఁ
డివియె యోజనల తెఱఁగు। విబుధనాథుండు మానంబువీటఁబుచ్చి। కొలువ
వచ్చెదనన్నను నిల్వరాదె। యింతకన్నను బ్రాభవంబేదియనియె॥ ఉ॥ అన
వినివిప్రజిత్తిదురహంకృతితోనిదియేటిమాటవృ। త్రునిహింతుఁడైనవధించెనసి
తో దితిగర్భము సొచ్చి యింతయు। న్వినివినియుండియుంచుకవివేకము లేక
సురేంద్రుమైత్రిఁగో। రిన నగరే నిశాచరవరేణ్యయటన్న బలీంద్రుఁడిట్లనుఁ॥
గీ॥ ఎట్టివారలుశరణన్న నేలవలయు। వీరధర్మంబు గావునవిప్రజిత్తి। కావ
వలదన్న భీములఁగాఁదలంప। రేలయీయోజనలుమానుమింకననియె॥క॥ అ
నినారదముని దెలిపెను। వినుమటుగావుననిశాటవిభుఁడిటులైన।న్నినుఁద న
భృత్యునిఁజేయఁగ। నెదఁదలఁచినవాఁడుచూడుకార్యంబింకఁ॥మ॥సముద్రైరా
వతకుంభి జృంభితశిరస్సంస్ఫాలనప్రాపితో। త్తమసింధూరవిభాతి పాట
లితహస్తంబుల్ శయాళుద్యుస। ద్విమతాంఘ్రిద్వయమర్దనంబుననుదాద్య
క్ష్మోణితాంమ్రేడితం। బమరంగాంచ రెయింకనోయమరనాథా యెట్లు సైరించె
దో॥గీ॥ దైవగతి యెవ్వరికిదాఁటఁదరముగాదు। చింత సేయంగవలదు దాపంత

యేని । బలికిఁ గప్పంబు లిచ్చుటఁ గొలుచుటయును । న్యాయమటువలెఁ గావింపు
మమరనాథ ॥ క ॥ అని వెచ్చనూర్చి యప్పుడు గా । కనియె నిమిషవిభుఁడు దిగ్వారా
న్వితుఁడౌచుఁ । ధనబలములతోడ బలీన్ద్రునిసమ్ముఖమునకు వచ్చి తోరపు భక్తిన్ ॥
క ॥ దేవేంద్రుఁడు హాయాశతమే । ధావభృథస్నాతపూతమగు మస్తకమున్ ।
దేవా భియాతిపదరా । జీవభూరిమరంబుగాఁగఁ జేసినయంతన్ ॥ చ ॥ ఉరుమ
ణిపీఠినిండు గొలువుండు నిశాచరనాథు పాదపం । కరుహములందుఁ గోక
ములకై వడినంచలరీతిఁ జేంట్లవై । ఖరిఁదులకించె నిర్జరశిఖామణిమౌళిఁ దనర్ఘ
జాతికెం । పురవలు సిద్ధపుందళుకు ముత్తెము లెచ్చు కిరీటపచ్చలున్ ॥ వ ॥ అంత ॥
మ ॥ సముఖాయంచును వేత్రహస్తులు వచించన్ డిగ్గనం లేచి యా । య్యసురారా
తియహార్యపక్షహరణాహంకారి లేలెమ్మటం । చమితోత్సాహముమీఱ నెత్తె
సురరాజ్యశ్రీకచాకర్షణ । క్రమపాండిత్యకలాపిచండిలభుజాకాండంబులం
గొబ్బునన్ ॥ గీ ॥ ఎత్తి కౌఁగిలించి యీవేల్పు మొక్కెఁడు । పెద్దవాఁడవనుచుఁ
బ్రియముమీఱ । భద్రపీఠి నెక్కి పార్శ్వభాగంబున । నొక్క చిన్నిగద్దె నుం
డఁబనిచి ॥ ఉ ॥ అంబరసేమమే మనజయంతుఁడు లెస్సయియున్నవాఁడె హా ।
షణం బెశచీవధూమణికి సర్వసురుల్ సుఖమున్నవారె స్వ । ర్గంబున కేవిరోధ
మును రాదుగదా భవదాగమంబు సా । ఖ్యం బెయటన్నఁ గాంచి కులిశాయు
ధుఁ డిట్లను దైత్యభర్తకున్ ॥ ఉ ॥ ఈకరుణాకటాక్షము కయించుక నాపయి
నిల్చియున్నచో । నేకడమేలుగాక వగపేటికిఁ గల్గెడు దానవేంద్రమై । నాక
లదొక్క విన్నపము నాకసురాధిపనామమేలనీ । వేకులకర్తవై సురల నేలుము
దైత్యుల నేలు వైఖరిన్ ॥ గీ ॥ నేను నీసమ్ముఖమ్మున నిలచియున్న । వారిలో
పలనొకఁడనై వలయుపనికి । నిందునందును దిరిగెదనిదియె నాకు । మనవి కట్ట
డిగా వింపుమనిన నతఁడు ॥ సీ ॥ లెక్కలు లిఖియింప లేఖకాధీశుండు పాకంబు
గావింపఁ బావకుండు । దండధరుండు ముందరబరాబరి సేయఁ జరుఁడై చరింపని
శాచరుండు । నీరధీశ్వరుఁడు పన్నీటిగిండి ధరింప మృగవాహనుఁడు తాళవృంత
మూన । సర్వస్వమును విమర్శన సేయ శ్రీదుండు భూతాళిఁ గొలిపింప భూ
తభర్త । ఖరరుచి సహస్రకరదీపికలధరింపఁ । బాసఁగ విడెమియ్య శతపత్ర

పూగహారి । కడమవేల్పులు దగునూడిగములు సేయఁ । గట్టడయై సర్చి ప్రోచె రా
క్షసవిభుండు ॥ సీ ॥ విడెము చూకుఁ నొక్కవేళ చూకిఁ నందనచేల చెఱఁగు
నఁ జెమటఁ దుడుచుఁ । గొలువుననుండి డిగ్గ నడిగ్గవంతలో దండకై చేరి కైదండ
యొసఁగుఁ । జనవరి ద్దైపడి జారెడు రత్నభూషణము లప్పటికప్పుచక్కఁ బెట్టుఁ ।
జేర్కొని తనుఁ జేరఁ బిలిచిన స్వామి యేపూనతి యిచ్చె దరంబు నిల్చుఁ । జూచి
లపన్నగానక సురక్షివిసరు । నేనిమాటాడినను నుతియించు మిగులఁ । జీ
ట కలిజృంభణంబునఁ జేరి దివిజ । వైరికగ దాళి యిచ్చు కదారి యగుచు ॥ క ॥ ఈ
సమయమునఁ గపనెయ్యము । గానుడువఁగ విశ్వసించె ఖచరాధీశుఁ । దాన
వనాథుఁడు చిత్తము । రానడచిన వారె హితులు రాజుల కెల్లన్ ॥ గీ ॥ అం
తనొకనాఁడు పూర్వదేవాధినేత । సుముఖుఁడై యున్న వేళను జూచి యిం
ద్రుఁ । డాప్తమంత్రులతోడ నెయ్యంబు సలిపి । పలికె నిట్లని సవినయ పదవి
మెఱయ ॥ ఉ ॥ ఈ మదమత్త వారణము లీ జవనాశ్వము లీ రథోత్కరం । బీ సు
థితారివీరభటు లీ దురతిక్రమ విక్రమక్రమం । బీ మహనీయకీర్తి గల దే త్రిజ
గంబు లనేకగాకయా । రాము సన్నవారి కిఁక రాఁగలవారికి నున్నవారికిన్ ॥
ఉ ॥ ఇన్నియు నొంగదా దితిసురేశ్వర దేహమనిత్యమాట సం । పన్నత నిత్య
మంచుఁ దలఁపంబని లేదటు గాన సంశయా । పన్నతనొందెనా మది యుపా
యము గల్గు నె నిత్యతాప్తికిన్ । గ్రన్ననఁ గల్గనేని యెఱుఁగన్ వలయుం దగియున్న
యోచనల్ ॥ గీ ॥ క్షుత్పిపాసాజరావ్యాధిశుష్యమాణ । కాయమున లేదొ
కింత సౌఖ్యంబు దేహి । కదిసవిస్తరఘటితెఁ దెల్పెదను వినుము । దివ్యతేజ
స్సనాథ దైతేయనాథ ॥ చ ॥ కనుఁగవఁ జీకటుల్ గవియుఁ గర్ణపుటంబుల
దిమ్ము గ్రమ్ము మిం । చును జఠరాగ్ని దుర్బలత చొప్పడు నంగములన్ శిరంబు
నెం । చ్చు సితరభోగ్యవస్తువులు సూడ సహింపదు మాటమాత్రమా । డను
మదిపట్టి నాఁకటం బడస్వశమేత్తుణమైన నేరికిన్ ॥ గీ ॥ పెదవి పై కెత్తు నాలుక
పిడచగట్టు । గొంతు తడియాఱి నెట్టుకొంత దడవు । దాహమునఁ గుదక
ములేక యుసనసేసి । కలదె మఱియింతకన్న దుఃఖంబు జగతి ॥ గీ ॥ అన్నపా
నంబులేక యొకదినంబైన । దేహి నీర్గంబైనతో దాగలయు న్లెస్స । వైద్య

వాతాదికజ్వరబాధ లవియు । విషమహేతువు లగుపథ్యవిరహితముఁగ ॥
గీ॥ కలుగునూరేఁడ్లలో నర్ధకాలమపహ । రించు నిద్రయె యానిద్ర రేపు
మాపు । మానియుండినజాడ్యంబు మేనఁబొడముఁ । గన్నఁగవయందునరుణి
మగడలుకొనును ॥ సీ॥ ఇంతకన్నను దుఃఖమిఁక నెందు లేదని తెలుపుచందం
బునఁదలవడంకెఁ । గనుఁగవఁబొరలుగప్పె నెంతేదొ చూతమనొప్పిలికసడలికన్
బొమలు వ్రాల । యౌవనస్తంభహైన్యంబున దేహంబు గుమిలిగుడారునాఁ
గుదియఁబడఁగ । స్వచ్ఛవృత్తిని దనర్చుఁగ ముక్తములగు భాతి నెక్కటిద్వి
జపఙ్క్తు లురుల । ఘనజరాఘాతహుంకృతి నెనయఁదగ్గు । నెఱలసద్వృ
త్తికర్ణవిస్ఫురణ నెంగుల। వృద్ధభావంబువచ్చిన వెనుక జనున। కేమిసౌఖ్యం
బుగలదు దైత్యేంద్ర చెపుము ॥ క ॥ ఇదిగాక శమనకృత్యం । బిదమిత్థంబ
నఁగఁగూడ దీదృశదుఃఖాస్పదమగు దేహంబున నె । వ్వాదిసుఖియింపంగసు
లభమా యెవ్వరికిఁ ॥ వ॥ అటుగావున జరాజ్వరగహనపవనదహనప్రధావ
ధారణత్రు ధావ్యధాముధా విధానావధాన విధా సిధానంబును - ము
ఖముల బిలపల్వల సరసతాప నోదనభీష్మగ్రీష్మ విలాస పిపాసానిరాసంబు
ను - ప్రపంచపదార్థ ప్రజ్ఞానప్రతిబంధకబంధుర రజోనిద్రాముద్రావి
ద్రావణంబును - నానామయాకృతిపురాకృతదుష్కృత మరీచికావికృతిని
రాకృతికృతియును - నంగరాజ్యజీర్ణకరణవిజయయాత్రోదీర్ణజరాబల
నిరోధకంబును - దేహజీవనీరక్షీరభేద విధాన మాంసలహంసజాతపలా
యనమంత్రోపదేశదేశికంబును - సుమనోవిలాస నిత్యయౌవనపవనవికాస
కారణంబును- భోగినీభోగవిభేదాదరమయూరసత్రప్రవర్తకంబును- శృం
గారరస ప్రధానప్రభావప్రభాప్రవాహప్రకామ ప్రవర్షణప్రక్రియాప్ర
వీణంబునై - ప్రావృషిజపయోజప్రసృతామృతంబుచందంబున నందంబగున
మృతంబు సంతరించినంగాని గాత్రంబులు శిష్టభోగంబులకుం బాత్రంబు గాదని
తలంతు నందులకొక్క యుపాయంబు గలదది విన్నవించెదనాకర్ణింపుము॥గీ॥
కవ్వముఁ జేసి మందరక్ష్మాధరంబు । వాసుకిని ద్రాడు చేసి దుర్వారశక్తిఁ। గ
లశవారాశిఁ ద్రచ్చినఁ గలుగు నమృత । మనుచు హరియానతిచ్చె నప్పురసా

థ ॥క॥ నాభ్రమున స్పృహయవ్వలిము। సేవించినసిరిమిగులఁ జెలఁగుచు సభలో
దేవాదులెల్ల భళిభళి। దేవాధిపమంచియుక్తి దెలిపితి విచటన్ ॥గీ॥ అటులనమృ
తంబు గలుగఁ బాలధికముగను। నీకు నెంసగెదమింక సందియము వలదు। తగిన
యత్నంబుసేయుము తడవు సేయ। రాదు వినుమేశు భక్ష్య శీఘ్రంబనంగ॥ క ॥ అ
నియుక్తస్పృహించి మిదెపు। దనుజుల వాక్యములు దేవతాపతి పలుకు। ల్విని స
న్మానించి మంచిదె। యనిబలియును వారిఁగూడియప్పుడెకదలెన్ ॥ గీ ॥ కదలి
మునుపు త్తమోత్తంగ కదళీచంద్ర। కదలినమరావతీపన కదలినెనయ। రంగదరి
భంగసంగరరంగచంగ। తుంగచతురంగసేనాతరంగఁడగుచు ॥ క ॥ మం
దరఁ జనిచని గాంచె। స్సుందరముందుష్టసత్త్వమయకందరమున్। సుందరమున్
శిఖరిశిఖా। పుందరమున్ దివ్యనవ్యమణిబృందరమున్ ॥ క ॥ కనుఁగొనియి
దిగపమందర। మనియుడిగిన బలికి సింద్రుఁ డనియెన్నిజవా। హన ఘనగ
ర్జారవలం। ఘనజాంఘికనవరసార్ధన్ గంభీరోక్తిన్ ॥ మ ॥ కనుఁగొంటే ద
నుజేంద్ర తాపకజయాంకప్రౌఢిగీతాళివే। టగాను గంధర్వవధూమణుల్ స్రత
తముల్ గానంబు సేయంగ రం। గిన వానిటను బొంగి నిర్ఝరము లేగ న్వార్థికా
న్స్మయునో। క్రూనిరక్షించెనటంచు వృద్ధినొసఁగంగా నెంచెనో శైలమున్ ॥చ॥
అనఁజెలువవ్వనవ్విదనుజాధిపుఁడిట్లను నౌవగారినీ। యనుపమబాహుశక్తి దె
లియుస్వీకరించెదు శైలపశుభే। దనచతురత్వమున్నొడివితజ్ఞుఁడవౌనన స్వామి
కెట్లుదో। చెనోయి టు తేగణింపుదునెచిత్తమెఱుంగ దెయుంచునింద్రుఁడున్॥
క॥ ఓయంతవానికుపక్కృతి। సేయఁగలిగెనాకటంచుఁ జెలఁగుచుగిరిరా। జీవె
డనిస్స్వభావిత్యుదార। తోయాశ్రమదర్శుధారదోఁగెడుఁగంటే ॥ గీ ॥ అసుర
నా యకటేఁదుగప్పోషణనూఁ। దలఁచిచెంగావిగప్పిన చెలువుమెఱసెఁ। దు
రగఖురక్షతాంతముగ చుఁగెంచుసాళిపాడమ। నందమైమించునీమందరాచలంబు॥
మ॥ బసిమిక్వోశ్వరకంబెయీగిరిదరీభాగంబులన్వేదుక। ల్వాలయన్ గ్రిడలు
సల్పుకిన్నరసతుల్ జ్యోతిర్లతాదీపముల్। జ్వలియింపందిలకించి సిగ్గునసురో జ
ష్టామపాలాంచలం। బులనార్పింపుసు మూచినవ్వఁగఁబ్రియుల్ స్వార్థత్వమున్మెచ్చు
చున్ ॥ మాలిని ॥ మృగధరమృగనాభిస్పృష్టగండోపలంబు। ల్బృగభుగమ

నుత్తాపుల్పాన్పైనీమందరాద్రి। స్వర్గయువరమృగాక్షీవృత్తవక్షోజకుంభా।
త్యాగణితతులితత్వావాప్తిఁగంటేబలీంద్రా॥ ఉ॥ దానవనాథకంటెవసుధా
ధరరాజముమౌళిభాగసం । దానితతారకాకుసుమధామముగైరికకుంకు
మంబుసం । ధానితమేఘవర్ణరుచిరాంబరమెంచఁగమించెనెంతగా । సానుల
కూటముల్ గలుగుజాణలు సీటులువెట్టకుందురే॥ వ॥ అనియనితరసాధార
ణసుధామధురవివిధవచోరచనల నవ్యసుధాధరంబువినుతించు సుధాశనాధి
నాథునకు విబుధవిరోధిమూర్ధన్యుండిట్లనియె ॥ గీ॥ ఔరమనరాకకలరిమి
న్నెంచియున్న । దీనగేంద్రంబుగదలింపనెవ్వఁడోపుఁ । గలఁడెయటువంటిబలి
యుఁడొక్కరుఁడుదేవ । దానవులలోననబలదైత్యుఁడనియె ॥ గీ॥ అసుర
నాయకనీధృతికళికి శృంగి । కుతలమంటనమందరక్షోణిధరముఁ । జెల్లగిం
చుటయిదియొకపెద్దతికమె । యిందునెవ్వనిచేతఁగాదిట్టిపనికి ॥ గీ॥ దిగ్గజం
బులుద్రొగ్గధాత్రిధరింద్రి । మడఁగఁద్రొక్కుఁడునోలేకయంబరమున । కె
గరవైతునెంతిరిగినగేంద్రమునకు । తెక్కులాదవెనొయంచువిరించిచూడ॥వ॥
అనినవినిబలార్పసురుమెచ్చకజంభుండిట్లనియె॥ క॥కులపర్వతంబులేమను। గ
లయఁగనమ్మొదళులార్పఁగలిగిననాకు।గ్గలమేమందరమెత్తుట। యలమేరువునేక
బగల్పనాదైత్యేంద్రా॥ వ॥ అనిమతియుశంబరారిష్టనేమిత్రిపురవాసజం
భశుంభనిశుంభ హయగ్రీవనముచితారక బాణవిప్రచిత్తివిరోచనహేతిప్ర
హేతిమయమాయావిమాలిసుమాలి పౌలోమకాలకేయనివాతకవచ వజ్ర
దంష్ట్రకాలనాభశరభవృషపర్వ రాహుమహిషేల్వల వాతాపిదుర్నిష్ట
ణోత్కలమేఘదంభ ద్విమూర్ధకేతుక్రోధవశాది నానాదనుజయూథనా
థులు - మందరవసుంధరాధరసముత్పాటనపాటవంబుఁదెల్పుచుసబలీంద్రు
చేఁగనకమణిమయభూషణాంబరాదులు బహుమానంబులుగైకొనుచు మ
హోత్సాహంబునబాహులప్పళించుచు ♦ శంఖమర్దళపటహభేరీధణంధణ
ధ్వనులకుంబ్రతిధ్వనులిచ్చుమందరకందరంబులకుంగుప్పించుచుఁదనుంబెకలింప
వచ్చుటనిచ్చనెఱింగిమచ్చరంబునంబెచ్చువెరిగియుద్ధరంబుందమతోటియుద్ధరం
గంబునకుంబంపినబలంబులోనాదరికుహరనిర్గతశరభశార్దూలగండభేరుండఖ

ద్గసర్పనకంఠీరవ మహోద్దండవేదండ ప్రచండభల్లూకశశచమరశల్యభల్లసా
లగసాలావృకవరాహమహిషమర్కట మహోరగప్రముఖ జంతునికా
యంబుల కాయంబుల కపాయంబుగల్పింపుచును పాయంబులనగ్గట్టుచుట్టువా
రుకొనియిట్టట్టు మెదలక నెట్టుకొని యొకరొకరు కదలించిచూచికదలకున్నఁబ
దుగ్రఘనగూఢ రువేగుహలక్షకోటిసంఖ్యాకులుంగూడికొని నలుదిక్కులండాసి
తోసి ద్రోసియుంగదలింపలేక యుద్దామనిశితకుద్దాలంబులంబెద్దయుం బ్రొద్దు
నాశైలంబుమూలంబుగానంద్రవ్వ నెడనెడం బొడముస్థూలోపలంబులుపెక
లింపఁజాలకయులువకట్టునించిమించినభుజాటంకంబులనగల్చితత్శిలాగర్భం
బులవెడలువహాఘులఁగనియాశ్చెరువందుచునందందసన్నలువై చుచుమత్తియు
నానోపాయంబులంజూచుచునెంకించుకయుందెమలింపఁజాలక సురాసురజా
లంబులుఘర్మకణజాలకంబులందోఁగుగాత్రంబులు సరివన్ని ఘ్యరంబులగు గోత్ర
బులంబోలగుహాముఖంబులువెడలుగాడ్పులచాడ్పున నాసికారంధ్రింబులనీరం
ధ్రింబులై నిట్టూర్పులు చెట్టిదంబుగానడరభుజంబుల బలిమిసడలనెండల్లుజడియ
జడిమనిగుడబడలియున్నవారలంగనుంగొని ॥ క ॥ బలియింద్రునకిట్లనునిటు।
వలెనూరకయుండఁదగునెవరశైలగరు । ద్దళనసమర్థుఁడవయ్యును । భళిభళి
దేవేంద్రయనినబలికతఁడనియెన్ ॥ క ॥ బలజంభ ప్రముఖమహా । బలశాలు
లచేతఁగానిపనియిటవాచే । నలవడునెదైత్యనాయక । యలవెన్నునివేడఁద
గునుపాయంబింకన్ ॥ క ॥ అనివారనందోడొక్కనితాఁ । గనకాద్రికినేగియ
చటఁగమలాత్మునిద । త్తనయుంగనుఁగొనిసాష్టాం । గనమస్కారములు
సేసికార్యముదెలుపన్ ॥ క ॥ వినినవ్వుచువనజోదరుఁ। డనియెసురాసురలు
మీరలందఱునొకగ । ట్టునగల్పలేరెయిఁకనే । యనువున సుధగాంతురనుచు
నహిపతిఁదలఁపన్ ॥ సీ ॥ తన మహాసవ నిరంతరసమ్యగాసక్తికుండలీంద్ర
త్వంబుకుదవుపఱుపఁ । దనశ్రీవహానసముద్భాసితోత్సాహంబుచక్రిభావము
నకౌజ్జ్వల్య మొసఁగఁ । దనభోగినీభోగజనితానుభావలీలభుజంగపుంగవో
ల్లాసమొసఁగఁ । దనమహాబలసముద్యద్విగ్రహప్రవృద్ధియహీనభావంబుదేఁ
టఁబఱుప। సోమరుచియుసనంతవిస్ఫూర్తిభోగి। ముఖ్యతయుభూమిభారణస

ముత్సుకత్వ । మలరఁ జెలువొందు నెవ్వఁడు వారణపణితి । నట్టి శేషాహి వచ్చె
నయ్యవసరమున ॥ క ॥ వచ్చిన యచ్చిలువలదొర । మచ్చికతోఁ జేరఁబిలిచి
మాధవుఁడు ఫణా । భృచ్చూడామణి మందశ । లోచ్చాయమగలించి పేరికొనఁ
గుమటున్నన్ ॥ క ॥ పెకలించి యిచ్చినఁ జాలుం। బ్రకటితదోశ్శక్తి బెండు వలెఁ
దెచ్చెదమే । యొకరొకర మెయని దైత్య। ప్రకరంబులు మదము మీఱి పలుకఁగ విం
చున్ ॥ మందరధరము ॥ మంచి దెయంచును మరుదశనవిభుం। డంచితశక్తి
నినఖిలము గొలువన్ । గాంచనభూస్వరఘనతరమహామో । దంచితమందర
ధరగతుఁడగుచున్ ॥ క ॥ పరివేష్టించె ఫణీంద్రుఁడు । ధరణీభరణాత్మ సా
మ్యధన్యుఁడటంచుం । బరిరంభణమొనరించెను । ధరణీధరమౌళి ననుచు దా
రసూర్తిన్ ॥ మ ॥ ధరణీభారము నేవహింపఁగ మహీధ్రింబయ్యెఁదా నెట్లు
మం । దరమంచల్గెనొనాఁగ నాగవిభుఁడుద్యత్తోఁధసంరంభియై । పరివే
ష్టించి యగల్చెఁ దన్నగము తన్మైభృత్తుంగశృంగాగ్రభం । గురజంఘాలదృషద్ఘ
లంఘలఘులా ఘోషంబు ఘోరంబుగన్ ॥ గీ ॥ ఇటులఁ బెకలించి కరముల కెత్తి
మిగుల । సంభ్రమమున సురాసురుల్ శైలమాని । పట్టఁజాలక మున్పటి పాటు
గొనఁగ । కూలనైచిరి మందరకుధరమవని ॥ గీ ॥ దాన నొచ్చిరి గొందఱత్తఱి
నగారి । ముఖసుపర్వులు చక్రికి మొఱలు వెట్ట । గరుడవాహనమెక్కి యక్కడికి
వడిగఁ । దానవిచ్చేసె భక్తవాత్సల్యమునను ॥ చ ॥ కరివరదుండు వచ్చి ఘన
గైరికరాగము మందరాగమున్ । గరమున నెత్తి పక్షితురగంబు శిరంబుననుం
చ జాళువా । బురుకతెఱంగునం దనరఁ బొంజిగి తెక్కలుగుం దనంపుప। కెక్క
రహారుపూనఁ జంచువునఁ గీల్కొనుచిల్వ ఖలీనమై తగన్ ॥ క ॥ హరిగిరిధరించి
యిటువలె । సరగునఁ జన గరుడు వెంటఁ జనలేక సురా । సురులమనమ్ముల నం
టిన । వెరవరియని గుఱుతులూఁ నివెనకకుఁ జిక్కెన్ ॥ గీ ॥ కోరి బ్రహ్మాండకో
టులఁ గుక్షినుంచు। కొన్న విశ్వంభరునిఁ బూనుపన్నగారి । కపనిధరమేమి భా
రమాయటసురాసు । రులకుఁ జాలవిచిత్రమైయుల కెఁ గాక॥గీ॥ నిమిషమాత్రం
బులో పలనీరరాశి । తటమునకు నేగి హరిని మందరము డించి । వెనుక వచ్చు సు
రాసురవీరవరులఁ । గాంచి చూసి పించుకొని చేగె గరుడుఁడంత ॥ గీ ॥ వాసు

దేవునియానతివాసవుండు । సకలదేవాసురాలికిసమ్మతముగ । వాసుకినినం
తశక్తినివాసుఁబిల్వ। నంపియిట్లనిపలికెఁబ్రియంబుగులుక ॥ సీ ॥ పాలయులర
నొకవేళఁబలుకనిపార్వతివెఱపించికూర్తువువిశ్వనాథుఁ । బావనబ్రహ్మకపా
లమాలికలజోడౌదువాకొల్లాక నాఁడుహారమగుచుఁ। బగడమానికపుఁజెకర
డపుఁగిల్లంకణంబగుదువాకొల్లాక యెడహస్తమునకుఁ । గన్నెగేదగిఱేకుకమ్మ
తావులు వలయుచుతులాకొల్లాక చాయసంపుగాంగ। నెక్కభంగులఁజూడవిశ్వేశ్వ
రునకుఁ పెక్కావెన్వయ్యారుకేవలాప్తు। లట్టినిన్నుఁబ్రశంసింపనలవియగునె। ప్ర
ణుతగుణగణ్యవాసుకిఫణివరేణ్య ॥ చ ॥ తమవహించిశేషుఁడుయశంబుగ
నెక్కమయున్నవాహించినీ । వమృతము గల్గఁజేసినిమంతయుఁబ్రోచిననం
తకన్నను। త్తమమగుకీర్తిగల్గువసుధాధరమంథముఁద్రిప్పనానుగు। న్యాయమువహి
యింపఁగల్గఫలమందఱకున్సరియింతెవాసుకీ ॥ క ॥ లేయని యింద్రుఁడు
సూత్రి। ప్రాయముగానిటులవాడుపలుకునకెంతే । నీయెడమెచ్చునువాసుకి।
యీయకొనియెనంతనిర్జరేంద్రుఁడుగడకన్ ॥ క ॥ వేవేగవజ్రధారన్ । గ్రావ
మునిష్కంటకముగఘనవ్యగసమ్య । గ్రావమ్ములమింపఁబాశ్వన్ । గ్రావం
బులనెల్లనడిరికవ్వముచేసెన్ ॥ అంత ॥ సీ ॥ ఘనకిరీటంబులుగట్టిగా సవ
రించికలితకుండలముల కొలుకులదిమి । బాహాంగదంబులు పదిలంబుగఁదొ
డిగిముంజేకడెంబులు మొగపులరసి । యంగుళీయకముల నటకొన్ని ఘటి
యించిమౌక్తికహారముల్సట్టుపఱచి । మొలదట్టిపైరాలవంకులుపొంకముగఁజె
క్కిపిరిచుట్టిచేలముల్బిగియఁగట్టి । యంతకంతకునుత్సాహమతిశయిల్ల।
నుల్లసిల్లఁబల్లవింపఁగనొండొకళ్ళఁ । బిలిచికొనుచునుదమతమ పేరువాడి।
కొనుచుదేవాసురులుదుగ్ధవసధిఁజేరి ॥ గీ ॥ బంగరు ముల్కట్టురంగుమీఱం
గ వా। నాగభోగము ద్రిపడునుఁజుట్టి। కలశవారిరాశినిలిపిరితమసొమ్ము। మొద
లుపెట్టఁజుట్టిమోపిరనఁగ ॥ వ ॥ అంతబృందారకులుదములోన॥ ఉ ॥ అక్క
టహాసవెంద్రుఁడుబలాఢ్యుఁడుగానఫణీంద్రపుచ్ఛను । న్నకొసిమూఁకకిచ్చి
సుకరంబుగఘోరవిషాగ్ని కీలలన్ । గ్రక్కుఫణాళిమాకొసఁగఁగాదనరాడిఁ
కనేమికార్యము । దిక్కనంచునొండొరులు దీనతమోములుచూచుచుండఁ

త్న్మాధరంబు ॥ వ ॥ ఇవ్విధంబున దుర్ఘటసింధురకంధరంబగు నమ్మందరవసుం
ధరాధరంబు వాతంధయధుర్యాన బంధబంధురంబుగా నఘటసింధుబంధురమ
ధ్యంబునం బ్రవేశించి॥ సీ ॥ శృంగాగ్రదళితవైరించాండగళితావరణధారలనని
ర్ఘరములు దొరుఁగ । నానామహాగుహాంతరసమాధి సనాథతాపసనాథమ
స్తములు దిరుగఁ । గందరాంతరసింహగజగండభేరుండశరభాదులొకటఁ గ్రేళ్లు
రకఁ దొడఁగఁ । గంపితశాఖిశాఖాశిఖాఫలపత్రకుసుమము ల్జడిగొనఁ గురియ
మండఁ జెయుతపురీతోలు గట్టు జేజేల తేఁడు । దిరుపు గట్టు విధంబునఁ దిరిగెఁ గట్టు।
వవ్యభుజశక్తి దేవదానవులుదగ్ర । జలనిధానంబు మథియించు సమయమున
ను ॥ మ ॥ కులశైలాగ్రణి క్రిందమీఁదనడుమ స్థూర్మ్యాదిరూపంబులన్। బలియుం
డై భరియించి దేవదితిభూభాగంబులన్ వారిలో । పలనున్నిల్చి స్వకీయమూర్తిని
జతుర్బాహార్గళ ల్మార్పుచున్ । కలశాంభోధి మథించె మాధవుఁడభంగ ప్రౌ
ఢరూఢిన్ గనన్॥ శా॥ ఈరీతిన్ హరి దేవదానవులతో హేలాగతిన్ ధీరుఁడై। క్షీ
రాంభోధి మథింపఁ గాంచనకటీచేలప్రభశ్శ్రీమకే । యూరాన్యోన్యవిఘట్టనా
నోదితరజంబు జ్వాలసౌవర్ణకో । టీరచ్ఛాయలు పర్వఁ బర్వతము గన్పట్టెం బొమ్మ
హేమాద్రికిన్ ॥ అప్పుడు ॥ శా ॥ రక్షోదేవమిథోట్టహాస హాహాహా రావం
బులుం గూర్మనుం । ధక్షోణీధరఘట్టనాఘుర్ఘురనినాదంబుల్ ధ్రువాకర్షణావే । గ
ట్టుభ్యుఘ్మజగేంద్ర ఘూరిఘటా ఘూతాహారధ్వను ల్ఘూర్ణితో । ద్వృత్తి క్షీరాంబుధి
జంతుఘోషములు మెండై నిండె బ్రహ్మాండమున్ ॥ మ ॥ అఖిలాదిత్యసురాపహ
తభ్రామితమంధానాద్రిఘోషంబుచే । సఖిమైనించుక వెన్నతీటశమియించం
గ నా క్షీరాబ్ధిలో । సుఖనిద్రారతిఁ జొక్కెఁ గూర్మపతి ప్రాంశుశ్వాసవాతో
చ్చలా । బ్ధి [illegible] లన్ దరంగపటలోద్రేకంబు చేమాటికిన్ ॥ అప్పుడు॥ వ॥
[illegible] దత్యుగ్ర [illegible] తంబు మాటికి స్వశ్యం । ఖలసంఘర్షణ
[illegible] । ద్వాలయాభీలకరాళకాలక
[illegible] । దళ చేమాడిరి పెకుఁ దానవులు గర్వం బెల్ల ఖర్వం
బుగన్ ॥ గీ ॥ [illegible]యించుచు దుష్ట కార్యములకుఁ । బూనఁగాఁ జెల్లు
నే యొట్టి పుణ్యులకును । ఘనతయించును భోగిభోగములఁ బూని । దానవులు

ముగ। వనువున హామూనిత్యాశ్లేష జనితపులక । రాజకైతవమునరాగరస మునిండి॥ ధైర్యమునుకట్ట నగిలింపఁదాళలేక। వల్లభునిపొందుఁగోరెనవ్వారి జాక్షి॥ గీ॥ వసుధవాసంతవేళ నెవ్వారికైన । నంగజోద్రేకమొనరించు నం దుమీఁదఁ। గోమకుప్రాయంబు చెలువును గూర్మిగలుగు । దితికిరతివాంఛ యుదు జెత వ్విలసనమున॥ సీ॥ నునుదీవెసురపొన్న పొనఁగొన్నఁగనుగొని ప్రాణేశుఁగౌఁగిలింపఁగఁదలంచుఁ। గోవెలచిగురాకుగొరికినవాధుని యధరంబు గంటిసేయంగి నెంచుఁ। గిముకించిబల్లునిల్లడకకోకిరొద విన్నగళగళధ్వనుల పైగాంచుచిలుకుఁ। దమినిఁబై కొను చకోరములమోహము జూచి పుంభావ సంభోగమునకుఁదివురు। కలికిరాయంచముక్కున గమిచికమలనాళఖండం బుబరికించి నలుపుగాంచి । మమతమొనపంటఁదెలనాకు మడుపుఁగొరికి । చెలువునకునియ్యఁగోరు నచ్చిగురుఁబోఁడి॥గీ॥రామశృంగారకేళికా రామ సీమ।సద్వృశవస్తునిరీక్షణోజ్జ్వలితసురత। కేళిలీలావిలోలయై యాళిజనముఁ। గాంచియిట్లనివల్కె నుత్కంఠమొదవ॥ శా॥ ఈయారామమునంబికస్వర ము లెంతేవింతగాఁజల్లనై। దోయుం దెమ్మెర వేట్కతో రమణుత్తోషంగఁగూడి క్రీడించునా। ప్రాయంపుంజిగురాకుఁబోడులు గణింపన్ పూర్వజన్మంబులం । దేమేనోములునోచి నారలొ కదేయోకిలోరేతుణా॥ ఉ॥ ప్రాయముగాన సంతమునపాయముగావినకర్ణిసూచికా।ప్రాయముగాఁబికస్వరముపాయము గామునఁడేచ నిట్టిచో। దాయఁగదావియోగికిని తాళగరాదను బుద్ధియింతలే। దామెగదామనోహరున కిక్కటనేనిఁకనేమి సేయుదున్॥ క॥ ఉపవా సంబులవ్రతములఁ । దపములఁగృశియించుబడుగు దపసులకేలా। కృపబు ట్టుమన్మథాంగిత। చపలాలోకనలయందుశరదిందుముఖీ॥ గీ॥ కన్నకొడుకు లుమూఁడులోకములనేల। నక్కరాముక్కుఁబట్టుకయనుదినంబుఁ। గ్రిందుఁజ డలంటకూర్చుండుక్రీడయుడిగి । యేమిసాధింప నెంచియోయెఱుఁగరాదు॥ గీ॥ అకటతనకేమికొదువగేహమునసకల । భోగభాగ్యంబులునుమంచి పు వ్వుఁబోండ్లు । గలిగియుండంగ ననుభవకాలమెఱిఁగి । బడయనొల్లఁడుసౌ ఖ్యంబు వెఱఁగుఁదపసి॥ గీ॥ వలపుగలిగిననిండుజవ్వనిని వనినిఁ। గలయుకం

టనుసౌఖ్యంబుగలదె వేశ। యెఱుఁగఁడేమట నాదురదృష్టమింతె। కాక
యాతనిదూరఁగాఁగలదె ఫలము॥ ఉ॥ తానయి చేరఁబిల్చి సురతప్రియుఁడై
యొకనాటికైనను। స్నానముసేయఁగా నెఱుఁగ మానిని యేమని తెల్పుకొందు
నే। నేనయి యెన్నఁడైనఁ దమి హెచ్చినచోఁ దనుఁజేరి యెంతప్రా। ర్థనైన
పదంబులొత్తక్షణమప్పటికేమొ ఘటించుఁగోరికల్॥ చ॥ అనిసురతస్పృ
హాహావిరుదగ్రమనోజశిఖిప్రతప్త। వినయవివేకియై మధుపవేణి వసంతవ
నిశాహాసంతికన్। గనుఁగొనుఁబీలఁగాఁగొనుచుఁగంజదళాక్షులఁ బాసి యొంటి
మై। దనపతియున్నయింటికి ముదంబున వచ్చెఁ బదంబుదొట్రిలన్॥ సీ॥ సం
పూర్ణపూర్ణిమాచంద్రబింబము చెన్ను గన్నప్రసన్నవక్త్రంబువాని। తె
లిమొట్టదమ్ముల నెలిబెట్టగాఁజాలు శ్రవణాంతకాంత నేత్రములవాని। శివశరాస
నశృంగశృంగశృంగారంబుఁగబళించునంసభాగములవాని। నతికఠోరనిజస్త్ర
నాచలక్షోదక్షమంబైన విపులవక్షంబువాని। సూర్యతేజంబుగైకొన్న శుచిక
చంద్ర। కాంతియునొసంగుభంగి దుగ్ధములనగ్ని। హోత్రమొనరించి వేసంజ
హోమశాల। నేకతంబుననున్న ప్రాణేశుఁగాంచి॥ సీ॥ చంకనప్రత్నతా
టంకంబులిరువంకఁ గనుపట్టుఁజంద్రభాస్కరులుగాఁగ। నలతిపయ్యెదలో
నిహారముల్మెలువ వెన్నెలలోనితారకావళులుగాఁగ। వలిపెంపుకుసుమపూ
వన్నెచేలముఁబొంగు జగజంపుసంజకెంజాయగాఁగ। కంకణమేఖలాకటక
ఝుళంఝుళలమితవిహంగనాదములుగాఁగ। గనుబొమలనంగుఁడూనుసిం
గాణిగాఁగ। విప్పుగన్నులు విరిగల్వవిరులుగాఁగ। బటువుగుబ్బలుముకుళితా
బ్జములుగాఁగ। సంజచెలువునఁబతిఁ జేరు కంజవదన॥ క॥ తలవంచిమించిసి
గ్గునఁ। బలుకకనూరకయె యున్న పతియచ్చెలువన్। దిలకించి కలికి యేమొకొ।
తెలుపఁగవచ్చితివ దేమి దెలుపుమటన్నన్॥ శా॥ కించిల్లజ్జితదంతకోరకరు
చుల్కెమ్మోవిపైమించఁగాఁ। చాంచల్యాంచితలోచనాంచలములజ్జాలీ
లసూచింపఁగాఁ।చంచచ్చూతదళాగ్రసవ్యసనకూజత్కోకిలావంచనా। ధుం
చువ్యాహృతిమీఱ నిట్లని వచించెన్ బోఁటిగంభీరతన్॥ గీ॥ అనవరతసౌఖ్య
సంధాతయైననేత। కంటె దైవంబు గల్గునె కామినులకుఁ। గానమీ సేవఁ

చేసినాకాంక్షితంబు । ఫలితముగఁ జేయవచ్చితి ప్రాణనాథ॥ క॥ మంచి
దియటువలెఁ జేసెద । నంచానతియిచ్చెదేని యది వినుపింతుం । గొంచ
కగాకుంఠితభా । షించంగా వెరతునెంత చెప్పిననధిపా॥ క॥ అనివనితామ
ణి దెల్పిన । వినినవ్వుచు మానివిభుఁడు వెలఁదీయాలా । గునసంశయింపనీకుం ।
జనునే నీమాటనేను జవదాటుదునే॥ సీ॥ అలసివచ్చినవేళ నడుగులొయ్యననొ
త్తి విశ్రమింపించి సురటిచే విసరుటకును । నాకటఁబడనీక యన్నపానంబుల చేతఁ
బ్రొద్దునఁ దృప్తిసేయుటకును । సంతరించినయట్టి సకలపదార్థముల్ దగులీ
లనింటిలోఁ దాఁచుటకును । సతిథులబంధుల నత్తమామల చిన్నిశిశువులఁ దె
లిసిపోషించుటకును । ననవరతమగ్నిహోత్రంబు లరయుటకును । దేవపూ
జోపకరణముల్ దిద్దుటకును । పత్నిపాల్పడ గృహకృత్యభరము లేక । గృ
హియథేష్టంబుగా సుఖియించునబల॥ సీ॥ సంసారసాగర క్షయదుఃఖవా
రాశిఁ దరియింపఁగాఁ జేయు తరణి తరుణి । హృదయంగమస్ఫూర్తి నెపుడు నా
మోదంబు గలిగించు తావి చెంగలువచెలువ । కామితఫలములు ఘటియించి
వేలుపుతేఁజుఁ బెంచిన చెట్టు రెమ్మ కొమ్మ । కందొగల్మిత్యవికాసమొందింపఁగా
మంచి పున్నమచందమామరామ । సదనమణిమయదీపికాజ్వాలబాల । వల్లభమ
నోమదావళివారినారి । శుభపరంపరవర్షించు సోనచాన । పతులధర్మా
ర్థమణిగణపేటిబోఁటి॥ సీ॥ అతిథులనిష్టమృష్టాన్నతృప్తులఁ జేసి యనుదినం
బును బుణ్యమందికొనుట । శాస్త్రోక్తపద్ధతినపనముల్ సవరించి శ్రీహరిసం
ప్రీతి జేసికొనుట । సన్యాశ్రమములయందతిదుర్ధమంబైన మన్మథోద్రేకం
శమాన్చికొనుట । నిజపితౄణముదీర్చి నిఖిలలోకంబులు పాలించుపుత్త్రు
లఁ బడయుటయును । గమలలోచననీవల్లగాదెయిట్టి । నీకుఁ బ్రత్యుపకా
రంబు నెఱపగలనె । యేనుపదివేలజన్మంబులెత్తియైన । మనసువచ్చినగతిఁ బ
నిగొనుము నన్ను॥ గీ॥ దుర్గములనాశ్రయించినదారయరాతి । వర్గములగెల్చు
నై ఖరివనితనీదు । చారుపక్షోజదుర్గముల్ చేరికాదె । కంతుశత్రుం జ
యించెదనగశియలోన॥ క॥ మహిఁ చతురాశ్రమములలో । గృహియధికుం
డట్టి గృహము నివే గృహిణీ । గృహము చ్ఛ తే యనందగు । మహితవ

చోరూషివిసమెమదగజగమనా॥ గీ॥ అనిసవల్లభ యీలీలనాడ నెంత। దా
ననావంటివారెంద ఱైనఁగలుగ। నగ్రపత్నియటంచు నన్నాదరించి। మీ
రునన్విన వలదననేరగాని॥ గీ॥ ఇంకఁదాఁచఁగనేల ప్రాణేశవినుము। సి
గ్గువడియుండనీయఁడుచి త్తభవుఁడు। కన్నె గేదగి రేకుచేక త్తిఁ గొ త్తి। గ్రుమ్మ
చున్నాఁడు దయ లేదు కాంతలైన॥ గీ॥ అటులఁగావునఁ గామార్త యగు
చునిన్ను। శరణువేఁడెదరక్షింపుసౌఖ్యమొసఁగి। యార్తజనరక్షణాదక్షు
లఖిలభూత।సదయులనుగారెమీవంటిసాధులరయ॥ మ॥ అనిన౯ శౌనగవం
ఋరింప మునికాంతా యింత సంతాపమే। లనుమాకుం బ్రియమైనకార్యవిధి
దివాలాయంబుగానేనుస। య్యనినీవాంఛితమెల్లఁదీర్చెదనుసంధ్యావేళపో
నిమ్మునా। వనజాతాక్షిస్మరేభమార్గణకర వ్యాధూతచిత్తాబ్జయై॥ సీ॥
మలయాచలాయాతమందానిలముగాదురణరంగసన్నద్ధరథముగాని। ప్రాగ
స్తగిరులచంద్రదివాకరులుగారు కమనీయకనక చక్రములుగాని। సాయంస
ముజ్జృంభసాంధ్యరాగముగాదు కొమరుజెంగావి టెక్కెములుగాని। సా
ధారణవిహంగసంరావములుగావు మణికింకిణులఘుణంఘణలుగాని। తా క
లుగావు దేవతాద్వంద్వముక్త। నవనమస్కారకుసుమబాణములుగాని। నే
జగాదిదివిరహిపైస్మరుఁడుదండు। వెడలుగోధూళిశుభలగ్నవేళయధిప॥ సీ॥
తిలకింపద్వాదశార్కులకన్న వేండ్రమై జలజారివండు వెన్నెలలుగాయు। ప
ల్లవితాశేషపాదపచ్ఛాయలుపలయాగ్నికీలలవిధముచూప। మలయాచలా
యాతమందమారుతములుఝంఝామరుల్లీలసంచరింప। ఫలపుష్పనిష్యంది
బహుమరందరసంబువసుమతినేకార్ణవంబు సేయఁ। గాలకంఠకఠోరహుం
కారములను। దండిదండినికుసుమకోదండియడరి। విరహిణీలోకసంహార
వేళగాని। యిదివసంతంబుగాదు ప్రాణేశకంటె॥ గీ॥ ప్రాణనాయక యిదె
చూడు పతులఁగూడి। పాయకుఁడటంచుసతులకుఁ బల్కుతేజి। పాదుపా
హుళికాజేసిపంపుకాగి। తంపుఘరమానువాఁ డెసుధాకరుండు॥ చ॥ అభుకొ
కయింతలేకకుసుమాస్త్రుఁడు గ్రొన్నెలసానదీరుచెం। గలువ్రులకోలలు౯ గు
లుకుగుబ్బచనుంగవఁగాడనేయఁగా। కళగానగారురక్తము డెగన్గొనుకుంకు

మగాఁడునాథ! పూవిలుతునిమండిగంబుదగ వేసహియింపగమీకుని త్రతజేఁ॥
శా॥ ఓయాత్మేశ్వరయీవసంతమునశాంతోష్ణాంశుసంతానముల్ । భూయో
దృష్టతమంబధిజ్యధనురంభోజాస్త్రియుద్యత్పటీ । రాయాతానిలశైత్యము
న్విశదసర్వాశంబురమ్యంబునౌ । సాయంవేళరమింపవచ్చితిమదిస్సంతోష
ముప్పొంగఁగన్॥ గీ॥ ప్రాణనాయకయొకమహార్తంబుదాళు । మంచు
నాఁతియిచ్చితిరంతయేల । నొక్కక్షణ మొక్కదినమయి యున్నదిపుడు ।
తాఁగఁగాఁజాలమత్కాంక్షితంబుదీర్పు॥ అదియునుంగాక॥ సీ॥ తల్లిదైవం
బనితగుప్రదక్షిణనమస్కృతులనింద్రాదులుసేవసేయ। నత్తగారనిబత్తినడు
గులొత్తుచుశచీవనజాక్షికోడలితనము నెఱప। నవ్వయంచునుబ్రేమనివ్వటిల్ల
గఁజేరిమురిపెంపుమనముఁడుముద్దుగురియ । దివ్యవాద్యములతోదినదినం
బునికేతనంబునశుభశోభనములుజరుగ। చుట్టరికమునిచ్చిపుచ్చుకొనుబం
ధు । జాలమెంతయుగౌరవసరణిఁజూడ । విభవములవిఱ్ఱవీగెడువిబుధమాత।
నదితిగనిమెట్లు దరియింతునవరతము॥ సీ॥ అదితిగన్నకొమాళ్లయందొ
క్కరుఁడుజగత్త్రియరక్షణాధురంధరతఁబూనె । మఱియొక్కఁడాకాశమ
ణియైజగత్త్రియీామూర్తియైభువనసత్కీర్తిమించె । వినతాత్మసంభవుండ
నుపమేయబలాప్తివనజాక్షువిశ్వంభరునిభరించె । కద్రుతనూజుండుగహన
నానాసముద్రాహార్యములతోడనవనిమోచె । మఱియునీచెట్టవట్టిన మగువ
లందు। నెవ్వరికిలేదుసత్పుత్రులెంచిచూడ। నందఱనభీష్టసంపదనలరినారు।
కాంతనాభాగ్యమిట్లయ్యెఁగానినేఁడు॥ క॥ రమణునిమన్ననవలనన్ । రమణీ
మణిరమణమొందురవిమన్ననచే। గమలినిశశిమన్ననచే। గుముదినివలెననిన
తెఁడుగోమలికనియెన్॥సీ॥విరియబోసినజటావిసరంబుకెంజాయసాంధ్యరా
గంబుపై చౌకళింప। ప్రేతవనాయాతవాతశీతవిభూతి నికరంబు నెమ్మెనబెండి
కొనఁగ।గృతతత్తపావర్ణగిరివిగ్రహంబైనఘనవిగ్రహముభయంకరముగాఁ
గ।వికటాసిహారముల్విషభరమాలికల్ గజచర్మవశనంబుగండుమిగులఁ। గే
లశూలంబుపూనిదిక్సిత్తులుగల । వట్టహాసంబుచేయుచునఖిలభూత। వివరము
లుగొల్వ మదమత్తవృషభ మెక్కి। రుద్రుఁడిపేళ మొలగెపు రౌద్రముగను॥

గీ॥అనలచంద్రార్క నేత్రత్రయంబు దెఱచి। చూచుచున్నాఁడురోషవిస్ఫురణ దనర। మఱఁదియనుచుట్టఱికమున మాఱుమసల। వలదుదుర్మార్గుఁడైన నెవ్వారినైన॥ క॥శిక్షించునత్పురుషుల। రక్షించుఁగడలిబొడమి ప్రబలినవిషముఁ। భక్షించిజగముఁగృపచే। వీక్షింపఁడెనీవెఱుంగ వేజలజాక్షీ॥ మ॥ అనినన్మందమరుత్కిశోరకులలోలాకాశగంగాతరం। గనిక్షాయంబులుదమ్మిపైఁబొరలుపొంకంబెంతగాఁవింతగా। నునులేనవ్వుముఖారవిందమునఁజిందుల్గాఁ కన్నక్కలిక్కియిట్లనియెఁ యౌవనగర్వనిర్వహణ లీలాలోలవాచాలతన్॥ గీ॥కుడువఁగూడునుకట్టుకోఁకోక లేక। తోలుగట్టుకతిరుగు బిచ్చాలశివుని। జాలవర్ణింపఁగానేలచాలుచాలు। నతనికొకకూఁతునిచ్చిలోసడలు తండ్రి॥ గీ॥ చూడదొడ్డను మంచముకోడుగాని। యేమిసంపదపార్వతీశ్వరునకు। మీరుదోఁబుట్టువంచును మెచ్చుకొనిన। నిచ్చకంబునకైననేమెచ్చుకొనను॥ క॥ జనకుఁడుపదుమువ్వురుమముఁ। గనిమీఁప్రియుఁడైనవానిఁగైకొనుఁడన్న। న్నినుఁగోరమెయన్నింటన్। ఘనుడవు గావునుగాఁవునను రతియనిన్॥ శా॥ శాంతంపాపమటంచువక్షానిపతిహస్తచ్ఛాదితశ్రోత్రుఁడై। యింతైనన్మదిఁగొంకులేకతగునే యీలోగునిందింపఁగాఁ। గాంతా విశ్వజనీనవైభవ మహాగంభీరశైలేంద్రజా। కాంతద్వేష మనాత్మనీకముగదాకన్గొన్న నెవ్వారికిన్॥ సీ॥ అధికలోకంబుల నధిగుండ నేనంచుఁ గర్వించువిధిమస్తకంబుద్రుంచె। నధ్వరంబులఁదన్ను నవమానమొందింపమీదతునకోసంగెమేషశిరము। పుష్పాస్త్రములరక్తిఁబుట్టింపగిట్టినభస్మంబుగావించెఁబంచశరుని। వ్యాసులుమును నద్దైవంకేశవాత్పరంబనినబాహుస్తంభమలవరించె। శౌరినయనాంబుజమునఁబూజనమొనర్ప। మెచ్చిచక్రంబొసంగెనమ్మోటిమగని। నెట్లునిందింపఁదవెయొడలెఱుఁగలేక। దక్షపుత్త్రివిగనుక నోతరలనయన॥ సీ॥ దండధరోద్దండ తనుఁడంచు విషభోక్త యఃహిఫణామనులూనునస్తిహారి। మసనంపుటలుసర్వ మంగళాధీశ్వరుఁడైశ్వర్యశాలియానాదిశ్రీశంభుఁ। ముదితకైయురమేని నొదవిన కామారి యాశ్రిత సులభుఁడై సత్త్వయుగ్రుఁ। సత్త్వరిక్షలదాతయైనప్రకృతుఁడగుఁగాసి పితృలగ్న శ్రీకఁడై

న వృషభవాహనుఁడు । హరుఁడు శంకరుఁడును భవుఁడభవుఁడింక । శితవి
భానిధినీలలోహితుఁడునష్ట । తనుఁడుపంచాననుఁడు త్రిలోచనుఁడుసర్గ। నా
త్ముఁడద్దేవు దెలియ శక్యంబె మనకు॥ గీ॥ అనిన నట్టిదేవుఁ డంగజహరు
లొంగిసందెలందు దివసములందువిడక। వేయువత్సరములు వెలఁదితోరమి
యించి । యర్ధదేహ మొసగఁడాయటన్న॥ శా॥ ఈలాగందురె బాలవాం
ఛితఫలంబీజాలు విశ్వేశ్వరుం । డేలాగుంఢినినుండెగాక మఱిమాద్యద్రక్తాపసు
ల్చిత్తభూ । లీలామగ్నతనుండ గాఁదగునె తొల్మిందూలిశాస్త్రోక్తముల్ ।
బాలింపంగ దేగృహస్థులకు సద్భావంబుతో నెప్పుడున్॥ గీ॥ దశమిహరి
వాసరమున ద్వాదశినిపర్వ । తిథులసంక్రమణంబుల తిథులనన్య । తిథుల
యాందైనఁబగలుసంధ్యలను ప్రేమ । నంటగారాదుసతుల గృహస్థులకును॥
క॥ ఋతువై స్నానముసేసిన। సతినంతర్గృహమునందుసంతానేచ్ఛన్। రతికృ
తిగాక జుగుప్సా। మతిఁగలయుట గృహికి యుత్తమంబనిపల్కున్॥ శా॥ ఓ
లెండాయిటువంటిచాందసము లెన్నైనాగలావిందుకున్ । నేవల్ గావని చె
ట్టపట్టితివి వేలేల నప్పుతో వల్లభుం। బాలారత్నము కేళికాకుతుక [illegible]
క్రియామారిత। వ్రీళాసూచకసానురాగవికసద్వీక్షారుచుల్మీఱఁగన్॥ గీ॥ వె
రువవసనేలకాఱుని విభునిచెట్ట। బట్టినప్పుడె స్వేదకంపంబులొదవె। గద్గదిక
దోఁచె మోమునగాననయ్యె । గీనభావంబునదియొక్కటిట్టిదనమె॥ గీ॥ నయ
ము దెల్పెనుగతి కంకణములు మొఱయఁ । గానుసలియింపఁ బులకలు గ్రమ్మి
కొన్న। గుబ్బయుగంబు వాఁబ్రైటకొంగుజాఱె। మగువయీగతి తెగువతో
దిగువనతఁడు॥ చ॥ వలదిదిసంజెవేళ చెలువా యొకయించుక తాళుమంచు నేఁ।
బలుమఱుఁజెప్పిన న్మనసు బట్టఁగఁజాలక నొంటిపాటున। న్వలనుగకంటకింప
యిన వానిగనుంగొని ప్రేమహెచ్చఁగా। బలిమినిఁజేరఁజాలవలెఁబైకొనఁగో
రెదుసీకుమేరయే॥ మత్తకోకిల॥ నీమనోరథమెల్లఁదీర్చెద నీముహూర్తము
దాఁటవే। కామినీయిదివేళ కామినిఁగైకొనంగఁ దలంపనం। చాముసీంద్రుఁ
డు వేడినన్వినదయ్యెఁ తొయ్యలియెయ్యెడన్। కాముమప్పగుణంబటంచును
గావినంబడునేర బా॥ క॥ ధీరాగ్రేసరుఁడంతట। నీరేఖహనేత్రచేతినిర్బంధ

ముదు। ర్వారముగా రుద్రనము।స్కారముగావించి కేళికాకృతమతియై॥ గీ॥
ఎంతచెప్పినవినవేటా నింకసీవె । యనుభవించెదురమ్మంచు హాసితవదన ।
యైనమానినికై దండబూనిమాని । కేళిసదనంబుఁజేరిన బాలయపుడు॥ గీ॥
జానువాకోళ్లపట్టెమంచంబుమీఁదఁ । దళుకుకుంకుమపరప్పైపలువఁబఱచి।
జాతిపట్టుతలాడలుచక్కఁబెట్టి।కాంతుఁడుఁశయింపఁదాను చెంగటవసించి॥క॥
మదనుండంపినకిలా।కిదిగో మనసిమ్మటన్న యేపునవలా। మొదటనొకమడు
పానంగుచుఁ। బిదపన్నాగాలొసంగెఁ బ్రియునకుఁ బ్రేమన్॥ క॥ వడిగచను
గుబ్బజిగిగ । న్నడుజిలుగున్నరిగ చెలువపయ్యెంటపయిన్ । దడిదుడుచుచుఁ
చెలియాతన్ । మడుపులొసఁగిజాబిటయును మదిఁదమిబొదలన్॥ గీ॥ చె
లువపయ్యెదఁ చుబుకంబు చేతనదిమి। అవి కెసడలింపఁదిలకించిరమణుఁడెంత।
సిగ్గరి వెయుంచుఁబైఁటఁదీసినను వేగఁ।గరయుగంబునఁజనుదోయిఁగప్పుకొ
నుచు॥ మ॥అలరున్ శయ్యకుఁజేరియొత్తిగిలిసయ్యాటంబునన్ గబ్బిగు।బ్బలు
ఱొమ్మునఁగప్రాణనాథుకటిపై పాదంబుకంఠంబునన్। వలకేల్గుబ్బిచ్చికవుం
గలించిజిగిజాళ్వాచెల్వపున్ ముద్దుచె। క్కిలిముద్దాడుచుమిక్కుటంబుతమి
సొక్కన్నాంతకనొమ్మెద్దున్॥ చ॥ పడఁతుకప్రేమమీఱి మొనపంటచురు
క్కునమోవినొక్కనం। జిడిముడిపాటుతోడ నును చెక్కిలిమీటుచుఁజాలుఁ
జాలునే । విడవెగయాళియంచుఁబతివేడినఁజిక్కితివింకనేలనే । విడువన
టంచుఁగ్రోలెఁ పెదవిన్మదవిహ్వలతాంతరంగయై॥ గీ॥కలికియారీతిఁబరిపరి
గతులఁబెనగఁ।గఠినవక్షోజయుగళసంఘట్టనమున । హృదయమున నిద్రబో
యెడుమదనుడపుఁడు । మేలుకొనెనాగఁబతిదమిమీఱనని యె॥ మ॥ అలు
కల్ దీరిచిముద్దుబెట్టుకొనిసయ్యాటంబునంజంటిపై । జిలుగుంబయ్యెదకొం
గుజాఱ్చితమినాశ్లేషించుచున్ శైకొనన్। బలిమిన్వల్లభుఁడప్పుడొల్లమినటిం
పంజూచుభ్రూభంగరీ । తులనెంతన్ గులకాంతలింతతమి యెందున్ గానఁ
చంద్రానన॥ గీ॥ అకుటిలభ్రూశరాసనవనతితీక్ష్ణ । చంచలాలోకవిశిఖషకం
చుకాఢ్య । వపురుపాలాపలాలనవయ్యనతను । సమరసన్నద్ధమగుటయా
శ్చర్యమబల॥ క॥ అనినగొమ్మెత్తులఁదనసతి। చనవుంజెల్లింపఁగోరెసమర

కలనఁ । మునిపతికులకాంతలుగో । రినకోరి కేఁజిన్న బుత్తురే గృహములను చుఁ॥ గీ॥ నెలఁతరమ్మనితనదుసందిటికిఁదిగిచి । చన్నుగవయంటివా తెరచవుల దేరి । విడువఁబోయిన నునుపోక ముడికి గాను। కోమలి బెనంగె సిగ్గుచేఁ గొంతదడవు॥ గీ॥ నిగనిగల్ గుల్కునధర మాణిక్యమొసఁగె । గుబ్బచనుదోయి బంగారుకుండలొసఁగె । బెనఁగెఁదనపోకముడికిఁగాఁ బ్రియునితోడ । సిరజాక్షులుముగ్ధలుగారెయెందు॥ గీ॥ నవితనయంతట నెజాణనీరజాక్షి । కౌరయభిమానరతుకు లైనవారు। దొలఁగుసమయంబునను దామె తొలఁగి పోకఁబరులచేఁ ద్రోపుఁబడుదురె పలచనగుచు॥ అంత॥ మ॥తనుతేలెమ్మని కొమ్మయెత్తులిడమోదంబొప్పనాథుండు పై। కొనియానందపయోధిసీదుచు నునక్షోజాతకుంభంబులూ । దినసత్వంబుననంతలోబడలి యం తేసోలియోష్ఠామృతం । బునితాంతంబుగఁ గ్రోలిము న్గను శ్రమాంభో వాహినుల్మ్రుంచఁగఁ॥ గీ॥ అనధరక్షతమన శేదమసమకంఠ । కూజితమ భాషణమబంధకుశలమయ్యె । మానిసురతంబు మానినీమణిని పార। వశ్యమొనరించియానందవార్ధిఁదేల్చె॥ గీ॥అంతసురతాంతవైరాగ్యమనుసరింప।నింతమాత్రసుఖంబున కేలనిట్టి। వేళఁ బ్రాల్మాలితినటంచు విభుని మోము। చక్కఁజూడంగసిగ్గయికయ్యుడిగ్గి॥ చ॥ వదిలినకట్టుకొంగుసవరించి మిటారపుచన్నుదోయిప । య్యెదగదియించిముత్తియపుటంచులకమ్మలు చక్కఁబెట్టికొ । న్పెదఘుటియించిముంగురులువిన్ననువొప్పఁగఁదీర్చి నెమ్మదిఁ। గుదిగొనిసిగ్గుతోకుసుమకోమలిమజ్జనశాలకేఁగినఁ॥ గీ॥ మానిస్నానంబుచేసినవీనధౌత । చేలములుగట్టినిర్మలక్షితివసించి। బ్రహ్మగాయత్రిజపియించి భావశుద్ధి । హోమశాలాంగణంబుననున్నయపుడు॥ మనోహారిణివృత్తము ॥ ఉదరము బరువై యున్నదిమదిపమ్మదమునుభయమును మల్లడిగొనఁగాఁ। బెదవులుదడుపుచుబిత్తరిరతుఁ । గదియఁగఁజనియెనుగద్గదికదగఁ॥ గీ॥ కామమోహితనగుచు దుష్కాలముననను । నిన్నుఁగూడిరమింపఁగ నిలిచెగర్భ । మింకదానేమిచేయునోయెఱుగఁబడదు । క్రొవ్వినవ్వితిలోకైకగురునిహరుని ॥ అంబురుహవృత్తము॥ అనినన్వినియమ్మునియిట్లనియెఁ ॥ సీ॥పతిచిత్తమెఱుఁగకరతిఁగో

రుటఁబతివ్రతలకు ధర్మముగామిదలఁపవైతి। విదినందెవేళగా యీవేళరమి
యింప ఘోరపాతకమని కొంతవైతి। ఫాలాక్షువృషవాహు శూలపాణిమ
హోగ్రఁగరకంఠుజూపిన వెరువవైతి। దితికశ్యపునిబలాత్కృతిబట్టెనని లో
కులాడుకొందురటంచనలుకవైతి।మించినేనెంత దెలుపఁలజ్జింపవైతి।దపసనంద
నవయ్యసత్పథముదక్కి। చిత్తభవునకుఁజిక్కిదుష్క్రియకుఁజొక్కి।యింత
చేసితివేమందునిందువదన॥ ఉ॥కామముధైర్యవారణని కామముదుర్దమ దు
ష్క్రియాలతా। దామముసత్క్రియాధృతివిరామముక్రోధముఖాదిపంచక।
క్షేమమునాస్తికత్వమతిసీమముదుర్వ్యసనాబ్ధిరాట్సుధా। ధామముసర్వదు
ష్టగుణధామముదానిఁబరిగ్రహింతురే॥ సీ॥వదినెయంచునొకింత వాత్సల్య
ముంచకపొలోమిముందర బట్టువారు। న్యాయంబుగాదిది యనిబృహస్పతి
పల్కవికవికనగిచెంప వ్రేయువారు। పినతండ్రియనితండ్రిగనమిఁజయంతుఁ
డు వచ్చినఁజెరసాలనుంచువారు। హరి నినునుతియించునంచు నానావేదశా
స్త్రము ఖిలముగానల్పువారు। నీదుగర్భంబునందు జన్మింతురబల। సంజ
రమియించినట్టిదోషంబువలన। రుద్రభృత్యులుభద్రానుభద్రులనెడు। వా
రుగడపటఁ దెగుదురుశౌరిచేత॥ క॥ అన ముఖ వర్ణ వ్యత్యయ। మునమో
దము ఖేదమగుట మునిపతి దెలియఁగ। గనుఁగొని భయసంభ్రమములు।
బెనఁగొనఁదన మనములోన బిత్తరియనియెఁ॥ గీ॥ వినుమనోహర యొకర
సావేశమునను। తనువెఱుంగమినపుడట్టి తలఁపుపుట్టె। నిపుడువిస్మయమ
య్యెడునెన్నికొనిన। దైవకృత్యంబుగాకేమి తప్పఁగలదె॥ మ॥ ఘనశౌ
ర్యంబున వైరివీరవరులఁ ఖండించి లోకంబులె। ల్లనుబాలింపఁగఁజాలుని
ద్దరుసుతుల్మద్గర్భ సంభూతులై। ననుజాలున్గలుషాత్మలైన వెరువందరా
త్మశ్రీభర్తచే। తను మేనుల్త్యజియింపఁ గల్గుటగరస్థంబాగదామోక్షముఁ॥
గీ॥ ఐన సాధునిందకాలయములగుటను। వగపవలయు వారివారికైన। విష్ణు
దేవుభక్తి విబుధానురక్తియుఁ। గలుగఁ గరుణ సేయు కాంతయనిన॥ క॥వని
తాపశ్చాత్తాపంబునగుందుటవిష్ణుదేవుబొగడుటనన్నుం। గనిమునికొల్చుట
వలన। న్నినుమెచ్చితి శుభముగల్గు నీకిటమీఁదఁ॥ గీ॥ రమణి నీయుగ్ర

గుఁడెలమి హిరణ్యకశిపుఁ। డతనికిఁ జనించుఁ బ్రహ్లాదుఁ డనుకృతార్థుఁ। డతఁడు యుత్తమచారిత్రు మఖిలవిష్ణు। భక్తజనముఖ్యులకు మేలు బంతియగును॥ క॥ శ్రీదైతపాదసేవా। స్వాదుఁడు ప్రహ్లాదుఁ డలరు నతిపావనుఁడై। మోదము వనుంపు పొమ్మని యాదితి నూరార్చియుండె నతఁడు యథేచ్ఛన్॥ అంత॥ గీ॥ దితి కపోలతలంబులు తెల్లబాఱె। నదితికె మోమ్ము వెలవెలనయ్యెఁ దోడఁ। బంచి కొనసేము రుచియు సాపత్న్యమునను। గాకసైరింపఁగలదె యే కడసపత్ని॥ క॥ గర్భము నవృద్ధిఁ బొందెడు। నర్భకుల శరీరకాంతి యధికంబై యా। విర్భాతము య్యెననఁగా। గర్భిణి కుచచూచుకములఁ గాళిమదోఁచెన్॥ క॥ చిట్టుములుబుట్టెఁ దాఁగను। పట్టికి నిటమీఁద ధర్మపథమున నీఱులం। బుట్టెడునరుచి యటంచున్। గట్టిగ జనములకుఁ జెప్పు కైవడి దితికిన్॥ క॥ ఇటువంటి భూమిని నీవింకిటు గైకొనుమంచు పట్టికెత్తిగించు గతిన్। కుటిలాలకమృద్భక్షణ। ఘటిధాకరము య్యె మిగుల గర్భస్ఫురణన్॥ సీ॥ శ్రేష్ఠనిష్ఠురతపోనిష్ఠచేఁ బరమేష్ఠిమెప్పించి వరముఁ గామించ సెంచు। జగతీతలంబెల్లఁ జాపఁ జుట్టుగఁ జుట్టి యొకమూల దాఁచగా నుత్సహించు। శతముఖప్రముఖనిర్జరులఁ బాఱఁగఁ దోలి యెల్లలోకములు దానేలఁ దలఁచు। బ్రాహ్మణయూథంబు బాధించి రోధించి యధ్వరభాగంబులాన గోరు నమరకాంతలఁ జెరలు వెట్టంగఁ దిప్పరు। దేవదేవునితో నిరోధింపఁ జూచు। గర్భమైనది మొదలుగాఁగ స్వప్నగపత్ని భావంబులోన శ్రాభవము మొరసి॥ గీ॥ బాలకులఁ గాంచినను పాకజంభనాద। శత్రువులనొంతురో యను సంశయమున। గర్భము ధరించె నూతేండ్లగాథనియతి। జలజలోచనపుత్రినాత్సాయ్యమునను॥ సీ॥ వదనంబు సరచిన వానిఁగానఁగలేక ధరణీజనంబెల్లఁ దిల్లడిల్లి గునిసి ఘుల్లునటంపు గగనమార్గంబునవైమానికుల విమానములు దాఁకె। విధము పైనున్న మార్తాండుఁ జూడఁగ లేము గరుడాగ్రజుఁడు బెట్టుగాఁగ పిల్వ। నున్న వాఁడ వెఱుంచు నోద్ది వారలు బింబమంటి శైత్యస్పర్శనంబు దేలియు। నింబుని నిజాత హాలాహలంబు లీల। నదితిదుర్భరగర్భంబునందు బొడమి। భూప్రసన్నస్వర్గముఖాశేషభువనములను। గాఢమైనిండె గాఢాంధకార మొగ్గి। గీ॥ అన్న పెంగ్రుపాటిక సుధాంసుబంధులగుచుఁ। వేరువేరులనొం

దూర్గబిలిచికొనుచు । జెట్టిఁబాయక కైలాసశిఖరిగనుచు । సత్యలోకంబు
జేరి విస్మయముఁదిఁజు॥ మ॥అతిచంద్రాంగ్కతనుద్యుతిచ్ఛటలఁలోకాంతచ్ఛహీ
భూషిగా । ఫలతమోహారకర్తైసమస్తముని చూడారత్నసంసేవ్యుఁడ్భలిప
త్త్రుండయిభారతీరమణితోసౌవర్ణపీఠంబునం।దతుల ప్రౌఢిఁజెలంగుఁబ్రహ్మ
కనిసాష్టాంగంబుసేవింపుచు॥ గీ॥ భారతీనాథలోకసంపత్సనాథ।ప్రకటలిక
విశ్వనిర్మాణపారిపృశ్వ। తెలియఁబడఁగాదె కరతలామలకసరణి।త్రిభువనం
బులవృత్తంబు దేవ మీకు॥ గీ॥అంగుష్ఠారమొకటె పాలాపాలొగ్రనె। మూ
చిజగములాక్రమించియున్న । దిందులకు నిమిత్తమెట్టిగింపుభయమున్క్రి
ర సనినభారతీవిభుండు॥ సీ॥ఆదికాలమున సోహంబంచు నామానసంబున
బుట్టిన జ్ఞానవంతు । లీజగంబాదిగా నెల్లజగంబులఁద్రుణలీలఁజూచివ్రైలువి
రక్తు । లుగ్రుఁడుమొదలు ప్రత్యుత్థాన మొనరించి పూజింపఁగాఁ జగ
త్పూజ్యతములు । నారదాదులకుజ్ఞానంబునఁదోఁపని యర్థముల్ దెల్పుత
త్త్వార్థవిదులు । సంతతాత్మానుభవసౌఖ్య జాయమాన । తృప్తితృప్తా
తరంగులై తిరుగుచుంద్రు । సకలజగముల సనకాది శాంతిసిద్ధులు । వా
రలోకనాఁడు హరిఁజూచువాంఛరయొదవ॥ సీ॥ ద్వారకాంచనరంభలూరు
కాండములుగా కలితసోపానముల్వాళులుగాఁగ । కమలాకరస్ఫూర్తిగం
భీరనాభిగా నారామరేఖనూగారుగాఁగ । బదివన్నియలకోటపసిడియొడ్డ
ణముగా సౌధశృంగములురోజములుగాఁగ । భవనాగ్రకేతన పాళిపయ్యె
దగాఁగ దొగలతోరణముభ్రూయుగముగాఁగ । హంసకారావయుతపద
ఖాంబుజంబు । లమగులును ఘనఘోషంబు లలకములుగ । సాటిసా
త్కరించిన శ్రీవధూటి । సోలిచెలువొందుచున్నైకుంఠపురముసఖున॥ క॥ చని
యేలోకంబునఁగాం । చనివైభవమింపుఁజూడ సమకూరెనటం । చనిప్రా
పించికరమమె । చ్చనివారనోన్యసూక్తి చాతురిమెచ్చన్॥ ఉ॥ త్రివి
భుఁడాద్యుఁడశ్వర విరించిముఖామర సేవ్యుఁడంచుస । ద్భావముచేఁభజిం
పఁగలభక్తులుముక్తశరీరులైముదం । బావహిలంగ నడజలమూడుకలిం
శరీరముక్తులే। దీపిరజానదిమహామమెన్న సమర్థులమే సనందనా॥ ౮ మా

దసమీరాంచంచల సమాంజనకంజపరాగపుంజమెం। దేందురజోగుణంబు వెలయింపఁదదీయమరందలాలసేం। దిందిరమున్ దమోగుణముఁదేల్చెడునింతియకాని చూడఁగా।నిందురజస్తమోగుణము లెన్నడు లేవుగదాతపోధనా॥మ॥ అరిషడ్వర్గము లేమిదుఃఖములఘోందావంతయున్ లేక శ్రీ। విరజానామతరంగిణీజలములో విధ్యుక్తిసుస్నాతులై। స్థిరభక్తిన్ సమయంబటెంగిహరిసంసేవింపుచున్ దృష్టిచే। కురహర్షించుసలోకముక్తులఁగనుంగొంటే జటీంద్రాగ్రణీ॥ సీ॥ మణికిరీటంబులు మకరకుండలములు నాకర్ణధవళనేత్రాంబుజములు। పావనవైజయంతీవనమాలికాకౌస్తుభకలితవక్షఃస్థలములు। శంఖచక్రగదాసిశార్ఙ్గపంచాయుధదుర్వారబాహాచతుష్టయములు। ఘనకటీతటబద్ధకనకాంబరంబులు నాభిశోభితపాండునయనములును। విబుధపతినీలరుచిదివ్యవిగ్రహములు। దర్పకానంతసదృశసౌందర్యములును। గలిగి చెలువొందుచున్నారుగంటెవీరి। విష్ణుసారూప్యవంతులువిమలమతులు॥సీ॥ పదియాఱువన్నెల బంగారమే కాని యితరలోహంబులిందెందు లేవు। నవనీయముగమించు నవరత్నములె కాని యితరోఘలంబు లిందెందు లేవు। కామితార్థములిచ్చు కల్పకంబులె కాని యితరభూరుహములిందెందు లేవు। శ్రుతివచోరచనమించు విహంగములె కాని యితరఖగంబు లిందెందు లేవు। సరసిరుహనాభ సారూప్యధరులె కాని। యితరులైనట్టివారలిందెందు లేరు। తరమె యెంచగుణాళుందతరముముక్తి।గురుకుచాకెంఠసరమువైకుంఠపురము॥ వ॥ అని యదృశ్య లోకసాధారణ లోకదురవలోక మణిగణాలోకవిలోకాయితశతకోటికోటిలోచన సలోక వాసనివాసవర్గంబులగు రాజమార్గంబులవలోకింపుచు నతిక్రమించి నిజసమాగమసమసమయ సమయ ద్భయభక్తివినయప్రధానప్రధానజన నిటలతటముకుళితకర వందనమాలికాసందీపితారావిందకోరక వందనమాలికాకలిత నిజాంబగు హరిహజారంబు ప్రవేశించి వాద వేదండంబులం బోలి బహుకక్ష్యాభిరామంబై గగనకాసారంబులంబోలి సహస్రారూపంబై కపోతపాలికా లాలితంబయ్యు నసత్యంబై [illegible] ప్రవ

చు నారాయణోచ్చారణంబోంకారసూచకంబుగా నభ్యంతరగృహంబున
కరుగు సమయంబున॥ క॥ బాలురుగానవివేకము । సాలదా బిసబిసననెం
డుఁజనియెదరంచు । నోర్కాలలువై చిరిశతధృతి । బాలులముందరను ద్వార
పాలకులలుకన్॥ వ॥ ఇవ్విధంబున॥ క॥ పోవలదనిరోధించిన। దౌవారికజన
ముఁ గాంచి తాపసవరులే । లావారించెదరకట ।శ్రీవల్లభుపాద సేవ సేయఁ
గఁదగమే॥ గీ॥ అనిన వేళ గాదు వనజాతనేత్రుండు । తరుణిఁగూడి యంతి
పురమునందు । నున్నవాఁడటన్న నొక్కింతినవ్వుచు । సనకమౌని వెనక స
నకనని యె॥ మ॥ ఇనబింబంబున యోనిమానసములం దేప్రొద్దుశ్రీకాంతతో।
వనజాక్షుండువసించుమీరెఱుఁగరే వారింపరారెన్నఁడున్। గనుదమ్ముల్విక
సింపఁగన్ గొనుదు మర్కస్థాయినాత్మస్థితున్। ఘనవిజ్ఞానవిలోకనంబునఁ
గడున్ గన్గొందుమిచ్చారతిన్॥ క॥ కనుటయుఁగనఁదగునదియును। గనుఁ
గొనువాఁడాత్మయయ్యెఁ గనుగొనవలదం । చును వారించెద రెవ్వరిఁ ।
గనుఁగొనఁగారానిదేది కనుగొనుఁడాత్మన్॥ గీ॥ ఏలయజ్ఞానమొదవెయీవే
శమీకు । నిర్వికారంబు పూర్ణంబు నిర్మలంబు । నైనపరమాత్మసాక్షా .వి
కారానుభవము । గలుగఁజేసితి రేమనఁగలము మిమ్ము॥ గీ॥ ఘటమఠో
పాధిభిన్నమౌ గగనమ్ములు। ప్రకృతిసంబంధమునభిన్న భంగిఁదోఁచు। నాత్మ
యింతియె కాని వేదాంతయుక్తి। నరసిచూచిన భేదమావంత లేదు॥ గీ॥ ప్రకృ
తిభిన్న గుణంబులఁ బ్రభువుఁబోలి । మమ్ము దౌవారికులఁ జేసి మనుపుచో
టను దదధికారంబుదప్పింపఁ దరముగాద । టన్నటువలె ననఁగరాదదియు
వినుఁడు॥ క॥ చనవరుల నడ్డగింపం । జనునే దౌవారికులకు జగదీశునకుం ।
దనయాత్మజులముమాక । న్ననుచనవరులేరి యిచట నానాగతులన్॥ క॥
ఎటువంటి బంధులయినన్ । గుటిలాత్ములఁజేరనియ్యఁ గూడునె యన్నన్ ।
గుటిలుల మాటయుఁగాకుం । డుటయును మీభావమెఱుఁగు నూహేమిటి
కిన్॥ గీ॥ హరికినెటువలెఁదోఁచునో యనిమీకు । వెన్నునకుభేదమెయ్యె
దియెన్నిమాఁడఁ । గరచతుష్టయు వనమాలికాగదాసి । హైమవర్ణాంబరం
బుల నలరినాఁడు॥ గీ॥ ఏన సమయంబు గాదనియంటిరేని కన్నులర్కేందు

లును నాభిఁ గమలభవుఁడు । శయ్యయై శేషుఁడుండంగ శౌరిఁగొల్వ ।
మాకుసమయంబుగాదె ధీమహితులార॥ క॥ కమలాత్మునిఁ గొల్వఁగనిది ।
సమయముగాదన్న నేది సమయంబిఁకనో । విమలాత్ములార చెప్పుఁడు ।
గమలాసతి యొమ్మొదించఁ గాఁగనమెందుర్॥ వ॥ ఇవ్విధంబంతయు నెఱిం
గియు నంజనంబునం దెలసి వసుధాంతరంబునను డు నిధానంబు గైకొనం
జను జనులకు మహాభూతంబు లడ్డపడు తెఱంగున బ్రహ్మదత్త విజ్ఞానంబున
సన్నిధియగు హరిసన్నిధికరుగు మమ్మువంటి నిష్కాములందు నిష్కారణ
క్రోధంబుచేసి నిరోధించితిరిగావున నిక్షేపకాముకుండు మంత్ర తంత్రంబు
లమహాభూతంబుల నిరసించుచందంబున మత్తపోబలంబున మత్తచిత్తవృ
త్తులరగు మిమ్మువంటి సజ్జనకంటకుల గెంటించి పరమపదంబు నిష్కంటకిం
బుగావించెదమని జయవిజయ భూపాతననిమిత్త జాతంబులగురీతిం బ్రభూ
తోచ్ఛ్వాసవాతంబులు నిగుడందదీయ నిర్గమన సమయాపవర్గ పురద్వార
కవాటార్గళవిఘట్టన రటనానుకరణ నిపుణరదనాను పటాల కిటాకిటధ్వా
నంబులు వెలయ నితిపరితదాహతజంతు సంతానరక్తసిక్త ధారావలయ
సూచక రోషారుణాయమాన నయనంబులు వెలుంగ నశనిసదృశ గుణపదపర
మపదజాయమాన కోపరూప దోష హేతుధూమ కేతుభవద్భ్రుకుటిఘటిల్లఁ
గోపాటోపంబు సైరింప నేరక వైరించి హరిద్వారపాలకుల నవనిజనియిం
చి సురద్విషద్వారపాలకులుగమ్మని శపియించిరి॥ క॥ గడగడవడఁకుచు జె
దవులు।దడపు మజయవిజయులపుడుదాసోహమటం । చడుగుందమ్ముల పైఁ
బడి । జడదారులవేఁడుకొనెడుసమయమునందున్॥ సీ॥ తొడలపై నిడియొ
త్తనడుగుపంటవలంతిజఘనంబుదాకించునరసలీల । మడుపు దెమ్మనియొము
మలచిచూడనిసీల కుచముపై చేసాచుకోడిగంబు । వనధికన్యకకిన్కవహిం
బుడిగ్గివత్తగిలచే వలగొను దంటతనము। విసరకుమనితాళ వృంతపుత్రినద
ల్చియందఅనవ్వించుయందగింపు। నొకరొక రెఱుంగనటులగాఢోపగూహ।
చుంబనంబులసాక్కించిసాగసువగలు। వెలయుదక్షిణ నాయకవిలసనమున ।
శేషశయ్యాశయానుఁడై శ్రీవిభుండు॥ క॥ వాకిటికలకలమంతయు। నాకర్ణిం

వుచు సరోరుహాక్షులుదమలో । లేకడక నియూహింపక । శాకోదర రాజ
శయ్య గ్రక్కునడిగియెన్॥ మ॥ ఉడురాణ్మండలపాండురాగ ముఖరత్నో
దారరత్నంబులా। పడగల్మించఁగఁబెంచునాఁగజగతీపాలుండు ప్రాగెంపుచె।
క్కడపుందంతపుపావలై దనరశృంగారంబుగాఁబెట్టియా । కడియంతస్థున
పక్షి రాజాసఁగు కేల్తైక్కడండఁగాఁబూనుచున్॥ సీ॥ కంకణంబులు మ్రో
యఁగాఁనిళయయుమధురారమణియు వింజామరములువైవ। విమలాలతాతన్వి వె
లియాకుమడుపుతో నడుగుబొయక వెంటనంటినడువ। మొలక లేనవ్వుతోఁ
గలిమినెచ్చెలిపిచు సురటి తెమ్మెరలముంగురులుగదలఁ । తలతల మంచు
మూత్రవతీసతీపతి బలసిముందర్భరాబరియొనర్ప । జాఱుసిగ కేలనొత్తుచు
జాటువామె । అంగుదుప్పటివలెవాటు కొంగుజాఱఁ । జీర కెంగేలుబూన
నెచ్చెలి యొకర్తె । యంబుజోదరుఁ డంతిపురంబు వెడల॥ అప్పుడు॥ సీ॥
తనమ్రొక్కుగినుకకై కొనకలచ్చివిదిర్చుపదనఖంబంటినఫాలతలము । వన
రాశినందనవలచిముద్దాడఁగాఁ దాంబూలమంటినఁదళుకుఁగన్ను । అరవింద
మందిరయామోదముగఁబిల్చుమొదటిరక్తిమముంచుముద్దుమోవి। శైవాల్మ
వినోక్కజంకించియిందిర మీటఁగొనగోరుసోఁకినమిసఁకుజెక్కు । చిటులు
గస్తూరితిలకంబుజిరుచెమటయు । గలిగిసురతాంతకాంతశృంగారలక్ష్మి ।
జాటుశ్రీహరిముఖ జలజమునవ్రాలి । మునులనళిపక్ష్ముల్లెనవ్వానివరిలు
గీ॥ శ్రీవధూమణిచెక్కుతోఁ జెక్కుఁజేర్చి । పవ్వళింపంగమకరికాపత్ర రేఖ।
లంటినముకుందు చెక్కిటియందుఁదోఁచు । మకరకుండల మనియెన్నువారని
జనము॥ క॥ పంకజ సదనానవనఖ । రాంకిత వైకుంఠకంఠమను లేపభవ ।
త్కుంకుమ పంకద ళాంకుర । సంకీర్ణముగాఁగ నెంచు జటికాలమెలమిన్॥ గీ॥
యోగివంద్యనిసందిటియొత్తులకును। గళిత కేయూరమణులుగారణముగాఁగ
దలఁపు రుచుగానరమకుపధానమైన। కొప్పువిరులొత్తు లెఱుఁగరు కాంతమైన॥
గీ॥ సిరజాలయగుబ్బ కస్తూరికుంకుమ। ముములసోఁకులువక్షస్స్థలమునఁజూచి।
నిస్తులములగు శ్రీవత్స కౌస్తుభముల । విభలు ప్రసవించెననికం ద్రుమిమల
మతులు। గీ॥ కలిమిముద్దియసిద్దపుకమ్మమేని । పసపునిగ్గులటంచు నేర్పు

రుపలేక । కటితటంబునఁగట్టినకనకపటికి । వింతరుచివచ్చెననికఁ బ్రభుఁశాంతి నిధులు॥ గీ॥ అడుగులొత్తెడు నప్పుడప్పుడమిపడఁతి । గచ్చిగుబ్బలయంగ రాగంబుసోఁకె । ననరు కెంజిగి చరణంబు లంబుజములు । గానఁబొప్పాడి యందురు మానివరులు॥ గీ॥ భువనమోహనశృంగార పూర్ణమగుచు । వెలయు హరిదివ్యమంగళవిగ్రహమున । మగ్నమైచిత్తమానంద మయతఁ గాంచె । విషయవిక్షేపములులేమి ఋషివరులకు॥ గీ॥ మానులానంద బాష్పాయమాననయను । లగుటసంతట నానమిలగుచు లేచి । బ్రహ్మదెల్పిన రీతిమీభవ్యమూర్తిఁ । గాంచిధన్యులమైతిమి కమలనయన॥ శా॥ భేదాతీతుఁడవై జగన్మయుఁడవై పొంపొందుసీలీలసం । వాదంబె మొనరింప నేర్తుమె యతోవాచోనివర్తంత యి । త్యాదిప్రాప్తిన సూక్తులొప్ప ఘటియేమన్న న్మనఃపీఠినీ। పాదద్వంద్వము నిల్పికొల్తు మనుకంపంబొప్ప సర్వేశ్వరా॥ సీ॥ పద్మరాగప్రభా భాసమానకిరీట మృగమదతిలకజృంభితలలాట । విపులనేత్రాభోగ విజితపంకజవర్ణ మకరకుండలదీప్యమానకర్ణ। మందహాసవిలాస మాధుర్యముఖపద్మ యిందిరాసందీప్తహృదయసద్మ । ఘనకటీతటబద్ధ కాంచనకౌశేయ మణిమయ దివ్యభూషణనికాయ । శంఖచక్రాదిసాధన సహితహస్త । యబ్జనిగ్రహరుచివిగ్రహప్రశస్త । మోక్షమొక్కెదశుభ నామ మిహిరధామ। శిష్టజనపద్మమిత్రలక్ష్మికళత్ర॥ ఉ॥ శ్రీపతి తావకీన పద సేవనశీలుర ద్వారపాలురన్ । గోపము మీఱఁదిట్టితిమి కుంభినిఁబుట్టగ నింక నిట్టిబ। ల్పాపముచేత రౌరవముపాలయికూలక యుండ మమ్ముమీ। ప్రాపు ననుంచి ప్రోవుము ప్రపన్న జనావన లోకపావనా॥ మత్తేభ గర్భిత సీసం॥ వినతపద్మాసన విశ్వరక్షణచణా నాళీకప్రత్యక్షసారమేశ । సతతతేజోనిధి సజ్జనవ్రజనుతా తారుణ్యలక్ష్మియుతా యుపేంద్ర । విజితమత్తాసుర విక్రమోజ్జ్వలభుజా శృంగారలీలానిధీముకుంద । మహితకార్యోద్యమ మమ్ముఁ బ్రోవుముదయ హేమాంబరాడంబరా మహాత్మ । యనవిచిత్రవచస్స్ఫూర్తివినుతిసేయ । మానిమత్తేభవృత్తంబు మదినిమెచ్చి । యంబుజోదరుఁ డిట్లని యానతిచ్చెఁ। బ్రావృడంభోద గంభీర భాషణముల॥ క॥ ముక్తులు

ను విరక్తులుభవ। ముక్తులుహృదయాంబుజాతముఖ్యగుణాళి । ముక్తులు
శాంతతనుత్రా। ముక్తులు మీ కేటికలుషములు మునులారా॥ సీ॥ ఆకొన్న
సురలెల్లనమదినంబెవ్వరి క్రతుశాలపంచల గాచియుంద్రు। భజియింతురె
వ్వాని భవనముప్రతిమాసమును పితృదేవతల్భక్తిగోరి । సకలభూతం
బులు సంతృప్తిఁజెందునె వ్వరుసేయఁదగుబలి హరణసిద్ధి। సర్వావతారం
బుప్రశాంతిమునుబూని లగుమనెవ్వరొనర్తుకర్మరీతి । వేదశాస్త్రంబులే
రిచే వెలయుచుండు । నెందునెవ్వరి దినచర్య స్మృతిచయంబు । లర్కజ
యమిచ్చు నెవ్వరియుగ్రతోఁడు । మట్టివిప్రుల కెసయెవ్వ రఖిలమునను॥
శా॥ ఏమీనాక్షికటాక్షలేశమునకై యీశానవాణీశసు । త్రామాదుల్భ
యభక్తియుక్తినెపుడుం బ్రార్థింతురాలక్ష్మిక్రమెం । తోమోదంబునఁజేరి
పాయదు విరక్తున్నన్నునేభూసుర। శ్రీమాహాత్మ్య మెఱిఁగి కొల్వఁగఁగదా
సిద్ధించునానార్థముల్॥ మ॥ అజమూర్ధాపహ వృత్రశాత్రవులు బ్రహ్మ
ద్వేషమున్బ్రేయఁగా । నజహత్సంపదగాంచలేక కడుభీతావృత్తికిన్మర్త్య
లై । త్యజనోద్వృత్తికిఁజిక్కి పొక్కుదరు సత్యంబెందువిప్రావళీ । భజ
నాచారము లేనివారలకు సౌభాగ్యంబు చేకూరునే॥ క॥ అపరాధంబొనరిం
చిన। కపటాత్ములఁ బుణ్యజనులగండని కినుకన్। శపియించితి రన్ననుమీ ।
కృపయెంతని పొగడుదున్ యతీశ్వరులార॥ చ॥ సరసులుఘర్మకాలమునఁ
జండకరోష్ణముపైని బూని యున్। తరముల శీతలంబులగు దారిభవాదృశ
సాధుచిత్తముల్ । పరిఘటితాపరాధముల పట్టునఁబై పయిఁ గిన్కఁబూని
యున్ । బొరయవులోఁ గఠోరత బ్రపూర్ణశమాఢ్యములౌట నెప్పుడున్॥
క॥ వీరలుమీకొనరించిన । నేరంబున ధరణిఁబుట్టి నిశిచరులగుచున్ । బో
రుననాచేఁదెగినం । జేరెదరని యతులఁబంచి శ్రీపతియంతన్॥ సీ॥ జయ
విజయులఁజూచి దయనిటులనుమున్ను యోగనిద్రాసక్తినున్నవేళ । నాదం
డకరుదేరనలినవాసినినడ్డగించినమీపై నిగినుకపూనె । నదియుదప్పించితి
నవనీసురులశాప మలవిధమె తప్పింపనవనిలోన । నీకమూరుదైత్యులై యే
డుజన్మంబుల దాస్యంబుచేసిపదంబుఁజేర । గోరెదరొ జన్మములమూఁట

వైరులగుచుఁ। జేరదరొయన్నవారలు వైరమునను। చేరెదమటంచుఁ బ్రమొక్కఁ గన్నీరుదొరుఁగ। విన్నవై విన్నవించిన వెన్నుఁడప్పుడు॥ వ॥ అటులగావింపుఁడని యంగీకరించి యంగనాసంగతుండై భుజంగపుంగవశయనుండంతఃపురంబున కరుగ నంతఁగ జయవిజయులు సముద్రమేఖలకుంజని రుద్రభృత్యులగు భద్రానుభద్రుల రౌద్రాంశంబులంగూడి దితిగర్భంబున నర్భకులై యున్నవారి వారియావిర్భావ సమయంబుగావున నఖిల లోకంబులంధతమసమయంబులై యున్నయవి యింక చతుర్భుజ నిర్భరకరుణాతిశయంబున మీరునిర్భయులుగాగలరని హిరణ్యగర్భుండానతిచ్చిన హవిర్భజ్ఞులు యథేచ్ఛంజనిరంత॥ గీ॥ శ్రీవిభునినామమెక్కడ చెవులఁబడునొ। యంచుమూసిన చందాన హస్తవిహిత। కర్ణమైయుద్భవించె నాగస్యపాగ్ర। దారగర్భంబునందు దైత్యద్వయంబు॥ పంచచామరం॥ధరంబులొడ్డగిల్లె ద్రెళ్లె దారలారెనగ్నిభా। స్కరుండుమాసె బ్రమొసె జంబుకంబులంబురాసుల। బ్బురంబుగాఁగఁ గాగిపొంగెభూమి గ్రుంగెవాహినీ। ఝురంబులింకెఁ గొంకెఁ బంకజాతసూతియుత్తరిక॥ గీ॥ కశ్యపుఁడువచ్చి కృతజాతకర్ముఁడగుచు। నగ్రజుఁడు హిరణ్యకశిపుఁడని సహోదరుడు హిరణ్యాక్షుఁడనుచునురూషిగాఁగ। నామకరణంబుగావించెనందనులకు॥ వ॥ అంతఁ బ్రతిదినప్రవర్ధమానులగు దితిసూనులయందగ్రజుండగు హిరణ్యాక్షుండక్షీణబలంబునమించెనట్టియెడ॥ సీ॥ అంగుష్ఠమునవిల్చెనాకిరీటముదాకి పటపటబ్రహ్మాండభాండమదరు। నట్టిచేతులుసాచెనాపూర్వపశ్చిమ చంద్రదినేంద్రులచంకనిరుకు। వడిగాఁగనాలుగై దడుగులునడిచెనా ధారుణీతలముపాతాళమంటు। నొకయింత ఘనముగా నోడలుబ్బజేసెనా హరిదంతరములెల్ల నవియుబారు। కడిదీ నిట్టూర్పు గాడ్పుల గ్రహగణంబు। లొక్కఁ మూలకుఁజిక్కఁన త్యుగ్రదృష్టి। నిగుడుచోటెల్లనిగురులై యెగయునట్టి। హాసమొనరింప విధి గుండెలవియుచుండు। వానియౌద్ధత్య మెన్ననెవ్వారితరము॥ మ॥ అసురాధీశుఁడు రోహణాచల సముద్యద్రత్నముల్ సెక్కఁర। మ్యసువర్ణగిరి మూర్తిజేయఁ బరభూషావాప్తికై పాలద్రు

గ్వసుధా భృన్మణి లోహముల్ పుటములై ద్రావందన్మణిప్రాప్తిక । న్నిస
ముద్రంబులు వెల్లిబల్లిఁ దలఁచున్ మోహాను రూపంబుగన్॥ అంతనో
క్కనాఁడు॥ క॥ జలరాసు లేమ నొండై । కలసిన జలకేళి సల్పగా నిష్మ
గుసి । యిలయేమి నడుమ ననుచుం । దలచి హిరణ్యాక్షుఁ డధిక దర్ప
స్ఫురణన్॥ మ॥ నగరంబుల్నగముల్నదంబులు నరణ్యంబుల్నదుల్ లోను
గా । జగతిన్ జిత్రపటంబు డంబుగనిపింపన్ జుట్టిచక్షుశ్రవో । జగతిం డా
చె హిరణ్యనేత్రుఁడు తపశ్శౌర్యాస పర్యాప్రహ। షణగభాషాహృదయేశ
ద త్తవరదో స్సారంబు ఘోరంబుగన్॥ మ॥ చటులోచ్ఛ్వాస మరుత్పరం
పరలచే సర్వాంక షాభ్రంలిహ । స్ఫుటిమస్మంద మహా పయోధిని సము
ద్భూతోర్మిజాతంబులు । త్కటఘోషంబున ఘూర్ణిలన్నగదా దండంబు
చేఁజెందుచున్ । ఘటియించెం జలకేళి హేళిమెయి రక్షస్స్వామి యక్షీ
ణుఁడై॥ క॥ అదిచాలక బ్రహ్మాండం। బుదితముగావించి బాహ్యమున నుది
తంబా। నుదకమున నీదులాడఁగ । మదిఁ దలఁపుచు నుండెదితి కుమారుం
డధిపా॥ ఆసమయంబున॥ క॥ స్వాయంభువ మను వొకనాఁ । డాయంబుజ
భవునిఁ జేరి యతివయుఁ దాను । న్వేయువిధంబులఁ బొగడుచు । నేయనువున
సుగతిగల్గునెఱిఁగింపుమనన్॥ క॥వనజాక్షుఁగూర్చిజన్నము। లొనరించినసుగతి
గలుగు నొండేమిటిచేఁ । గననేరవనుడునలువకు । మనువనియెంజోటు గాన
మఖమునకనఁగన్॥ ఉ॥ ఔనిదినిక్కువంబుగన కాక్షుడుఘోరతపంబు చేసినా
చేనవనీతలంబుఁ గొనిజేర్చి నధోభువనంబున । ద్దానవుఁడుంచి భూతలము।
దారతరాంబుధి నీరఁ దేల్చెఁగా । నేనె సమర్థుఁడౌదు బహులెవ్వరు తద్ధరనుద్ధ
రింపఁగాన్॥ క॥ అనిహరి దలఁచుచుఁ దనలో । నను చింత యొనర్చుబ్రహ్మ
నాసారంధ్రిం । బునఁగిటి యొక్కటి వెలువడి । యెనువడి నంగుష్ఠమాత్ర
దృశ్యాకృతితోన్॥ ఉ॥ అంతట హంసమాత్రమయి యాపయినుతు సదృ
క్షమైగజం। బంతయియంతమీఁదఁ దుహినాచల మంతయియీజగంబునా ।
ద్యంతముదానయై సితసముంచిత గాత్రముదారఘోత్రముస్। దంతురదంష్ట్రి
లుండనిపి దంభ కిటీంద్రము దారుణంబుగన్॥ మ॥ ప్రళయాంభవిజృంభి

దుఁడై । సమరాక్రాంతు కృశానుముఖ్యపదముల్పర్చించి మాత్సైనికిన్ ॥ చ॥ వరమునిఁ జేరఁబోయి గణవాఘను వచ్చితిఁ బోరుమన్ననా । శరనిధి భర్తవిన్నదుర శౌరి సముద్ధుఁడు గాకయున్యులో। పరుచనుమన్నఁ బాల్కడలి పక్షకునేఁగుమనున్న నాందుం। డరుదుగనేఁగుడెంచి దనుజాధిప స్వస్తియటంచు నెంచెయున్ ॥ మ॥ త్వరరగాఁబోయెద వేమికార్య మనినం దైత్యాను నేఁబోరికి । న్వపణుం బిల్చినఁ బోరజాలక హరిన్ వర్ణించినం బోయెదన్ । హరి నైకుంఠమునం గలండె యన నాహా యిట్టి నీ వార్తముం । దరగా నేవిని ఘోణినై చనినెఁ బాతాళంబునం డాఁగఁగన్ ॥ గీ॥ ఎందుఁబోయిన బోవ నీకిప్పుడు నీవు । వెంటనేపోయి గెలువు మవిష్ణువనుచుఁ । బలుక నారదమౌని నీపాగమౌన । పోవనీనంచుఁ బాతాళము పసు నరిగి॥ మ॥ కనినెం దానవ సార్వభౌముఁ డెదుట న్గంభీర పాథోధిమ । ధ్యాలిమగ్నావనిభార సంవహన దంష్ట్రాంకూర మంచ్చచర । ద్వనభృగ్గాఠను వజ్రసారకృత సంధానాంగ రుద్యారమున్ । స్తనితా భీలరవానుకారము మహోదారంబు భూదారమున్ ॥ వ॥ ఇట్లుకనుంగొని ॥ గీ॥ నాకవరవైరి శౌరిపోపోకుపోకు । ఋదిగొవచ్చితి నెందువోయెదవు పంద । తిరుగులిరుగు మటన్న నుద్వేలరోష । రసభరంబునఁ గుహనావరాహము పసు॥ గీ॥ కోర దనరారు ధరణిచకోరనయన । వారిరాశినిఁ దెల్పె నవాంరితాత్మ । శక్తి యాధారముగఁ జేసి శక్తినాథ । ముఖులు నానాబ్రహ్మాద్యనుముఖులు వొగడ॥ గీ॥ పద్వతారాతి గురిసె మద్బాష్పమేఘ । పుష్పవృష్టికిఁ దోడుగాఁ బుష్పవృష్టి। పర్వతారాతి భాస్వర ప్రభలనదియు। దానవోత్పాతమునకు నిదానమయ్యె ॥ వ ॥ ఇవ్విధంబున నవ్వరాహమూర్తియ్యుండనన్యసామాన్య విరోధిరమాన్యాకారమాన్య బలంబునం గువలయంబుం గువలయంబు చందంబునఁ గమలాకరంబునం దేలించి మదాభంగుర మాతంగ పుంగవ సముత్తుంగ బృంహితంబునం గెరలు క్రోధము సింగంబు తెఱంగునఁ గిరుక్కునఁ దిరిగి యిట్టట్టు సనక బులితోలు గట్టు వేలుపుగట్టుపలె కీటవెట్టి ముట్టెబిగించి వెన్నునట లుబ్బ శలవులు

నప్పరించుచు వేశిమిడుంగురులు నొడమ నినుద క్రోవ్వాడి కోరలు దీం టుచు దీర్ఘనిర్ఘాత ఘుర్ఘురఘుర్ఘురి నిర్ఘోషంబుల బ్రహ్మాండ భాండంబు పటపటం బగులింపుచుం జంద్రదిప్పుల కరాశివేంద్రంబై తీండ్రించు జూపు లం జురచురంగనుచు గదిసిన నసురపతి యట్టహాసంబు చేసి యిట్లనియె ॥ గీ ॥ హరివనసుటంజేసి మునుపంగ ఁగుట నిక్క। వంబు మడనేఁడు సీవి కా రంబు నొంది । పాద్విషైతివి నేను పొంగఁది యుంఁదు । పందివేఁటాడు టను గోర్కి ఫలితమయ్యె ॥ ఉ ॥ నాసవదంతి దంతములు వ్రల్లది భాస్వన కొంటి కొమ్ముగాఁ । గానిటివదే కరంగి కాఁటకు దంతపు పావలిత్తునం । చాసను గ్రుమ్మరంగలిగె నాదివరాహము నీదుకొమ్మునేఁ । జేసిన యత్న ముల్ఫలము జెందెను తావక దర్శనంబునన్ ॥ ఉ ॥ పీరుఁడవంచు నిన్నుఁ బది వేల విధంబులఁ బ్రస్తుతింపుచు । న్వాతిఁభక్తి దెల్ప వినివచ్చితి మెచ్చెద నేఁడు చూపుఁ సీ । వీరతఁగాంచిసీకపద పీఁఠవృత్తిని మోరతోపునం । బౌరెదనన్నుఁబోవిడఁడు స్వర్ణవిలోచనుడంచు నుగ్రుఁడై ॥ ఉ ॥ దండము బెట్టఁగా సురవితానము లందును భక్తిసేయకన్ । దండముబెట్టుగా విసరి దైత్యుఁడు వ్రేసిన బొండెతూట వే । దండము దాఁకినట్లు కిటిబాఁకి యదే తటఖండమైవ కో । దండము బూనివాఁడు నిశితప్రదరంబులు గాడనేయఁ గన్ ॥ గీ ॥ సెలసికొట్టిన కిటికోర జీరవారి । కనకనయనుని బలుమేనఁ గాననయ్యె । వలపుమీఁఱఁగనిడు మృత్యువనరుహాక్షి । వాడి కొనగోఁట జీరె నావసుమతీశ ॥ అంత ॥ మ ॥ శునకంబుంబలె జుట్టుముట్టుకొను రక్షోవీరు దంష్ట్రాభిహతిం । డునుకత్చేసి తదీయసైన్యములఁ బొందులాపి తద్రక్తసి । క్త నవీనాంబుగ్ని నోలలాడుచును భూదారేంద్రుఁ డొప్పాఁగె మే । రనుదాల్చెన్ సురలెల్ల గోరఁ దన కోర న్ధారుణీమండలిన్ ॥ సీ॥ తన్మి కన్ను లమరందమదభ్రమవులు జాఱనెఱడేఁటి చూపులు జెఘుకఁజూప । శైలవక్షోజముల్ఘర ఘర్మమున దోఁగిమబ్బు పన్నియపైట మాఁఱుకొనఁగ । నబ్జాకరాస్య మోహానభంగ విభ్రమ భ్రూవిలాసంబులు బొల్చు మిగుల । మహిత చిత్రంబ నింబమునొందయుచు దమునాశె ౩ నెను

రంధ్రనాళియు వనరోమరాజి మెఱయఁ । దనులతచలింపఁ గపట భూదార
కాంత । దంతకోరక ఘట్టిత ధర నవోఢ । వసుమతీకాంత యానంద
వార్ధిఁ దేలె॥ మ॥ పరికింపం గిటికోర దంష్ట్రమయ దీపస్తంభమైయొప్పె పై।
పరిశోభిల్లెపుధాత్రిపాత్రివలెఁజూపట్టెం దదగ్రాల్పపు। ష్కరముల్ తైలము
లీలబొల్చెగనక గ్రావంబుదీపంబువై । ఖరిఁ జెంపొందెఁ దదంతదీపశిఖవోఁ
జెన్నొందె మేఘాళియున్॥ అంత॥ క॥ దితిజనిశాటనరాహుః । శ్రితమరిణేం
గీవరాహు శ్వేతవరాహుః । నుతియించి రప్పుడు శతధృతి। శతముఖముఖ
మహాముఖులు సన్ముఖులగుచున్॥ శా॥ ఆహా యజ్ఞవరాహమూర్తివగు
టీవాశ్చర్యమే విస్ఫుర । ద్దేహచ్ఛాయలు పౌండరీకరుచిజ్యోతిష్టోమలీలన్న
ను । స్వాహోద్యచ్ఛవివిచ్ఛవిచ్ఛహరిమేధారూఢిజాటం భవన్మాహాత్మ్యం
బులిలింప నేమితుమె సంభక్రోడచూడామణీ॥ సీ॥ క్రూరారికోటిం గురువింద
ములఁగాని కురువిందములనెందు గ్రాచ్చబోవు। పరిపంధిబహురక్తపల్ల
వంబులఁగానిపల్లవంబులక్రీడఁబడయఁబోవు। వైరివీరనిశాటవంశంబులను
గాని వంశంబులెందునువంచబోవు। బలసమేధిలపలాశులగాని పెరపలాశుల
గొమ్ముచేనెలఁగలఁబోవు। ఘోణిమాత్రంబవే దితిప్రాణదనుజ।పాణిగత
ఖండనకలితక్షోణిసేల। వేణికోద్ధారచణదంష్ట్రికాణిమేత। రబలశమితార్తి
కుహనావరాహమూర్తి॥ చ॥ పలపునసెప్పుడుష్టగొనవచ్చిన నీదగుమోము
సూచిపో । యలసిలిపదగాడపని యంబుజగేహినిగేళిసేయదా । జెలిమిని
సీతుముస్తాసఁగఁజేరినయట్టి షమూవఘూటితోఁ । గలసితివెందునోర్పు గల
కాంతసుభాస్వితమాగిటీశ్వరా॥ సీ॥ గిరిరాజఘుస్ణేంద్రకరిమదధారనాక్రీపంధ
రాకారశిఖియనంగ । వజ్రసౌధాగ్రభాగ స్వర్ణహారిన్మణియన కల్పశాఖాకల
కంఠయనఁగ । గౌరాబ్జకోరికకలహంసికయనంగ కేతకీకుసుమభృంగికయ
నంగ। మహాక్కైకస్తంభమనువాశ్మిగృహమనవారిభదంతశైవాలమనఁగ।
సున్మఖాహేంగ్రబలోపసద్యుతియనంగ। నవ్యతావకదంష్ట్రికా నాళమునను।
ఈనలయంబనఁ బెలువందె కువలయంబు। రక్షితావనిదేవ వరాహదేవ॥ క॥
[illegible] యుడు బ్రహ్మగుల। సానస్రస క్షోంచి దంష్ట్రికాభూసతికిన్। విను

బించె సకలధర్మము । లసుగపటకిటిక్రమమ్లానదాస్యసత్యముల౯॥ క॥ తొ
లుత పానుగంటి సుట్టుట । వలసం జూపవశేషుఁడు గుణసుధాన్విలిప్తై । కలగి
రులఁ జేసియుర్విడ । నిలిపెనజుఁడుముఁడుగకుండ నేపుమెఱయ౯॥ చ॥ పుర
ముల్గ్రామములున్నదుల్సరసు లంభోధుల్వనుల్ద్వీపము । ల్గిరులున్ప్రపన్న
పార్యశూద్రకులు సంకీర్ణోద్భవులున్ పశుల౯ । గరులుం దేజులు ధేనువుల్ఘనమణు
ల్కాంతాదులుం గ్రాగ్విధా । స్వగయార్యాధర యుష్మదంబురుహభూసంకల్ప
మాత్రంబున౯॥ క॥ ఆమొద బహుయజ్ఞంబులు । స్వాయంభువమనువు భక్తి
సల్పె౯ లక్ష్మీ । నాయకుఁడు ప్రీతుఁడై ని । శ్రేయసమొసఁగె౯ యశ్శ్రేష్ఠనిర్గుల
నొసఁగె౯॥ ఉ॥ శ్వేతవరాహకల్పమిది వేడుకనీ కెఱిఁగించితిఁ దగు ఖ్యాతి కిటీం
ద్రచర్యకుతుకంబున విన్నఁ బఠించిన౯ జన । వ్రాతము గాంచు నక్షరవరాహ
కృపన్నిఖిలేప్సితార్థసం । ఘాతము విష్ణుభక్తతిలకా జనమేజయ భూమిపాలకా॥
క॥ అని శ్రీవైశంపాయన । మునిముఖ్యుఁడు దెల్ప విని ప్రమోదాన్వితుఁడై ।
జనమేజయుఁ డవ్వలికథ । యనఘా వినవలతుఁ జెల్పుఁ డని యడుగుటయు౯॥ శా॥
శ్రీరంగత్కరుణాకటాక్షతపన శ్రీముష్ణతీర్థాగ్రతా । పారామాశఠకుంభ
ఘోణ విలసత్పత్రాంతకాశీశ్వర । శ్రీరామేశ్వరకీర్తివారినిధి కాంచీదక్షిణో
పాయపా । హారప్రోషిమధైర్యశేషగిరిదృప్తా యోధ్యమాయాతిగా॥ క॥
భారతశాస్త్రార్థప్రతి । భాంతమత్యాఢ్యధరణి భారతమారను । ద్భారతపాఠీ
ణయశో । భారతబింబాస్యభృత్య భారతభృతిదా॥ పంచచామరం॥ హిరణ్య
గర్భముఖ్యదామహృష్టశిష్టశేముషీ । హిరణ్యగర్భభామినీసమీహితాంగ
సుప్రభా । హిరణ్యగర్భవైభవాఢ్య హృత్సరోజవిస్ఫుర । ద్ధిరణ్యగర్భభే
దిధైర్య హేమభూమిభృద్వరా॥ గద్య॥ ఇది శ్రీరామభద్ర దయాభిరామ
భద్ర కరుణాకటాక్షవీక్షా పరిప్రాప్తదీప్తతరాష్టభాషాకవిత్వసామ్రాజ్య
ధౌరేయ సకలవిద్వత్కవిజన విధేయ ధరణిదేవుల నాగనామాత్య సుధా
సముద్రసమున్నిద్ర పూర్ణిమా చంద్ర రామమంత్రీంద్ర ప్రణీతంబైన దశా
వతార చరిత్రంబను మహాప్రబంధంబునందు దృతీయాశ్వాసము.

మూఁడవయవతారంబగు వరాహావతారము సంపూర్ణము.





## నృసింహావతారకథ.

### చతుర్థాశ్వాసము.

శ్రీమద్వేంకటశైల । స్వామి కృపావర్ధమాన వైభవరేఖా । ధామే
య యసమసమర । స్థేముండలనాత్మకృష్ణ మగదలకృష్ణా॥ గీ॥అవధరిం
పుము జనమేజయక్షితీశ । శేఖరునకిట్టులను వ్యాస శిష్యమౌని । ధరణినాథ
నృసింహావతారమిఁకను । దెలియఁ జెప్పెద వినుమని తెలుపఁ దొడఁగె ॥
శా॥ శ్రీలీలావతి నవ్యనేటికని ఘర్షింపంగనే నవ్వనో। బాలాసాజము సింహ
వక్త్రమునకే పాతేంద్రచిత్రంబునీ। వాలోకింపుమటంచుఁగుడ్యమున జేయం
జూపినవ్వింపజా । ల్కొలలక్ష్మీనరసింహ మూర్తియొసఁగుగాక్షేమంబు భక్తా
ళికిన్॥ సీ॥కనకాంబరునిచేతఁ గనకనేత్రుఁడుగూలె నసుమాటచెవినాటగన
లికనకా। కశిపుఁడత్యుగ్రుఁడై కాలకాలాంతకు లీలశూలము గేలఁగీలుగొల్పి।
వెలిహజారము జేరవిప్రజిత్యాదిదైత్యులఁజూచి వింటిరె యొక్కవింత। హ
రికిటియైహిరణ్యాక్షువిదారించిచనెనట తానెందుజనెడివాఁడు । చోరతన
మునవారాశిఁజొచ్చెనేని।కూర్మమైభూధరముక్రిందఁగ్రుంకెనేని । ఖత్రియై
వసిఁజేరినఁబోవసికె। పట్టివధియింతునెంజిరి శాపుకొందు॥ క॥ ఆకతివగలకుం
డిసి । సాకెకు గోవిప్రహింస నల్పుఁడుదద్ర । వాకతిఁజేరినశౌరిని। వారిం

చెవ నంచుబంప వాపయ ఘేచ్ఛన్॥ క॥ లడవిడిచిన పాములవలెఁ । బుడమి నిమెల్లెడలనిండిభూసురవరుల । న్గెడపుచు గోగణములబడ । నడపుచుఁజెరి యించిరంత కాకృతులగుచున్॥ గీ॥ దైత్యనాయకు డంతసోదరునిపాటుఁ । జూచిశోకార్తుఁడగుచుఁదత్సుతులశకుని । శంబరాదులఁదత్ప్రియ సతుల జననిఁ । గాంచియిట్లనుఁగడువివేకంబుదోరయ॥ శా॥ సామాన్యుండె హిరణ్యనేత్రుఁడు భుజాశౌర్యంబుచే భీమసం। గ్రామక్షోణులగెల్వఁడే మునుపు సుత్రామాదులన్నిన్నమ। శ్రీమత్వంబున మించఁడే గనఁడె కీర్తిం గాలధర్మంబుచే । నీమేన్విడిసయంత దీనికిట తల్లీ యేలదుఃఖింపఁగన్॥ శా॥ పీరుండై జనియించి సప్పుడ రణోర్విస్వైరులన్గోర్వలో । దారత్వంబునఁ గెల్వఁగావలయు శేదాళోమ్ముగాయుమ్ముల। న్వీరస్వర్గముగాంచఁగావలయునింతేకానివేరొండులే। దారా రెండునుగాంచెనీతనయుఁ డేలా యుంతజాలింబడన్॥ శా॥ నీపుత్త్రుండితడంచు దుఃఖపడె దెంతో దేహమో జీవుఁడో । నీపుత్త్రుండిట దేహమాత్రమనియుంటే కాదు జీవుండన । న్నీ పుత్త్రుండిపుడైన గర్మగతి నొందే పూర్వముంబుట్టఁడో । రేపున్బుట్టఁడొ యుంత నెవ్వరికి పుత్త్రీభావమాద్యంబగున్॥ క॥ వినవేమున్ననుయజ్ఞం । డను నాశీనరనరేంద్రుఁ డరిహతుఁడై భూ। మిని బడ నాతని నైఁబడి। తనయులు పత్నులును బంధుతతి విలపింపన్॥ క॥ కాలుం డచటికిఁ బానొక। బాలుండై వచ్చి ప్రేత బంధులసుతులన్। బాలా మఱులంగనుఁగొని। యేలా శోకింప నెఱుఁగ రేకాలంబున్॥ క॥ తానిత్యుండై పోయిన। వానికిఁజింతింప బోయ వలఁబడుసతికిన్ । లోనహరి యొకరుళింగము। వానికిలోనయ్యెశరము నైవగ పిదపన్॥ క॥ అని బుద్ధిసెప్పివారల। ఘనశోకము మాన్పియముఁడు గ్రమ్మరెఁగానం । జననీ గతజీవులకుం। జను నెదుఃఖింపఁదత్త్వ సంవేదులకున్॥ సీ॥ అంభోజసంభవుఁడాదిగానల నవబ్రహ్మలునిర్మాణ పటిమగనుట। శతపత్త్రనేత్రుండు శత్త్రులోకభయంకరంబైనదివ్యచక్రంబుగనుట। వెన్నెలవిరిదాల్పు వేలుపుభువనమోహనసర్వ మంగళావాప్తుఁడగుట । భృగుముఖ్యులగుమహాఋషులుబ్రహ్మాదులశపియింపఁజాలు జాడ్యంబుగనుట। నైదుసంవత్సరముల ప్రాయమున

ధ్రువుఁ । నిఖిలలోకోన్నతంబైన నెలవు గనుట । దపము చేసియె కాదె
యెంతటి తపంబు । నేను గావించి కాంచెద నిష్టసిద్ధి॥ క॥ అని యనిపించుక న
మృతా । ద్యనుపమవస్తువులనిచ్చు హరికిఁ గిరియం । చును మెచ్చుచు మంద
రనగ । మునకేఁగి దపగ్రసీమమున మునివృత్తిన్॥ సీ॥ తృణభక్షణము చేసి తిరు
గవె సన్మునీశ్వరు లెలమిన వెయ్యాజలచరములు । గాలియాహారంబుగా నుండ
వేఁక పన్నగానుపానమున నుగ్రవస్సురాపడేండ్లు । ఫలరసంబులు మేసి చిలుకలు
దినగవె యుసుఁపులు మేసి కోయిలలు దగవె । బిసఖండములు మేసి ఔలుఁగ వె
రాయంచ లబ్బెం దుష్కులజాతకాఁ మనజె । యొకటి యశనంబుగాఁ గొనియుం
టఁ దగవె । యని నిరాహారుఁడై పాదమంగుటమున । నేల నిల్పి ఖరాంశుపై
నిల్పి దృష్టి । విబుధవిరిపుండు తపము గావింపుచుండె॥ అంత॥ ఒకనాఁడింద్రుఁ
డున్నతజయమానహోనోవ్యగ్రభాగంబునన్ । సకియల్గొందఱుకుంచగిండిసు
రటీ సామ్రాజ్యహాంబులవ । ల్లికగాళాంబుయు బూనిగొల్వఁగ శచీలీలావతిం
గూడి గాయక । చంద్రాస్యల గానములు వినుచుఁ గొల్వై యుండె మోదంబునన్॥
మ॥ స్వర్దేహంబు తెలియంగునన్ బహుగవాక్షస్ఫూర్తి రాజిల్లుఁ జాలకమార్గం
బులఁ గ్రొంనికాయముక ప్రాలావృత్తవక్షోజకీ । రక కాశ్మీరమురంగి కామద
విమిశ్రాభై త్రివేణీగతిన్ । నకమా నాకధునింగనుంగొని పఘూరత్నంబుతో
నిట్లను—॥ మ॥ జలుగుంబయ్యెద చాటునం గులుకుపీసిబ్బెంపు చక్రాదోయినాఁ
జెలువమ్యాంబలజాతకోశములు హంసీవత్కువిక్షేపచం । చలగంగోర్ముల చక్ర
వాకనఖలత్మాంబుల్వి శేషంబులం । దుల నింపుంగలిగింపఁగా వలదె తోడ్తోఁ
బద్మకోశస్తని॥ మ॥ అనినం జాలు మరేమియంచు శచి యొయ్యారంపు లేవ
వ్వజం । కెరనాల్ప్వాపులు చిన్నికిన్కఁ దెలుపం గెందమ్మి పూమొగ్గ చేఁ ।
దను వైవఁగ నిభర్తగుబ్బయురి మొత్తన్ నోరనొత్తన్నితం । బినిసీత్కారము
తోడఁ జొక్కుచును గర్పొంబైటనున్నిగ్గునన్॥ గీ॥ మఱియు నాయావిశేష
ముల్మ త్రిభృంగ । వేణికెత్తిఁగింపుచును రాజవీథిలోన । సత్వరంబుగఁ జను
దెమ చాంగాంది । యొవిశేషంబుగఁ గలనో యిలనటంచు । క॥ అక్కడికిఁ
బిన్నసంబునఁ గ్రక్కునఁ వాడయుగుఁ దెంచి కడువినయముతోఁ బ్రొక్కి పరా

కుసు రేశ్వర । యొక్క విశేషంబు గల్గెనుర్విస్థలిపై॥ గీ॥ కనకకశిపుండు
ధీరుండు గనుక గడఁగి। తపము సేయంగఁ దొడఁగె నాతపము శీత। మంచు
నెంచక గదలనిమంచుగట్టు। చారి దారితకుధరము దారిభిదుర॥ చ॥ తపము
లకేమి దానవులు దైత్యులు సర్పరో కోర్కులందరో। చపలతఁగొండ అం
దు నెల జవ్వనులంగైకొందురో వారితో। నుపమకు రాఁడు వీఁడు గడు నుగ్ర
పు నిష్ఠ వహించె నింక నే। యుపమను మాన్పఁగావలెనో। యూహ మోన
ర్పుసుపర్వవల్లభా॥ గీ॥ చండవాతోత్థభూరజఃపిండనమునఁ। గొండమో
డునఁ గదలకయుండు దైత్య। మండలేంద్రుని దేహ ముద్దండముగను। గం
డకండూతి నొరయు వేదండగణము॥ గీ॥ మానసము చంచలంబైన మట్టుపడె
నో। గాక నాసాబిలంబులఁ గ్రందుకొన్న। చీలువగుంపులు మేసెనో తెలియ
రాదు। వెలివిసరదయ్యె దైత్యేంద్ర విభునియూర్పు॥ గీ॥ పవనమునునిండి
వానల పదనుగన్న। రజముపైఁగూర్చి పెట్టిన ద్విజగణంబు। శిఖలోవితర్క
గమియంకురింతసుక్ర। శిష్యశేఖరు చాలలలో చెట్లుమొలచె॥ గీ॥ ఇంక
నొకవింత నా దానవేన్ద్రుశిరసిడీఁది। మేనఁబుట్టిన పుట్టక్రొమ్మెఱుఁగుఁ గ్రొళ్ళ। గ్రు
చ్చి తేనియఁగైకొను నిచ్చ నిచ్చ। నచ్చ భల్లంబులచ్చట నచ్చపడఁగ॥ చ॥
శిరసుననున్న తేనె పెఱశీతమయూఖుని రేఖగా నభం। గురతర దేహయష్టిఁ
బెనఁగొన్న భుజంగ కదంబకంబు లా। భరణములై దగన్ పుకవిపాటిత చూ
తఫలసన్నిభస్మరం। దరసముగంగ గాఁ దపము దైత్యుఁ డొనర్చె మహోగ్ర
వైఖరిన్॥ క॥ అని వినివిన్పిన విని మిం। చినభయమున నిన్ద్రుఁడనుపఁ జెలు
వలతోడం। గనకాంగి యల్లమందర। మునకుం జని హావభావములు దఖు
కొత్తన్॥ క॥ ఆటలఁ బాటల మాటలఁ। జేటలవలపింపలేక దితిజాధీశుం।
బాటలగంధి బలాసుర। పాటనుగడకేగుదెంచి భయవినయములన్॥ చ॥
పలికిన మోముఁ జూపినను బాడిన నాడినఁ గేల నంటిన। స్థలకల నవ్వినన్న
ను చుగాభువి నెల్లపలాశిబృందమం। చలవునఁబోయినేఁ లపలాశినిదగ్గతిష్ఠా
ణువైఖరి। న్నిలువఁగఁ జూచివచ్చితిని నేస్తపితాచనఁగా సురేశ్వరా॥ క॥
నీచిత్తమునకమీఁదట। నాచేతంగాదటన్న నామనవియు। కేసాదిపానుమ

మదినాలో । చనచేయుచు సహస్రలోచనుఁడుండెన్॥ ఉ॥ అంతటఁగొంత
కాలమున కచ్చటికొక్కచరుండువచ్చివృ । త్రాంతకదానవేశ్వరుఁ డుదార
తపస్థితినున్న దేహమా । ద్యంతము మక్షికల్మెసవె నస్థులనంటుక జీవముం
టమా । కింతయుఁదోఁచదన్నదివిజేశ్వరుఁ డెంతయు సంతసంబునన్॥ క॥ మ
నకిదియే సమయంబిఁక । ననియన్యనిశాటకోటి నణఁగింపనటం। చున వజ్రి
గుమాపునిఁజూ । చినమంచిదయనుచు నతఁడుసేనలుగూర్చెన్॥ మ॥ జలధి
వ్యంజితశాదము ల్పౌళియగర్జన్మేఘసంవాదము। ల్చళితక్ష్మాధరపాదము ల్ద
నుజకాంతాగర్భ నిర్భేదము । ల్బలవన్నిర్ఝరమోదము ల్ప్రకటిత బ్రహ్మాం
డవిచ్ఛేదము । ల్బలిసె న్భేరినినాదముల్కృత సురప్రత్యర్థిఖేదంబులై॥ సీ॥
గంధాంధపరిపంథికంధిమంధవసుంధరా ధరస్మదసింధురములుగదల । సర్వ
పూర్వసుపర్వ దుర్వారగర్వ దూర్వాపర్వచర్వణార్వములునడవ। శృంగ
వన్మదభంగ చంగరథాంగసంగతతుంగ తరశతాంగములు వెడల। దుర్భా
వగార్భిగ్యాగర్భనిర్భేదన ప్రబలార్భటులవీరభటులుసాగ। వీరదోహళ కా
హళీవివిధవాద్య । వారఘోషంబువందికై వారరవము । దారుణంబయిభూ
నభోంతరములను । శత్రుఁడసురేంద్రుపట్టణమాక్రమించి ॥ క ॥ యుద్ధము
సేయగనపుడుస । ముత్థబలాధికులుదానవేంద్రునితనయుల్ । లత్రద్ధులైద
నుజసైనికులుద్ధతులై కోలువఁదాఁకి రుత్సాహముతోన్ ॥ క॥ సిద్ధపురి వెడలి
చనెనని। గద్దరితనమునను నక్కకదుపులుపొదలో నుగ్గవిడిఁ జొచ్చి చిఱు
తల । యొగ్గంబడినట్టులమ్యోనోయమరేంద్ర॥ గీ॥ ఎందుఁబోయిననింకఁబోనీ
మునిన్నుఁ। బట్టిద్రుంతుము దైత్యేంద్రుపాదమాన। నిలువుక్షణమాత్రమను
చు నిర్నిద్రరోష । రసభరంబునదారుణాస్త్రములుగురియ॥ మ॥ శలభీశాబ
గరున్మరుత్కులముచేఁ జల్లారునెందావిశ । జ్వాలనజ్వాలికయేల యీ తెగువ
రక్షఃపుత్రులారా తెగ । వ్వాలదేం దేచనుఁడద్రినిర్దళనమద్వజ్రంబుజిల్లేదురె।
మ్మలపైం బౌరదటం చువాసవుఁడు సామర్థ్యంబుసూచింపుచున్॥ మ॥ శరవ
ర్షంబునముంపదైత్యతనయు ల్సార్యంబుతోఁబోరని। ర్జరలోకేశ్వఁరుడస్త్ర వ
జ్రముగొనసైస్సరింపఁగాలేక కా। తరులై యూడనివారిరన్యదనుజా తస్తోమ

ముల్కొన్నలై ద్రుమ। శీరణోత్సేకముదక్కి యింద్రుండు బలారింగూడి యుత్సు
ద్ధతిన్॥ చ॥ నగరముసొచ్చి హేమలలనామణిపట్టుదుకూలముఖ్యవ। స్తుగ
ణముఁగొల్లలాడుచును దోడ నెయింతిపురంబుసొచ్చిన। న్నృగపతిగన్నపద్మి
నులయేపున నెంతయుదత్తరింపుచున్।మగువలుసాలభంజికల మాటున డా
గిరి కొందఱుత్తరిన్॥ సీ॥గమనింపుచూర్రమ్రోయు కటకముల్కాలూడ్చిపలు
చుట్టుబిగియించుమందగమన।యొకమూలడాగి మేద కరకూకల్పనికలఁగిప
య్యెద మేనుఁగప్పవెలఁది।తొట్రిలు భయమునఁ ద్రోవఁగానఁగలేక నిద్వార
పాటుతోనిలుచు నెలఁత।గాళ్లుకుప్పవడంగఁ గదలఁజాలకయుట్టె నిడిముసుం
గిడికయునించుచెలువ।యడదరి కంబంబు మఱుఁగుననొదుగురమణి।డాఁగఁ
బోయి సమతుంబుడాయుతరుణి।స్వీయులంచును బరులనుఁవేడు కలికి। గలి
సియంతఃపురంబు చీకాకుపడియె॥ మ॥అదరుననిల్లుచొచ్చి యమృతాశనుఁ
డొక్కఁడు దల్పుమూలయం। దొడిగినఁదన్నుసిడ్వఁ బదయూరకె వచ్చెద
నంచునాలుగే। న్పదములు వెంటఁబోయికలపంబిదె గొన్పెద నుండుమంచుఁ
దా। సదనముచేరితల్పు గెడసాచె నొకానొక కాంత నేర్పునన్॥ అప్పుడు॥ సీ॥
జిగిమేనితొరలఁ దగుసంపజీరలు గొనకోటితాఁకులకోపుసూప।వడినొడు
గరచు దోవా తెరనంటిన మొనపంటివగఁగంటిమురుపునెరప। బొమ్ముగాయ
ములరక్తమ్ముగాఢాశ్లిష్ట కుచకుంభలగ్న కుంకుమము దెలుప।నతిరోషశోషం
బులగునేత్రకోణము ల్లీలమైనిద్దుర లేమిఁజాటఁ। జానుశికదోఁగుచెమ్మటప్రశ్ర
మనుగాఁగ। వీరశృంగారరసములు వియ్యమంద। విజయలక్ష్మీవధూసంగ
విభ్రమంబు। లభినయింప నిలింపలోకాధివిభుఁడు॥మ॥వలచేవజ్రము బొమ్ము
లోబిగువుగర్వంబుం బ్రమోదంబుమీ। నలలోనవ్వుహొయారముంజెలఁగ
నుత్సాహంబుతోఁబాదమం। జులమంజీరఝుళంఝుళల్వెలయ రక్షోనాథ
శుద్ధాంతకాం। తలనీక్షింపుచు భీతిదక్కి నలు చెంతల్చూ[illegible]చున్ముందటన్॥
మ॥కులుకుందంతపు బొమ్మ చెక్కడపుబల్కంబంపు మేల్బొదెలం।దళపూ
నీలపుజాలదూలములపై దార్కొన్ననున్పంచదం। తెలదాపించిన కె[illegible]
టిట్టికల సందింబొంది రానవ్రజగా। రెలఁగెన్ నొక గట్టిచప్పరములో [illegible]రాచ

శాతిన్నెయ్యెన్॥ శా॥ కాంతల్ క్షేమముఁగోరి సేయు వ్రతసంఘాతంబుచేసం
గమ। త్యంతంబుంగృశమయ్యె చంద్రశకలోదారప్రభస్నీ అఁగాఁ। జెంతన్
దానవదైత్యరాజ తరుణుల్సేవింపఁగా నెంతయుం। జింతన్జెందునిశాచరేశ్వ
రుని రాజీవాక్షి దా దవ్వునన్॥ గీ॥ తనువిలోకించిసింగంబుగనినకరణి। కరణిఁ
దత్తరమందిరి మందిరముసొరఁగ। నెందుఁబోయెదవంచుఁ బూర్ణేందువదన।
వేణిఁబట్టీడ్చెఁగదిసిగీర్వాణవిభుఁడు॥ చ॥ తళుకులుగుల్కు బెళ్కుఁగనుదమ్ముల
నశ్రుమరందబిందువుల్। దొలఁగ మెఱుంగుచన్బొగడదోయి వడంకశిరోజష
ట్పదా। వలిచెదరన్భుజాలతలు వాడ గజోద్ధృత పద్మినీక్రియం। దలఁకెసు
ధారినారి గిరివైరి కరాహతకేశపాశయై॥ గీ॥ దైత్యసామ్రాజ్యలక్ష్మి మచంద
మున నడలు। తరళలోచనఁ దెచ్చిరథంబుమీఁద। నుంచియమరావతికిఁజనఁ
గాంచనాంగి। మూర్ఛఁ జెప్పరి యిట్లని మొఱలు వెట్టెఁ॥ ఈమొదననుజెఱఁ
బట్టుక। పోయెడివిభుఁ డింపులేమిఁ బురుహూతుఁడ। న్యాయము నెన్నక
మునులా। శాయునదను నన్నుఁగావుఁడని మొఱయిడఁగన్॥ ఉ॥ గౌరశరీరకాం
తితరగ జ్జడగుంపు ప్రవాళవల్లరీ। వారమువల్లకీరవ మపారితనాదముగాఁగ
మూర్తమా। క్షీరధివైఖరిస్ఫురదయ సీమసునిష్ఠితనీరజాక్షుఁడో। నారదుఁ
డేగుదెంచి సురనాథునడగ్గఱవచ్చి యుత్తరిన్॥ ఉ॥ ఈనలినాక్షి యెవ్వ
తె సురేశ్వరనారదమీరెఱుంగరే। దానవసార్వభౌము వనితామణి యాతని
సంగరంబులో। నాని జయించి తెసుము సెనాతఁడు ఘోరతపంబుచేతన। జ్ఞా
నివరోత్తరే తపముసల్పివరాలకెఱుంగ వేమియున్॥ మ॥ ఇదిగో రేపె తపః
ప్రభావమున వాణీశాను మెప్పించి మీ। పదముల్ గైకొనసున్నవాఁడు
విబుధప్రత్యర్థి సామాన్యుఁడె। త్రిదశానీశ్వర మీ రెఱుంగక మదోద్రే
కంబుతో నేఁడు ద। త్సతీరత్నము నేలఁదెచ్చి తిటుల నోర్వకింప నెంతేని
యున్॥ సీ॥ కుచులు నున్నఁగదువ్వి కొప్పువెట్టెనెకాని తోరంపు విరిసరు
ల్గురుముఁ గానమి। ఫాలుపొందఁ గుంకుమ బొట్టు వెట్టెనెకాని ముద్దుగాఁ దిల
కంబు దిద్దఁ బోదు। శాటిగా నెమ్మేన పసుపుపూయునెకాని యందమౌకల
పములలదఁ బోదు। పతిసేమము కోరి వ్రతముసేయుచెకాని శృంగారవనిని

తపత్రంబుగాఁ । త్రైలోక్యం బటుతేలుపుగ గృహముపత్త్రాపత్ర తాపం బుతో । భూలోకాధ్వర భాగముల్ గొనుచు నంభోజాతసంప్రీతిగాఁ । జాలాజన్నములాచరించె గుణిత్రైయు శాస్త్రోక్తమార్గంబున౯॥ మ॥ తెలుపు న్మూర్తిపు కొల్వుకూటమున నిగ్గాడింగపుంగన్నైఁ । గొలువైయుండె సు రాసురాదులు కేలుమోడ్చి సేవింపఁగా । బలిదైత్యాధినాయకుఁడు వైభవ మొలర్పంబాహు ప్రగ్రహించె । కలనిక్వాణకరాగ్రకంకణ ఝణత్కారం బుతోరంబుగ౯॥ గీ॥ అప్పుడొక చారుఁడేతెంచి యసురనాథ । నీకుజ యమెట్టు మన్నాపనిఖిల జనులు । గొదవవల జెందు హిమగిరి కూటము నను । గంటినొక్కవి శేషంబు గన్నులార॥ సీ॥ అతిఘోర గిరిగహనపద్య మునవతీరంపుచో మేఘంబులోని క్రొమ్మెఱుఁగు కరణి । చలికాలమున నీ లాశయమున నుండుచో కొలనిలో రాయంచ కొదమవగిది । కడగిపం చాగ్నులనడుచక్కనిలుచుచో లలితమాగడిడగలాకజోక । పుడమిఁ బా దాంగుష్ఠమున నెలకొన్నచో బాదులో లేఁగవాగమిాఁట । చిలుక వలెఁ గోవిలవిధానఫలముప్పర్ణ । ములు మెసఁగుచుఁ గొన్నాళ్లు జలము మొ దలు । గ్రోలకిప్పుడు రత్న పాంచాలిలీల । దపమునలిపెడు సురమాత దైత్యనేత॥ క॥ అని విన్నవించినప్పుడె । వినిచిన్నంబోయె దైత్యవిభుఁడుమ దిరో । జనచేసియొకయుపాయము । గన్నిదైత్యులఁ బంప వారు గాని మ్మనుచు౯॥ గీ॥ పరగ నిరువదియైదేండ్ల ప్రాయములరు । విన్నగన్నులు నైజనవిగ్రహములు । గలుగు వేల్పుల రూపము గాంచిదైత్తి । దుచి తవస్త్రాభరణ శస్త్రనిచయమూని॥ అంత॥ గ॥ ఒడనిధి నీపహీసగణ సం గమెఱుంగవు హేమచేతికిం । బడుచు నొసంగి దుర్విషము భగ్నసకిప్ని తినంచు నవ్విదా । పడుచు నొసంగి భగ్గునకు భాసురకేతిగా పింపగాంచపె రిటం । జడిగొననొప్పు సత్తుహిన శైలముమీదికిఁ బోయిరప్పుడు॥ మ॥ చరణాంగుష్ఠము నేలనూది భుజముల్సారించిభూ గేంద్రఘూ । సరితాగ్నిం టాభంచంబుగుడ ఉన్నొంధిం పిమోమె ల్లియం । గరమున్నాచుచు శ్వా వాయువుల నిర్బంధించి యత్యంత దు। స్సహమైనట్టి తపంబు సేయు నదితిన్

ర్పించి వే ్రముక్కు-చున్॥ శా॥ తల్లీ యేలతపంబు చేసెదునవోద్యానస్థలీ
మల్లికా। వల్లీచైత్రము నీదు గాత్రము వనావాసైకపాత్రంబుగా। నీలీలన్నొ
గిలింపఁ నాయమగునే యేపాటిదీనంఫలం। బిల్లీపాటిని జేరు మోసమగును
మ్మాదానవు ల్బూచినన్॥ చ॥ తనువుగృశింపఁ జేయునదీ ధర్మముగాదని
పెద్దలాడఁగా। వినివినియుండి యేటికి వివేకము లేక దపంబు సేయఁబూ।
నిననిను నేమనంగలము నేరము లెంచఁగరాదుగాని యోజనని యభీష్టమొం
దుటకు సాధ్వీలకుం బతి భక్తిసాలదే॥ గీ॥ ప్రాణవిభుభాసి యతిథిసపర్య
ద్రోసి। బంధువులరోసి పుత్రులపలుచఁజేసి। యట్టిడిగ దీసి యిట్టికార
డవిడాసి। గాసిఁజెందఁగ నిందేమి గలిగె వాసి॥ ఉ॥ అమ్మరో నిన్ను బాసి
క్షణమైనను రిక్తగృహంబునందు మే। నెమ్మెయినుండువారమట యెందఱు
గల్గిన నీవు లేనిచో। హమ్మదియేల బోదు మిపుడాలయ సీమకు రమ్ము మావి
చా। రమ్ముడిగింపు మింపుగను రక్షయొనర్పుము దీర్పుమాపదల్॥ క॥ రో
గిదరిద్రుఁడు పరదే। శాగతుఁడుం దల్లిఁ జూచి యానందించు। న్భోగము
భాగ్యము రాజ్య। శ్రీగలవారలకువేఱ చెప్పఁగవలెనే॥ క॥ అనియన్ని వి
విధంబులఁ దెే। ల్పినవినకయున్న బెదిరింపుచున। ద్దనుజులు భీష
ణరోషం। బున నిజదంష్ట్రికలనగ్గిఁ బుట్టించుటయున్॥ మ॥ అమితంబై
యదివేణు వహ్నిగతిదైత్య శ్రేణితోఁగూడద। గ్ధము చేసెన్నత యోజనో
న్నత మహాకాంతార మంతఃకరమా। రమణప్రేరిత చక్రరక్ష నదితిం బ్రా
పింపగదయ్యెన్విచి। త్రమె నిష్కారణ వైరికార్తిహరి భక్తిక్షేమముల్బ్ఫా
వరా॥ మ॥ హరిభక్తాగ్రణి యున్నచోట హరిభాషాధీశరుద్రాదులుం। దు
రదుష్టగ్రహరోగ వహ్నిభయము ల్దూరంబులౌ లక్ష్మి ను। స్థిరయైని
ల్చు విపద్గణౌఘములఁగు దద్దేశంబు కాశీగయా। ద్యురుపుణ్యస్థలకోటికె
క్కు-డనఁగా నొప్పు జగద్ధేయమై॥ క॥ కానందన నెమ్మదికోల। కా
నందము ౕ॥ విష్ణు హంసముసువివే। కానందమ్మున వలిమల। కానందప
మూనునదితి గనియె శుభంబుల్॥ గీ॥ అదితియూరీతి దివ్య సహస్రవర్ష। ము
లునిరాహారయై ఘోరముగ దపంబు। సేయ రక్షోసురేంద్ర దైతేయదాన।

వాళి భీతిలె సురపాళియులరెనంత। సీ॥ కలికిచిల్కలకొల్కి గబ్బిగుబ్బల
గట్టితనమేటించిన యురఃస్థలము మెఱయఁ। గలికి జక్కవపిట్ట కవగూర్పు
విప్పంగ దరమైన గనుదోయి దయదలిర్ప। నసురలచొవంచి యుసురులు
మెసవంగఁ దూకొను నైదుకైదువులుపొదల। నొరపైన కటితటి నొరకు
వచ్చుపదాఱు వన్నెదుప్పటివింత వన్నెమీఱఁ। గమలగర్భకముఖు లిరు
గడలనడువ। జయజయధ్వానముల యోగిజనముపొగడ। గరుడవాహ
నమెక్కి శృంగారమమర। ననుఁమాతకుశౌరి ప్రత్యక్షమయ్యె॥ ఉ॥
పశ్యలలాటజాటతట పాటలసూచితరాగచంద్రస। ద్వశ్యః తోపగూ
హానపద శ్రితవన్నఖతారుఁడభ్రస। దృశ్య శరీరుఁడచ్యుతుఁడు దస్యుఁ
డుగా ముదమంది గస్య పా। దృశ్యవలగ్న యిట్లనినుతించె నిజోచిత వా
క్యవైఖరిన్॥ ప్రాకృతసీసం॥ లచ్ఛిగణాహేయ లలితహాద్ధపదోయ హా
మ్మళోయనళోయ పూయణిజ్జ। ఖయవరాయాణేయ గయరాయరఖయ
ఖయరఖండసిఖయర రయిణియాస। యాసకజణయమ హేసరభయణి
జ్జ దిక్కమజాహతె క్కణాహ। పున్నమయంకళావణ్ణ స్నమందర
ఖేయద్ధరాధార యకిసవణ్ణ। భత్తకామియఫళదాణ పారియాయ। యా
యయాయజణ ఝయయాయాయరూయ।వాసుఁడే యణయాణంద వణ
యణాహ।ణాహతణిజణయహిహ్న రఖహదేయ॥గీ॥అనుచునప్రాకృత చరిత్ర
మైనయదితి। ప్రాకృతోదితవైదగ్ధిఁ బ్రస్తుతింప। బ్రాకృతగుణ వ్యతీ
తుండు భక్తసులభుఁ। డైనప్రహ్లాదవరదుఁ డాహ్లాదమునను॥ గీ॥ మొల
కనవ్వులచికిలి వెన్నెలలుగాయ। గాయమెంతయుఁ బడలేను గాయటం
చు। నతిపవిత్రకరంబున నదితిమేను। నిమిరి నీవాంఛితంబేమి నెలఁతయ
నిన॥ క॥ స్వామివి జగములకంత। ర్యామివి జనములకుజపిత కర్థమొసంగే।
సామివి భక్తులకంతికి। గామివి నీ వెఱుఁగనట్టి కార్యముగలదే॥ క॥ ఐన
న్వినుపించెదనను। శ్రీనాయకమత్తదైత్య సేనలచేనా। సూనులు వనూ
నులైహరి। సూనుప్రభృతులును దలకఁ జూడంగలనే॥ క॥ దితిసుతుల
సంహరింపక। సతులితమైనట్టివారి వైశ్వర్యమునా। సుతులకొసంగు

ము చాలును। దితిజులు నాసుతులుగారె దీనశరణ్యా॥ గీ॥ అనిన నెంతయు
మెచ్చి మాయమ్మవాదు । నదితియనికౌఁగలించి దైత్యారియనియె ।
సవతిబిడ్డలయందు మత్సరములేని । యుపుడె నీసాటిగలరె యీయఖిలము
నను॥ చ॥ తనసుతులంబరాత్మజులఁ దద్దయుఁ బ్రేమ దగన్సమంబుగాఁ ।
గనుగొనుఁ బుణ్యమూర్తులకుఁ గల్గదునందనశోక మింకనీ। తనయుఁడనై
జనించి బలి దర్పముమాన్చి తదీయలక్ష్మినీ । తనయులకిత్తు నీతి నయధ
ర్మవివేకముగాఁగ నావుఁడున్॥ క॥ ప్రతిరోమకూపభాసుర శతపత్రభ
వాండకోటి సాహస్రుఁడ వీ । వతిలోకచరిత్రుఁడ వే । గతిగర్భమునన్ భ
రింతుఁ గమలదళాక్షా॥ మ॥ అనిన న్నీవనుమాటనిక్క మదితీ దైయునన్ రహ
స్యంబు నీ । కు నెఱింగించెద నాదుభక్తులు విరక్తుల్యోగసక్తుల్సుధీ । జన
రక్తుల్పితృభక్తియుక్తులు పరేశ్వాయుక్తులాచారవ । ర్ధనయుక్తుల్సతు
లుచ్చరింతురు నన్మదక్ష్యంబు సాధ్వీమణీ॥ ఉ॥ నీవుసమస్తభూతహితని
ర్మల చిత్తవు పుణ్యశీలవుం। గావున నన్నుఁబుత్రునిగఁగాంచెద వంచును గం
తమాలికన్ । శ్రీవెలయంగనిచ్చి దయచే నభయంబునొసంగి దేవతా ।
సేవితుఁడై వికుంఠపురిఁజేరె సరోరుహనాభుఁడంతటన్॥ గీ॥ అదితియింటఁ
బయోవ్రత మాచరించి । భర్తృసంగతి సౌఖ్యసంపదలఁబొదల । నెలమ
నలె వేల్ల జిగి గర్భచిహ్నలనెదిర్చ। నెలమసలె నెలలుదొమ్మిది నిండెనంత॥ గీ॥
కంజనేత్రుఁడు శుక్లపక్షంబునందు । శ్రవణమున ద్వాదశీ దివసమున విజయ ।
యనుముహూర్తంబునందు మధ్యాహ్నవేళ । నదితికిజనించె వామనుండగు
చునపుడు॥ గీ॥ కురిసెఁబువ్వులవానలు మెఱసె దిశలు। విరిసెఁ గావిరి దుందు
భుల్మ్రోసె దివిని। దొరఁగె గంధర్వగానమచ్చరలయాట। నెరసె జగమునఁ
వేడుకల్మ్రోసెనంత॥ మ॥ మణికోటీరమునక్రకుండలములున్మాణిక్య [illegible]
యూరకం। కణకాంచీకటిసూత్రహేమవసనగ్రైవేయమంజీరము । ల్భోఁ
భోగాభ చతుర్భుజంబులు దగన్భాసిల్లులోకైకర। క్షణునిన్వామనుఁజూ
కస్యపతపస్యాశాలి హృష్టాత్ముఁడై॥ క॥ పటుభక్తిమ్రొక్కియంజలి
ఘటియించి నుతించె వికచకైరవవేళా । నటధూర్జటి చరణకటా । త్కట

ఫణీంద్రానుకార గంభీరోక్తికిన్॥ మ॥ రవికోటిప్రతికోటి తేజము శరద్రాకేందుబింబాస్యమున్। ధవళాంభోరుహలోచనంబులు సుధాదధ్యన్నహస్తాబ్జమున్నవలావణ్యవిశేషముం గల నినుం దర్శింతు ధన్యుండనై । శివముల్గంటి దయా విధాంఘ్రియుగళీ సేవామనావామనా॥ క॥ అనిపొగడ నీవు మెలగు । జనకా మీరందు రెండు జన్మంబుల నేఁ । దనయుండనైతిని మీఁదం। దనయుండనై మీకు వాంఛితం బొనగూర్తున్॥ గీ॥ అనుచుఁ దనరూపు మాటి యవ్వనజనాభుఁ । డర్భకునిలీలఁ గావు కావనుచు బోర । నెన్ని నేర్చితినన్నఁ గన్నచిన్నితండ్రి। యనుచు ముద్దాడుచును దల్లి యక్కఁ జేర్చె॥ మ॥ అలరున్నానెదలంటు గంధము నలుంగందంబు పన్నీటిచే । జలకంబున్నను బొజ్జపాత్రులును రక్షారక్షయుయ్యాలపా। టలుచక్ద్రావుడు లెంతనంతనముఖ్ఖుట్టుంజేసె సృష్టిస్థితి । ప్రళయాపాదికి దైత్యభేదికదితీ భాగ్యంబు దానెట్టిదో॥ క॥ ముజ్జగములుజ్జగింపని । బొజ్జగడల పాదపద్మములజిగి జాళ్వా। గజ్జలు మొరయఁగ పజ్జల। హజ్జలిడుంగుజ్జ తల్లి యానందింపన్॥ క॥ విద్దెము విద్దెమటంచు । న్నద్దియలిరుగేలనూన ముద్దులకొడుకు । న్విద్దెములు సేయు తళుకుం। గద్దరి చెక్కులను మద్దికాయలుగదులన్॥ క॥ ఈసనయనము గల వేలుపు । తపసులు విధిముఖులు రాఁగఁ దనయునకున్ దా । నుపనయనము సేయఁగగ। నృపముని సమకట్టె సకల సంభ్రమమలరన్॥ మ॥ అలరుం దావులు ధూపవాసనలు దూర్వారావముల్పెంద్లిపా। మాణిక్యపు తోరణంబులును గాటంబైన యాపెండ్లిపం । దిలిలో మానులు సుట్టుకొన్నమణివేదిన్ హేమపీఠంబుపై। నలరారెం బిత్రుమధ్యభాగమున మాయావామనుండయ్యెడన్॥ సీ॥ తపనుఁడు సావిత్రి నుపదేశమొనరించె బ్రహ్మసూత్రము బ్రహస్పతి ఘటించె । *జనకుఁడు పచ్చనున్ననిమ్ముంజిమొలఁగట్టె నవనియొసంగెఁ గృష్ణాజినంబు। శంబరధారి దండంబు కేల నమర్పఁ బ్రేమతోఁ దల్లి గాపీనమొసఁగ । పాథోదపదమాతపత్రంబు నవరించె నలినగర్భుఁడు గమండలువు గూర్ప । సప్తఋషులు పవిత్రముల్ శారదాంబ । యక్షమాలిక యియ్యఁ జెల్వొప్పె మిగులఁ। బ్రణతరక్షా

*విచారి సద్భక్తహృదయ । పద్మసంచారి వామన బ్రహ్మచారి॥ శా॥ అక్షీణంబగునట్టికల్మిగల మాయావామనుం డంతటన్ । యజ్ఞేశార్పిత పాత్రగైకొని కులాఖ్యల్సెప్పచున్ మ్రొక్కి-తా । భిక్షాందేహి యటంచు వేదగిరిజాబింబోష్ఠి వెట్టెన్నతే । భిక్షుంబంచల వీక్షణాంచలములం బెంపారు శ్రీనప్పుడున్॥ గీ॥ అంతగ్రమమునశారద యదితిసప్త । ఋషిపురంధ్రులు శచియుదిగీశసతులు । వెట్టుబంగారుభిక్షుంబు బియ్యమద్రి । పగిదిమించె బృహస్పతిభట్లచెంత॥ క ॥ తాలిమిమీఱంగ నెప్పటి । మాలిమితో దేవగురుఁడు మంత్రము దెలుప । న్వేలిమిసేసె మృగాంకుని । మేలిమిగను రక్షయిడె సుమేధుఁడునుదుటన్॥ క॥రతిపతియహితుని సతి భా। రతిజతయై కంకణము లొరయముత్తైపుడా । రతియెత్తిరి వామనునకు । రతిబోఁడులపాటతేట రాలరగంగన్॥ మ॥ పరమేశానపయోజసంభవులు దిక్పాలుల్ప్రియంబొప్పఁగాఁ । బరమాహ్లాదము మీఱ నొండొరులు పైపైనిచ్చుపట్టాంశుకా । భరణశ్రేణులు కేలగైకొని సభాభాగంబునన్నిల్చు సు । స్వరుఁడై దేవగురుండు వీఁడుచదివె న్సర్వాగమ స్ఫూర్తులన్॥ వ॥ ఇవ్విధంబునఁ గస్యపబ్రహ్మ సకలబ్రహ్మర్షిసమేతుండై తనూజాతు నుపనీతుంగావించి దిగంతరాగతశిష్టజన వ్రాతంబుల నభీష్టమృష్టాన్నంబుల దక్షిణ తాంబూలంబుల సంతుష్టులంజేయుచు మహోత్సవ దినచతుష్టయంబు గడపెనంత॥ చ॥బలి జగదేకదాతయని పల్కుఱుభూమి సుధాశనోత్తము। ల్పలుకముదంబుతోవిని సుపర్వమనోరథ సాధనోద్యమం। బలర మృపావటుండు బలి యాచన సేయుటకై నివేశము । న్వెలువడెనింక నెవ్వరొరు వేదనివారలు వేళవచ్చినన్॥ గీ॥ కురిసెబువ్వులవానలు మెఱసెదిశలు । విరిసెగావిరిదుందు భుల్మోరసెదివిని । దొరసెగంధర్వ గాన మచ్చరలయాట। మెఱసెజగములువేడుక బొరసెనపుడు॥ సీ॥ ఒకవింతహరువైన యూర్ధ్వపుండ్రంబుపైఁ బెట్టినమేధావిబొట్టుదనర । నీలంపురానిగన్నిగలీను సిగగంటు నవరత్నఖచితకుండలములమర । నవమైన కృష్ణాజినముతున్కమేల్మిగ్రొన్న ధవళయజ్ఞోపవీతంబు మెఱయ। ముప్పేటబెనగొన్న ముంజపచ్చ

నిగోచి వెలిపట్టుపంచయు మొలదనర్చ । మణిపవిత్రము దండకమండలు
వులు। గొడుగు పావాలు పాత్రిక బెడఁగుమీఱ । పసపుబూసిన జెంకాయ
పాణిబూని । వామనుఁడువచ్చె బలి యజ్ఞవాటమునకు॥ క॥ కపటవటు
దివ్యతేజఃప్రకాశసంబు । గాంచియప్పుడు విజ్ఞాన ఘనులుమునులు। లేచి
కరములు ముకుళింపఁ జూచి శుక్రుఁ । డసురవలభుతోడ నేకాంతమ నను॥
మ॥ అదిగో చూచితె బ్రహ్మచారివలె దైత్యారాతియే తెంచెన । త్రిద
శాధ్యక్షున కెల్లసంపదలు నెంతే ప్రేమతో నియ్యఁగా । నదితీగర్భమునం
జనించె నితఁడే మర్థించ నీవియ్యఁగా । మదిలో నెంచకు మియ్య నెంచినను
సామ్రాజ్యంబు లేదింకిటన్॥ గీ॥ ఆత్మబుద్ధిసుఖం బిచ్చునంతకన్న । గురువు
సెప్పినసద్బుద్ధి పరులబుద్ధి । కొదవదెచ్చును స్త్రీబుద్ధి కులముఁజెఱచుఁ ।
గాన నాబుద్ధివిని సిరుల్గనుమునీవు॥ మ॥అనినన్ ధర్మ విరోధమిట్లనుటగాదా
చార్య వేదార్థవి । జ్జనులే దేవునకుం బ్రియంబుగ నొనర్పంజూతు రశ్రాం
తమున్ । ఘనయాగంబుల నట్టిదేవుఁ డిట సాక్షాత్కారమైనిల్చి వే। డినఁ
బ్రాణంబులునిత్తుఁ బ్రాణములకంటెన్ హెచ్చుత్రైలోక్యమున్॥ క॥ అఘ
టనఘటనాసామ । ర్థ్యఘనుండీశ్వరుఁ డతండు దలచినకార్యం । బు ఘటిం
పకున్నెయీలో। నఘహారమగు గీర్తిగాంచుటర్హ మునుమీ॥ గీ॥ శిబి ద
ధీచి విరోచను ల్చిత్రముగను । యాచకులకిచ్చి రట యంగమట్టికీర్తి ।
యెఱుఁగలేనట్టి నా దానమేమియనుచుఁ। గుందుచుండుదునదీ దొరకొనదె
నేఁడు॥ వ॥ అనిపలుకుచున్న సమయంబున॥ సీ॥ వివిధదేశాయాత విద్వ
న్నిధఃకృతా లఘుశాస్త్రవాదకోలాహలంబు। సవన తత్తత్క్రియా శంక్య
ప్రద్రష్టు సాధూత్తరార్పణదక్ష హోతృకంబు । మహిపవచస్సత్య మహి
మజ్వాల త్ప్రవర్గ్యక్షీర శిఖిశిఖాక్రాంత నభము । ధూమగంధల వపా
హోమవేళా సర్వజన క్లిప్త కరతాళ సంకులంబు । ఖదిరబిల్వాదియూప
యుక్తంబురక్ష । పశుపక్షీంద్రచయాన విభ్రాజితంబు । నగుచు మించు
బలీంద్రుని యశ్వమేధ। యాగశాలకువచ్చె మాయావటుండు॥ శ్లో॥ దదా
తులక్ష్మీం తవలోకనాథో । వశంగతేంద్రస్య జగద్ధితస్య ।, సంప్రాప్తభూ

యస్సుత లాభతాంచ। భవాన్వదాన్యోసిం బలేసురాణాం॥ క॥ అనియు
భయార్థంబులదీ। వసతోఁ డెంకాయయొసఁగ వామనుచేఁ గై। కొని బలి
వటుని వరాసన। మునునిడి తగనర్ఘ్యముఖ్య పూజలొనర్చెన్॥ క॥ ఒన
రించిధన్యమయ్యెం। జననము పుణ్యుండనైతి సఫలమొదవెన్। నినునే
వించితిగావున। ననఘా నీవాంఛదెల్పు మదిచేకూర్తున్॥ వ॥ అనిన దం
భ డింభకుఁడిట్లనియె॥ సీ॥ చక్రపాణి జయించి సకలలోకము లేలె ఘన
శక్తిని హిరణ్యకశిపుఁడాది। గణనీయసకలసద్గుణరత్నరాశియై యలరా
రెఁ బ్రహ్లాదుఁడందు వెనుక। ద్విజవేషములదన్ను వేఁడువేలుపులకుఁ దను
నొసంగెను విరోచనుఁడు మున్న। గరుడవాహనుప్రీతిగా శతక్రతువులు
చేసినాఁడవు సర్వతేజివగుచు। ననుచువామనుఁడెంచియో దనుజనాథ।
తపముసేయుటకైఁ బదత్రయధరిత్రి। నడుగవచ్చితి యోగ్యుఁడ నంతమా
త్ర। మిచ్చియంపింపుమనిన బలీంద్రుఁడనియె॥ మ॥ అనఘా కల్ప మహీ
రుహోత్తమముఁ డాయంబోయి కారాకులెం। డినజాడన్నను నేమివేడి
తివికంటే నాదు సామ్రాజ్యముల్। ధనము ల్ధాన్యములుం దుకూలములు
రత్నంబుల్ యథేష్టంబుగా। నొనగూర్తున్గొను నన్ను వేఁడు జనుఁడన్యున్వేఁ
డఁగాఁ జెల్లునే॥ వ॥ అనినఁ జతుర వచనరచనాపటుండగు కుహనావటుండి
ట్లనియె॥ చ॥ అడిగినవారిఁజూచి నభయంపడి వెల్వెలఁబారుమోముతోఁ।
జడియక నాదరింపుచుఁ బ్రసన్నుఁడవై యభిలాషమేమియం।చడుగుచుముం
దుగానడిగినందుల కెచ్చుగనిత్తునంటివి। యెడ నినుఁబోలుదాతగలఁడే త్రిజ
గంబుల నెంచిచూడఁగన్॥ మ॥ అమరారీశ్వర బ్రహ్మచారులకు రాజ్యంబేలఁ
గాంక్షించుమా। త్రముభూమిందయ సేయుమేఁ దప మొనర్పంబోయెదన్స్వ
ల్పదా। నము చేనేమిఫలం బటంచనకు నానాదానముల్పాదమా। త్రమహీ
దానముఁబోలదందురు సుమిత్రార్థంబులింకేటికిన్॥ ను॥ అవనీదాన మహత్త్వ
ముం దెలియలే రంభోజగర్భాదులు। న్వివరింప న్వినుపత్కుటుంబినికిఁ బృథ్వీ
దానముంజేసిన। న్భవపాశంబుల బాసిమోక్షపదవిన్బ్రాపించు హత్యాది
పా। పవిముక్తుండయి యెట్టి మూర్ఖుఁడును చిత్ప్రావీణ్యమేపారఁగన్॥

గీ॥ విప్రవరునకుఁ గూర్మెఁ దు విత్తనముల । నేలయొసగిన ఫలము వర్ణింతు వి
నుము । లోకపావని యగు గంగ లోనఁ ద్రిదిన । మజ్జనము సేయు ఫలమగు
మనుజులకును॥ క॥ చెలఁగుచు నిర్ధనుఁడు విత్తన । ములనేల కుటుంబి కొసఁగు
పుణ్యాత్మునకు । న్గలుగు శతహయమేధం । బులు గంగా తటిని జేయు పూ
ర్ణఫలంబుల్॥ ఉ॥ పృథ్విని విత్తనంబులకు భూమి వసిష్ఠున కియ్యఁ జాలు
వా । పట్టపుదాతకుం గలుగు పంకజనాభు పదాంబుజంబునం । బుట్టిన యేటి
చెంత పరిపూర్ణముగా హయమేధ మాదిగా । నట్టి మఖంబులు న్శతసహ
స్రములు ఘటియింపఁ బుణ్యముల్॥ క॥ కలదొక యితిహాసం బం । దులకు
న్వినుపింతు వినుము దురితము దొలఁగు । న్గలుగును భూదాన ఫలం । బలఘు
తరంబగు ముద్రిభువ నైకవదాన్యా॥ సీ॥ మును బ్రహ్మకల్పంబునను భద్రమ
తియను విప్రోత్తముఁ డొకండు వేదశాస్త్ర । నిపుణుఁడు గలఁ డాతనికి భార్య
లార్వురు నందను లిన్నూటనలువది గురు । గలర తఁడత్యంత కష్టదారిద్ర్యుఁడై
కుడువఁ గూడును గట్టఁ గోకలేక । వగనొంది వేసరి సనుమతి దానంబు గా
వింప కీలేమి పోవదనుచు । గోరి కౌశాంబిలోనను ఘోషువలనఁ । పంచహస్త
వనిఁ బ్రతిగ్రహించి విష్ణు । భక్తున కొసంగి సకల సంపదలఁ బొదలె । వెనుక
మోక్షంబుగనె నింటి వేబలీంద్రా॥ గీ॥ కానభూదాన మొనరించు కంటె నధిక ।
మైన దానంబు లేదు నేనడుగ నట్టి । పుడమి మూఁడడుగు లొసంగి భువన మహిత ।
యశము బుణ్యంబుఁ గైకొను మన్న నలరి॥ శా॥ హేమాత్మాధరను స్థిరుండు
బలి దైత్యేంద్రుండు వింధ్యావళీ । వామారత్నము రత్నకుంభ జలము ల్వంప
న్నృపా వామన । శ్రీమత్పాదయుగాభిషేచన మొనర్చె న్బ్రహ్మరుద్రాదు
లో । హా మేముం గనలేని కీర్తిఁ గనె దైత్యుం డంచు గీర్తింపఁగన్॥ క॥ శ్రవ్యా
ద విభుఁడు వామన । దివ్యశ్రీపాదపద్మ తీర్థంబు శిర । స్సేవ్యము గావిం
చి బుధ । స్తవ్య మతిని ధారబోయు సమయమునందున్॥ గీ॥ వామనుఁడు దద
ర్భృంగిండిలో వారిధార । కడ్డమైయున్న శుక్రుని యక్షిఁ బొడువ । మిట్టిపడి క
న్నుపోయిన లోఁగఁబోయె । ననుచు నడుగుచు చేసాచి యడుగుటయును॥
క॥ క్షమ మూఁడడుగులు బలియు । తమ భక్తి నొసఁగె నతఁ బూలంగొ భవ్య

మహాంసంప్రదదేదం । నమమ యనుచు ధారవోసె నలినాక్షునకుఁ॥
మ॥ పెరిగెన్వామనుఁడంత దంతిపొడవై పృథ్వీధరంబంతయై। శరదంభో
రుహమిత్రశీతకర నక్షత్రగ్రహస్వర్మహాః స్ఫురితుండై జనలోక మవ్వలి జ
గంబు న్సత్యమున్మించుచున్।హరిసత్యంబులు నిండి మెండుకొనె నత్యాశ్చ
ర్యమేపారఁగన్॥ సీ॥ పద్మరాగప్రభా భాసమానకిరీట మరవిందజాండక
ర్పరమునొరయ । శతయోజనాయత శతపత్రపత్రజైత్రమ్ములైన విపుల
నేత్రములు మెఱయ। పరిపూర్ణ చంద్రబింబ సహస్రవిస్మృతంబగు మోము
మందహాసంబు దొరయ। తతదిగంతవ్యాప్త తతబాహువులు శంఖ చక్రా
దివివిధశస్త్రములు నెరయ। కనదొనలు నక్రకుండల కౌస్తుభములు। వైజ
యంతియు లక్ష్మి శ్రీవత్స కాంచ । నాంబరమునొప్ప బ్రహ్మాండమనెడు భ
రణి । కస్తురియుబోలెదగె త్రివిక్రమవిభుఁడు॥ మ॥ హరి యీరీతి త్రివి
క్రమాకృతిని బ్రహ్మాండంబునన్ నిండియా। వరణాంగంబుల సర్వలోకము
లుమించన్ బ్రహ్మరుద్రాది ని। ర్జరులగ్గింపగ నందముఖ్య సుభటవ్రా
తంబు సేవింప దు। ర్భర తేజంబున రాజిలన్ బలికృతార్థంమన్యుఁడయ్యెన్
మదిన్॥ అంత॥ శా॥ వినుఁడో హో జనులార విష్ణుఁడొకఁడే విశ్వాధికుండా
ద్యుఁడున్।కనుగొన్నారె కదా మహామహిమ మింకన్ భక్తితోఁ గొల్వుఁడీ।
యనుచుం జాటుచు జాంబవంతుఁడు సముద్యద్భేరి మ్రోయించుచున్। వినరా
దిర్వది యొక్క మార్వల గొనెన్ విష్ణున్ విరాడ్విగ్రహున్॥ మ॥ అరవిం
దాయతనేత్రుఁ డంతట నతుల్యంబైన త్రైవిక్రమ। స్ఫురణన్ మించ పదాం
బుజంబొకటిచే క్షోణిస్థలిం గొల్చి యం। బరమార్గంబున నొక్కయంఘ్రి
నిడ తత్పాదాంబుజాంగుష్ఠశే। ఖరదివ్య న్నఖరంబు సోఁకి పగిలెన్ కంజా
తజాండంబొగిన్॥ గంగావతరణవచనము॥ ఈక్రమంబున త్రివిక్రమ ప్రసారి
తవామచరణాంగుష్ఠ నిష్ఠురనఖర శిఖావిఘటిత బ్రహ్మాండ కరండోపరిజని
తరంధ్రనీరంధ్ర నిరర్గళమధుర శిశిర పాండుర లఘుతర ప్రభావాభరణబ
హిరావరణ వారిపూర్ణంబు యోగిమనసికమల సంతత సంభరణంబును
లక్ష్మీకుచ శాతకుంభ పూర్ణకుంభ సంభావిత నవపల్లవాచరణంబును

నగుహరిచరణంబునం దొరఁగి రథాంగధరపదప్రక్షాళనంబున నత్యం తతర ప్రభావంబును లోకైక పావనంబును బ్రహ్మహత్యాది పావనోదకంబు నగుచు నప్పావనోదకంబు కంబుధరచరణాంబుజ మకరందంబు చందంబున నంబుధరవర్ణపదనఖ సాంద్రతర చంద్రికలయందంబున దనుజారిపదంబు దిగజారి గగనాంతరమాన సూనమాలికల పోలికఁ గలయు త్రికలకంఠ కంఠకా కంఠమాలికలనీల నాళీకాళివారిజాల జాలంబుల బహుధారారూపంబులై సత్యతపోజనమహస్స్వర్లోకంబులఁ బ్రహ్మ బ్రహ్మర్షి సనకాదియోగీంద్ర నైష్ఠికధుర్యసంఘంబులు ప్రస్తుతింప నిరానందనస్ఫుత స్నాతాంతగృహీత కమండలూ పరిపూరితంబులై గానమానగంధర్వ గజరాజ గామినీగాన శ్రవణస్మేరాంగనగర చంద్రశాలికా కాంతిచంద్రకాంత నిరంతరప్రవజ్జలధారానుగతంబును పరిసరహరిహయనగరవర మరకతమణిమయ భవనను రుచిర రుచిరచిత శైవాలవలికావల్లికంబును సలనిశాటవాటన పటు పుటభేదన నాటకశాలికా నటనటనస్పారి కుటిలాలకాపటపుట కరత్కటక మురజ వాదిత్ర నాదాచ్ఛాదిత వలభి పతనఫేణా ఘుళఘుళారావసంకులంబును నందనవనపాదపవిటపసంసక్త నిజసలిల కణ ద్విగుణిత కుసుమ జాలకంబును విస్మయాకుల ప్రేక్షమాణ గీర్వాణముగ్ధజలజేక్షణా వీక్షణస్నిగ్ధ సోసూచ్యమానవలమాన విమాన వితానంబును నిర్మలభర్మనిర్మిత వర్మ హర్మ్యప్రాంగణ మాణిక్య వితర్దికాశయానానాయక ప్రార్థ్యమాన పురుషాయిత కళికానుకూల లజ్జాకుల సభ్రూభంగవిలాస విలోకనోత్క్షిప్యమాన మానవతీ వేణికాపృష్ఠాకర్షణ విశ్లథతరళితః పతిత సహాగతమౌక్తిక సూచక తత్తత్పురహూతకలధౌత శృంగారసౌధ శృంగాహతోత్పతిత జలబిందు సందోహ కందళితమందార కుసుమకోరకాలంకృత నికటతట కంచుక కేళికానందబృందారక సుందరీ చికురభారంబును సురచకోర లోచనారతిశ్రమహరణ నిస్తులతరమందానిల సందానితశైత్యంబును చారణస్తూయమానంబును కిన్నర గేయమానంబును నిజావలోకనసమా ప్రసంచితసుకృత [illegible] ప్రార్థ్యమా

నంబును నమరావతీ పురవర పరిఖాయమానంబును జల కేళికాలోల దివిజకులపాలికాపాళికా కుచపాళీ కాశ్మీరపాళికామనియ్యక తదీయ సౌర భ్య ఘుమఘుమాయ మానంబును శంఖబుద్బుద వజ్రమౌక్తిక కుముద ఫేన ఖణ్డకరకాయిత తారకావారకంబును నిజనైర్మల్య నిర్మృష్టనిష్క- ళంక మృగాంకమణ్డల గళత్సుధారస ధారాసధారా సంవర్ధమా నంబును గఙ్గోపరిభాగీరథీతపనవిస్మితా నూరుసారథి స్తవనియంబును ప్రణయ కలహ దూరస్థిత నిజనీరధారాసిక్త మృదులాంగ సంసక్తదుకూల చేలాం తరపరిదృశ్యమాన కుచలి కుచనితంబ బింబరంభోరువిజృంభ మాణావలో కనోత్సుక నాయక దత్తనూతన వసనయాచమాన వైమానికమానినీ జనజనితసీత్కార మానితంబును నవర్ష వర్షప్రవర్షనిదర్శకవలాహక పద మోముచ్య మానంబును ననమయ సమయన్నిజజలబిందు తుందిలచా తకవ్రాతంబునగుచుం దేరగంటి దారకు వెరచి తనతనయువరుణుని యిం టడాఁచి వెలవెలనగుచు మంచుమల నేమంచు గట్టులకుఁబట్టంబు గట్టెన ని నలుజడ్డిగంబుల బిడ్డనొడ్డారించి బొడ్డుతామర దొడ్డవేల్పు పుడమిచ్చాల్పు లకు నేలికపుగమ్మని కమ్మని కుందనంపుజిగిని దన తేజంబు మెఱయించు జేజే లవిడివట్టున కభిషేకంబుచేసిన తెఱంగున పసిఁడికొండ తుదను బదివేల యోజనంబుల పరపున నున్న యన్నలువ పట్టణంబునఁబోరునందొట్టి పట్టు సాలక నలువ నలుమోమునందు వెడలునలుతొలి పల్కులనలువున నలువా కిళ్లనఃబదెఱంగులై వసౌకసారాది దిక్పాలకపురంబులొరసికొని వెలువడి తినవడిబెండువడిబెడబెడమని దొల్లిపడు పెదపెదగుండ్లచప్పుడులకులుకుచ ప్పుడు లేడనేడపర్వలిడుజంట నలుహజ్జలమొకంబుల నెఱుఁగకతోడంబరచు తెరవోరిమొకంబులఁగాన వెనుతవులు గౌరుతోడ నరుగు మువ్వన్నె మొకం బుల నంటిపాఱు నొంటికాండ్రనందునంబడు దున్నల పిఱుందంజను నెలుగు లబలగంబునకు చంగుచంగునం దాఁటు కన్నెలేళ్లకందంద నడ్డంబగుచుఁగో నలఁగోనజిగురువిని కేళ్లం జేలుచు నదరుపాటునంజూచి యదరిపడిలేచి తమ తమక్రొత్తిచ్చు నియమ చెఱుఁగుల చెంగావుల గటీతటంబుల నొకకొంగున

చ్చినమునుగోటి తాఁకలంజిలుప చిలువ నెత్తురులుగ్రమ్ము గుత్తంపువలిగుబ్బ
చన్నుల నొక కొంగునవరించి యుగజాఱు క్రొవ్వెదలు పువ్వులవాన గురి
యఁగానుజడియ బెళుచూపుల బెగడు కోడెజేడెసలబిత్తరంపుయూర్పుల
మృగనాభిపరిమళంబులు గుప్పళింపుచు బలితంబులై మెలఁగు గిలుకు మట్టె
యల రొదలతో గడలకుంజని మును తాము కడలనిడిన తొడవులం
దా లోఁగొని నర్పితంబులు సేయు నెయ్యంపు కర్పూరగంధులనేర్పులకు నగు
చుతచ్చనలాడు బృందారక కుమారుల మందహాసరుచి కందళంబులతో
నందడింపుచు ప్రస్రవణఝర్ఝర నిర్ఝరంబులం ప్రవృద్ధంబగుచు గిరీశా
లింగనసంగత కుంకుమపంకంబున బొంకంబగు నకలంక ధాతురాగంబుల
జాలువాఱుచుం గమలకల్హార కైరవ కువలయకోకనదాది కుసుమ సౌరభ
లోభ చంచల చంచరీకచక్రాంగ చక్రవాకఝంకార క్రేంకార చంకనత్స
రోవరంబుల గళింద కన్యకా సరస్వత్యాదినదుల నెచ్చెలులం బోలె గల్పు
కొనుచు వాహంబు తెఱంగునం దుముకుచు వజ్రశైత్యంబునం గొండలం
డెగబాఱుచు మతంగజంబు భంగిఁ గర్పూరకదళికా కాంతారంబుల భం
గింపుచు భూవల్లభులేవం బ్రతికూలతరుల నిర్మూలింపుచు పతిత తరు శాఖ
లనున్నతంబు జుట్టుకొను ప్రవాహాగతసర్పంబుల కుత్తుకలు రెండుచేతులం
గట్టిగాబట్టికొని బిట్టులిక్కి చూడంజాలక మార్గోగంబులుబెట్టు శాఖామృ
గంబులంగని కిలాకిలనగుచు మార్గగండోపలంబులపై వసియించు చెం
చుమించుబోఁడుల వెనకమగ్గుగావచ్చి యదరుపాటున భుజంబులువట్టిత్రో
యు తెఱంగున వెంపించు చెంచునాయకుల నదలింపుచు గడువడినదరు బెడ
బెడలకుబడిసి కడలకునిగుడ నక్రోండగుండులంబడ దివియుచుదను గనుం
గొనవినిన నంటిన సీకరములు సోఁకిన పై తెమ్మెరలు దొరసినమాత్రంబు
భూతప్రేతపిశాచ శాకినీఢాకినీ బేతాళకూశ్మాండాది గ్రహంబులు దమతమ
విగ్రహంబులుమాని మానితవైమానిక రూపంబులుపూని ధగద్ధగితమణి
గణస్థగిత కిరీట కటక కేయూరహారాది సురుచిరాకల్పంబులు కల్పప్రసవ
దామంబులు కనకాంబరంబులు దివ్యచందనానులేపనంబులుం రతిమనోహ

మనోహర మనోహరాకారంబులుం గలిగి దివ్యతర తేజంబులు నిగుడ దెగ
బారెడు కీల్జడలుం దొగరేని నగుమొగంబులు బెగడు బెడిసలం బోలు
వాలుగన్నులు నిగనిగని జిగిమోవి మానికంబులు మగరాలనేలు పలువరు
స బిగి గుబ్బచన్నులు మృగరాజమధ్యంబులు చిగురుటడుగులుం గలిగి చిలుక
తేజివజీరుని చిలుకుటమ్ములు ముద్దుజిల్కు తెరగంటి చిల్కలకొలుకులు
పెనవేలుగొల్వ భాసమాన రవికరావమానకరణ దురభిమాన మణిమయ
విమానారూఢులై యచ్చరమచ్చకంటు లిరుకెలంకుల నకలంకరత్నకంకణ
క్రేంకారమ్ములొలయ వింజామరములు వైవ రంజిల్లుచు నంజలిబంధముల
తో నుతులు సేయుచుం గొంతదవ్వు వెంబడి నిగుడి దివంబునకరుగ నట్టి
క్రమంబుననే నిజసలిలాకృష్టధరాతలపురాజనసాంతర స్పృష్టశరీరనరకని
విష్టదుష్టజనంబులు యమానుల కాశ్చర్యకరులగుచుం బుణ్యలోకంబుల
కేగ సకలపుణ్యనదీనదంబుల దురితాపహ కీర్తిమూర్తి భవించి తన్నుం జే
రు తెఱంగున రంగగుచు జక్రాంగంబులు ప్రవాలనినుం గనుంగొను జనుల
యందు వసియింప కుండం జేసితి వింక మాకు గతియెయ్యదియని తత్త్వజ్ఞుల
పాపంబులు రూపంబులు గైకొని తాపంబున మొరలువెట్టునట్టి తెఱంగున
రోలంబజాలంబులు ఝుంకారంబులు సేయ తరంగ తరంగ మృదంగరం
గధ్వానంబులకుం జెలంగుచు బెళుకుబిత్తరికొండె బెడిసలు మత్స్యపుటం
బులు వైవం బ్రవాహవేగంబునం బొందువడి తోడనడరు పెద్దపెద్దకొండల
గండూపలంబుల మొందున నిండుకొనియుండు మకర నక్ర గ్రాహకర్కట
కాది జలజంతు సంతానంబులు వెలయుం దీరంబుల నిల్చి పుణ్యపురంధ్రీజ
నంబు లెత్తుముత్తైపుహారతుల తెఱంగునం జెంగల్వలవలగొను సుడులుం
బెడంగు సూప సంపన్నులగు జనులు భక్తిపూర్వకంబుగా నొసంగు పట్టాం
శుక మణిభూషణంబులన లోపల వెలికినడరు మౌక్తికంబుల నిగ్గుల బుగ్గ
లగ్గలముగ దత్తత్పౌరజన సమర్పిత రథదీపంబులకు వెలుంగు లొసంగు
ప్రవాహాగత భుజంగపుంగవ ఫణారమణీయమణిగణ ప్రభలొసంగ
సమలాంఛన కాంత కమలాకాంతాభిషేకంబునకుం బతె జలవేదండ షండం

బులు దుందుంబులై త్తె సహస్రప్రదేశంబుల నాశుకవితర్దీతి నతిత్వరయుగ్మంబుం బ్రతిహతస్థలంబుల నభిమానిజనయాచన చందంబున మందంబగు కీలనచిత్తులకుం దొలంగి చను సజ్జనుని తెఱంగున గగనంబునకుం దొట్టు గట్టుల గెడగల్గుచు దూష్పన శీతాభిదానంబున నభిరామలీల మొరయు మేరుకీమల కేసర కేసరాచల గంధమాధనవసుంధరాచల భద్రాశ్వవర్ష మార్గంబున పశ్చిమంబున చక్షువను పేర లోలమాన మీన కటాక్షంబుల సుపర్వాశ్చర్యకర మాల్యవన్మాల్యవద్భూధర కేతుమాల వర్షంబుల సరణిని యుత్తరంబున భద్రాఖ్యను స్మరణశీల భద్రప్రదయగుచు నభ్రంకషశృంగశృంగవత్పర్వతోత్తర కురుదేశపదంబున దక్షిణంబున నలకనంద నామధేయంబున పదనారవింద నందద్విశ్వంద్వాలకయై గగన సంచరనిక కమలాయమాన హేమకూట హేమకూటభూధర భారతవర్షపదవిం బ్రవహించి దిక్కూలముద్రజనముద్రవాతూలలోలకల్లోల కోలాహలంబవార్యతూర్యఘోషంబులై మొరయ నార్వాగ్నిసాక్షియై వెలుగం బ్రతిరవణ ద్విజకలకలంబు మంత్రకులంబులై మించ గలకంఠికాగానంబులు పెండ్లిపాటల నీటుసూప విష్ణుధారాదత్తయగు గంగానదియు దరంగిణీరమణుండును వెలయను తెరకిరుగడలనిలిచి బుద్బుదపులకాంకుగములు గువలయనయనవికాసంబు గుమ్ముదప్రభామందహాసంబునుం జెలువొంద నొండొరులునుం దరంగహస్తంబుల శీకరమౌక్తికంబులం దలబ్రాలువోయుచు నన్యోన్యమీనవీక్షణంబులుం దారసిల గలసి జలనికరవీచికాన్వితమౌక్తికవిద్రుమాదిమణిమణ్డిత శైవాలవల్లికాకాసమణి రమణీయ మంగళసూత్రాలంకృతకంబుకందరయగుచు బవమాన విప్రకులంబు భృంగాశీర్నినాదంబులతో పెళ్లా వనకుసుమ కేసరాక్షతంబులు వధూవరులపైఁజల్ల కరకమల భ్రమరమాలికా కౌతుకబంధుండును ఫేన దుకూలచేలుండును బహుళతరంగోర్మికా బంధుసను తదీవనేరుచ్యమాన రుచ్యావమానరుచ్యకుసుమ విసర శేఖరుండును నగు రత్నాకరవరునకు నర్థాంగలక్ష్మియై యుబ్బించుచు సుఖకేళీవిలాసంబున జెలంగెనంత॥

సీ॥ పద్మలోచనుం జెప్పె బ్రహ్మచారి। వేషమునను న్న గస్త్యుగౌని విప్రజాత్రి।

ముఖ్యదైత్యులు దనుజేంద్రు మోసపఱచి। సిరిబుహరియించె హరియంచు
గెరలియుపుషు॥ మ॥ వలదంచుం బలిదెల్పినన్వినక గర్వస్ఫూర్తిగర్జింపుచుం।
బళియార్బ ప్రభలన్హరింబొదవ జాగ్రత్ఖడ్గవిద్యుజ్జ్వ। లజ్జ్వలనజ్వాలకలాక్ర
మించెనుదిశక్చక్రంబులోఁబెక్కుమ్మడిన్। దళమయ్యె న్శరవృష్టితోఁదొరిగెశ
త్రవ్రాతనిర్ఘాతముల్॥ శా॥ ఆలో నందసునందముఖ్య హరిసైన్య వ్రాతపా
తూలముల్। తూలించెం దనుజాభ్ర జాలములదోస్త్రో మాధవానుజ్ఞనా। వేళ
న్వారుణపాశబంధితునిఁగావించె న్వదాన్యున్బలి। న్శ్వ్రశ్వాహాఁసమస్తదేవ
తలుహాహారావముల్ చేయఁగన్॥ ఉ॥ కట్టినకట్టుగాక హరికట్టడఁజేసిన నే
లుమున్నుగా। గట్టక వెన్క నేమిటికి గట్టె విహంగ వరేణ్యుఁడిట్టులిం। కెట్టు
నమస్కరింతు హరి కేనని కన్నులఁమ్రొక్కఁగాని యీ। కట్టునకింతయైనను
విచారము సెందఁడు దైత్యుఁడత్తరిన్॥ క॥ ఆయౌదార్యము ధైర్యం। బాయా
స్తికబుద్ధిఁజూచి యాహాయనుచున్। వేయువిధంబులసన్నుతి। సేయుచుఁగ్ర
నుగొనిరి దనుజ శేఖరు దివిజుల్॥ గీ॥ అంతఁజిరునవ్వుతోడ మాయావిటుం
డు। దైత్యపతిజేరి యోయి వదాన్యచరిత। యవనిపాదత్రయము నిత్తునం
టివేది। కడమపాదంబునకుఁజోటు గలదె చెపుమా॥ క॥ ఇచ్చెదనని యాకు
న్న। న్వచ్చుంబాపంబు రౌరవంబగు నీకనీ। యిచ్చుయ నన్వినిమరుదను।
హ్వచ్చక్రేశ్వరుఁడు బల్కె నెంతయుభక్తిన్॥ క॥ లేదన నేటికియిచ్చెద।
నాదుశిరంబునను నిల్పు నలినేక్షణ నీ। పాదాబ్జము నేనంబ్రహ్లాదునివలె
సుకృతి నగుదు నను సమయమునన్॥ ఉ॥ శ్రీదనరన్విశాల కటిసీమధరించిన
హేమచేలము। న్మేదుర మేఘమేచకసమిద్ధ చకచ్చకితాంగముంబతం। గోద
యురంగదంబుజదళోపమలోచనముల్చెలంగఁ బ్రహ్లాదుఁడు వచ్చె నారట
విహంగతురంగుని రంగెసంగఁగన్॥ గీ॥ వచ్చితనుజూచి బంధంబు వలనవినుతి।
సేయలేమికి దనలోన సిగ్గువడుచు। గన్నుగవ నశ్రుధారలు గ్రమ్మనున్న బలిని।
గాంచి హరిజూచి పల్కె నిట్లనుచునపుడు॥ క॥ సురపద మేటికి యొసఁగుము।
చరణాంబుజ భక్తి దైత్య సామ్రాజ్యంబు। న్హరి యిచ్చి మేలుచేసితి। కరు
ణింపుము బాధముక్తుఁ గా బలిని హరీ॥ వ॥ అనిపల్కు సమయంబున॥

ఉ॥ వల్లభుఁడిట్లు కట్టువడువార్త చెవింబడ గుండెఝల్లనం। దలడమందియర్ఘ్యను జపత్నియు పల్లవపాణిచెక్కులం। న్వ్రేల్లిడ కట్ట నశ్రువులు వెల్లువలై బోవ మొగంబు నమ్మనే। చెల్లి యిదేటులయ్యె నుచు హరి జేరి సమస్కృతి జేసి యిట్లనున్॥ గీ॥ నీకుఁ బ్రియముగ దానంబు నిచ్చువారు। మోక్షమందఁగ పురుషార్థముల నొనఁగు। నీదు కేల్క్రిందు తన కేలుమీఁదుగాఁగ। దానమొసఁగిన బలికి బంధంబుదగునే॥ క॥ విడుపింపుము విను రాజ్యం। బడుగము నీవలయువారి కర్పింపుము మే। మడవుల నుండెదము కనీ। యడుగులు మదిఁదలఁచికొనుచు నార్తశరణ్యా॥ మ॥ అదైన్యంబున విష్ణుపాదతనయై ప్రార్థించు విద్యావళీ। వనితారత్నము జూచి యేచిన దయ న్వాణీమనోనాథుఁడో। వనజాక్షా బలిబంధనం బితఁగ నే పాలింపుమన్నట్లు గా। జ్జనకుండిట్లని యెంచు దామధురవాచా వీచివాచాలతన్॥ గీ॥ ఎవ్వని ననుగ్రహింపనే నిశ్చ నెంతు। వాని సంపద హరియింతు వనజగర్భ। యటులగావున బలిభక్తి కాశ్య మెచ్చి। యిటులనై కొంటి సంపదలెల్ల నేను॥ వ॥ అనిపలికి బలికిట్లనియె॥ క॥ వినుము విరోచననందన। ఘనుఁడవు నీ వన్నిటన్ జగంబుల నీతో। నెనయైన దాతగలఁడే। తనరారి త్రిభువనైక దాతయనంగన్॥ గీ॥ బాళిమనువేళ దేవేంద్రపట్టమునను। నిన్ను నిల్పెద నందాక నీవుసుతల। మందు వసియింపుమనుచు ప్రహ్లాదుఁగూర్చి। దనుజసేనలతో నంపె దైత్యవిభుని॥ గీ॥ కడమయజ్ఞంబు సమదృష్టి గలిగి నిర్వ। హింపు శుక్రయటన్న నుపేంద్రుజూచి। నేకదృష్టి నినే నిర్వహింతు స్వామి। కరుణ చేనంచు వల్కె నా సురగురుండు॥ మ॥ వనజాతాక్షుఁడు మాటమాత్రముననే వైరోచనశ్రీలనై। కొని యీరీతి జగజ్జనుల్ పొగడఁగా క్షోణీధరారాతికి। చ్చిన బ్రహ్మాదు లుపేంద్రుగా హరి శుభశ్రీసాంద్రు దేవేంద్రునిం। ద్రుని గా పట్టము గట్టి రెల్లరకు సంతోషంబు వాటిల్లఁగన్॥ క॥ అదితియు గశ్యపుడెటువలె। ముదమందిరొ నెటుల జెలఁగె ముజ్జగములు నా। భ్యుదయం బింద్రోపేంద్రుల। పొదలింపఁగ క్లేశలేశము నులేదయ్యెన్॥ ॥ పనగదాదండంబు గైకొని యిందిరా కాంతుఁడు వాకిలి గాఁచియుండఁ। దనుజులోగాని యుదయిలయుగ తినగాన్ను సనిం ట్ల చక్రిం

బుపంపుసేయు । నేకార్యమునకైన లోకపాలాదికు లనిశంబు దనుబుద్ధి
యడిగికొనగ । లలితరూపవిలాస లావణ్యవతులైన కన్యకామణులూ
డిగములుసల్ప । స్వర్గలోకంబుకంటెను శతసహస్ర । గుణములెక్కుడుగా
గల్గి ప్రఖ్యాతికెక్క । సుతలమున నేడు నున్నవాఁడతులకీర్తి । చక్రిమతవర్తి
బలిదైత్యచక్రవర్తి॥ మ॥ ఇలలోఁ జీఁకటిగల్గు దెల్పుదురదే యిందేల లేదం
చు ము । గ్ధలు వేడం జెలులార మీముఖరుచిం గన్పట్టగా లేక కొ । ప్పులలో
డాగె నటన్న కుంతలసుమంబుల్ దీసివిచ్చౌరుచిన్నలు పైఁ దోచని వేయనం
బతినగున్ దైత్యేంద్రవాసంబునన్॥ మ॥ జలకేళీ సమయంబులం గలగి
పో చక్రంబులందోలెనో । లలనా నీనగుమోముచందురుని లీలంగాంచిత్తే
యున్నవి। తలుపింటింగద చంద్రుఁ డెవ్వఁడొకొ నాథా దెల్పుమంచన్న కెం।
పులగుంఁదంబున దన్ముఖాంబుజము జూపుం వల్లభుం డచ్చోటన్॥ మ॥ అతి
పాత్రంబగు పద్మనేత్రునకు నత్యౌదార్య లీలాప్తిచే। క్షితిదానంబొసఁగన్ప్ర
సంగు బలికిన్ జేకూరగా కద్దిరా। సుతలావాసము గల్గ నేయొరులకున్ ద్రవ్యప్ర
దానంబునన్ । స్తుతవైకుంఠము బాసి యచ్చటవసించుం జక్రిభోగార్థియై।
గీ॥ అఖిల సద్వార పాలకుఁడైన లోక। వల్లభుఁడు ద్వారపాలక వంశజునకు।
ద్వారపాలకుఁడాట తద్భక్తి ఋణము। దీర దేమిచ్చిననటంచుఁ దెలిసిగాదె॥
గీ। తనపితామహుబలి తనికి ద్వారపాలు। లైరె యిదిపుణ్యమునకింతె యను
చుఁగొల్వ। ధరణిపాదత్రయ మొసంగి దానుజేసె। వెన్నుఁడున్ బలిమాటకు
వన్నెగలుగ॥క॥ శ్రీవామనావతారక। థావిభవము విన్నజనుఁడు ధనధాన్యయశ।
శ్రీ వెలయఁగ భువి వర్థిలి। యా వెనుకను మోక్షలక్ష్మిఁ గధ్యతుఁడగున్॥ క॥ అని
శ్రీవైశంపాయన । మునిముఖ్యుఁడు దెల్పవిని ప్రమోదాన్వితుఁడై । జన
మేజయుఁ డవ్వలికథ । యనఘా విన వలతుఁ దెల్పు మనియడుగుటయున్॥
మ॥ జలజాక్షీమణికంకణ క్వణనచంచచ్చంచలాచామర। చ్ఛల చక్రాంగ
గరుద్వీణాలనచలాంచ చ్చంచరీకచ్ఛటా । కలనాసూచక కుండలద్యుతి
తరంగ స్త్వైరవక్త్రాంగజో । జ్జ్వలపత్రాయతనేత్రకోణవిహార త్సౌభాగ్య
లక్ష్మీయుతా॥ క॥ తారక దారక దారక । తారకవిధి దారకాంతి శతయుత

కవిబృం। దారకమందారక బృం। దారకవర వైభవాత్యుదారకశాఢ్యా॥ మాలినీ॥ మగదలకులవర్యా మందరాహార్యధైర్యా। జగదభినుతచర్యా శాశ్వతౌదార్యశౌర్యా। నిగమపదవిహారా నీతికార్యానుసారా। ప్రగుణ సుగుణహారా రంగమాంబాకుమారా॥

గద్య॥ ఇది శ్రీరామభద్ర దయాభిరామ భద్ర కరుణాకటాక్షవీక్షా పరిప్రాప్త దీప్తతరాష్ట్రభాషా కవిత్వ సామ్రాజ్యధౌరేయ సకల విద్వత్కవిజన విధేయ ధరణీదేవుల నాగనామాత్య సుధాసముద్ర సముస్నిద్ర పూర్ణిమాచంద్ర రామమంత్రీంద్ర ప్రణీతంబైన దశావతార చరిత్రంబను మహాప్రబంధంబునందు బంచమాశ్వాసము.

అయిదవ యవతారంబగు వామనావతారకథ.

సంపూర్ణము.





భృగురామావతారకథ.

షష్ఠాశ్వాసము.

శ్రీధవ కథాసుధారస। మాధుర్యాస్వాదహృదయ మగదలకులపా। బోధకళానిధి సకలక। ళాధికనైపుణ్య కృష్ణయార్య వరేణ్యా॥ గీ॥ అవధరింపుము జనమేజయక్షితీశ। శేఖరునకిట్లులను వ్యాసశిష్యమౌని। ధరణి

వరభృగురామావతారక మిఁకను। దెలియఁజెప్పెద వినుమని తెలుపఁ
దొడఁగె॥ శా॥ శ్రీకాంతోజ్జ్వల మోదవాసమలకాంక్షీణ ప్రభావాప్తము।
ప్రాకారాజవిరాజమానము గళారమ్యంబు శుద్ధద్విజా। లోకంబుల్క
ట హేమధామవర వల్గుస్ఫూర్తి చిత్రంబు క। న్యాకుబ్జంబు కళాబ్జనస్తు
తినిఁ జెల్వంబా ముఖాబ్జంబున౯॥ ఉ॥ ఆపుర మేలు గాధి మనుజాధిప
శైలనిరోధిబాధితా। టోపవిరోధి సాధిత కఠోరధరాంత పయోధియా
ధికా। భూపటుకీర్తిశోభిత కపర్దిశిరోధి నమేధితాత్మమే। భూపరిపూరి
తాంబుధి సుతాగృహమేధి మహాశ్వమేధనై॥ చ॥ అతఁడొకనాఁడు వేడు
క నౌయారులు గొంజలు గొల్వుసేయఁగా। రతనపుమేడనున్న తరి [illegible]
రుచీకుఁడు చారుభక్తితో। నతిథిసపర్యలం బ్రముదితాత్మునిఁ జేసి మణీమ
యాసన స్థితునొనరించి తా నతని చెంత వసించె వినీతి నత్తరి॥ గీ॥ పడుచు
తనమున పైపక్కపడుచున్న। పడుచునొక్కతె వేడుకపడుచు గాంచి।
రాజ యీకన్య నీకూతురా మహాత్మ। భాగ్యశాలివి సకలసంపదలనీవు॥ క॥
వీక్షించినపుడె తెలిసెన్। లక్షణవతియంచు రాజనందనిహస్తం। బీక్షించి
తపసిసతియగు। లక్షణమున్నయది నా తలఁపుచేకూఱెన్॥ క॥ కన్యా
ర్థినగుచు వచ్చితి। ధన్యా నీయింటికడకుఁ దడయక నాకుం। గన్యాదాన
ము చేసి య। నన్యాదృశ సుకృతమొందుమా నృపసోమా॥ వ॥ అనిపలి
కిన జడదారిపలుకులు ములుకులై చెవినాటిన నుల్కిపడి యప్పుడప్పుడమి
ఱేఁడు దనమనంబున॥ గీ॥ ఆకునలము మెసలి యడవిలో వసియించు।
తపసియేడ రాజతనయయేడ। నంచునించుకైన నెంచక యక్కటా। యడుగ
వచ్చెనిట్లు వెడఁగుతపసి॥ గీ॥ ముక్కుననెయుండుఁగోపంబు మునుల
కెల్లఁ। జెల్లబో యీయన శపించినను శపించు। నటుల గావున నొకయు
పాయమునఁ దీనిఁ। గడపెదనటంచు నిట్లను గౌరవమున॥ మ॥ అమ
లాత్మా నినువంటిధన్యునకుఁ గన్యాదానముం జేయు భా। గ్యము సామా
న్యమె దైవమైనఁ జంద్రఘనసఖ్యాంగ శ్యామకర్ణాగ్రవాహముల న్వేయినొసంగఁ
గావలయుఁ గన్యాశుల్క మస్మత్కులం। క్రమమీరీతి నొసంగి కైకొం

ఱిం దే కన్యామణిన్నా వ్రుంతుణ॥ చ॥ వెలవెలబోవు మోమునను విప్రకిమా రకుఁ డౌర యొవ్వఁడుం దలఁపరు తొల్లి యీతలఁపు ధారుణిలోపల నిట్టిగు ణ్యను । ల్గలుగునె గల్గెనా నొకటిగా బదిగావు సహస్రవాహము । ల్గలు గునె యేమిసేయుదును గన్నియఁ జూచిన నాసయయ్యెడిన్॥ మ॥ అనఁచు న్మానసిఁ గొంతచింత పడి రాజా మంచిడే తెత్తునం । చనియుంపించుక భూమింగల్గు సకలక్ష్మాధీశులన్వేడి యెం । దును దాదృక్తురగంబు లేక మదిలోనూల్కొన్న చింతాభరం । బున నిట్లంచుఁ దలంచె మౌని యప రాంభోరాశి తీరస్థుఁడై॥ సీ॥ నెఱివేణిఁగూడని నెఱులు నెన్నుదుటిపై కమ్మ కస్తురి తిలకమున నెరయ । తెలివాలుగను కెలంకల సానదేరెసి చికిలి చూపులొకింత సిగ్గుగుల్క । గోరనొక్కినపాలుగారు కెంజెక్కుల నుదిరి కమ్మలకాంతి యదుటుసూప । నొరులుచూ పొరయుచో నుసిరికాయ మేఱుంగు చన్నుల పయ్యెద చాటుకొనఁగ । కొమరుప్రాయంబునను ముద్దుగులుకుచున్న । కన్నెఁజూచినమొదలు నాకన్నుగవకు। నిదురగాన హా యంబుల నెమకిగాక । గాని నీచింతదరిజేరు క్రమముగాన॥ మ॥ అనియ త్యంత దురంతచింత మునిరా జౌర్వా నలజ్వాలికా । ఘనసంతాప పరిప్లవ న్మకర వక్రగ్రాహ మీనాదిజం । తునికాయామ్రభ్రనదీ నివాస కరుణోద్యు క్తోర్మికా హ స్తమై । కనకావార్ధిగుభిల్లునం దుమికె నక్రస్ఫూర్తివర్తిల్ల గన్॥ చ॥ దుముకి మునీంద్రనందనుఁడు తోడనె వారణ భృత్యు లెందరే। సమధికభక్తిఁ జేరి కడుచక్కనిమార్గము సూపగా నుపా । యమునన గాలి కోసరిలి యయ్యమరావతిచేరివచ్చు సం । యమి యమిత ప్రభావమున కప్పతి విస్మయముప్పతిల్లగన్॥ క॥ ఎదురుగవచ్చి మునీంద్రుని । పదము లు పన్నీటగడిగి బంగరువిరుల । న్నదమల భయభక్తులమది । బొదలం బూజించి యతని బొగడుచుననియెన్॥ శా॥ సామాన్యుండె భవద్గురుండు భృగుఁడత్యుగ్ర ప్రభావాఢ్యుఁడై । యామూర్తి త్రయిచేతఁ బూజగొనె నింద్రాదు ల్భవత్కింకరు । ల్నీమాహాత్మ్యము కొంచెమే గలిగెగా నీపా దముల్గోల్వఁగా। నేమున్నే మి తపంబుచేసితినొకో భృగ్వన్వయ గ్రామణీ॥

వ॥ అనిన వరుణ వినీతవృత్తికి వినీతప్రాప్తి యగునని సంతసిల్లి మునివల్ల
భుం డిట్లనియె॥ మ॥ చెవినల్పుందను వెల్లఁ దెల్పుగల తేజుల్వేయిటిం గోరి
నే । ధవళైకాశ్వుని మేషవాహనుని గంధర్వద్విషద్వాహము మా । నవ
వాహు న్నరసించి కాండపతిని న్యాచింపఁగా వచ్చితి । న్నభవనాధీశ్వర
యి చ్ఛపంపుము శుభంబు ల్నీకుచేకూఱెడిన్॥ మ॥ అనివన్యాభాగ్యము చేసితి
న్మునికులాధ్యక్షా సహస్రాశ్వము । ల్గొను సేవిచ్చెద నంచు నట్టిపోసఁ
గన్ క్షోణీసురేంద్రుండు ప్రగ । క్కానగంగానది త్రోవగా వెడలెఁ దత్పం
కాణజాతంబునం । దనరారెన్ హయతీర్థమన్ననిది గన్యాకుబ్జపార్శ్వం
బునన్॥ క॥ జటివరుఁడిటువలె గంగా । తటిని గృపీటముల వెడలి తలఘు
రఖురా । స్ఫుటితధరా చటులరజః । పటలారుణితాంశుఁ డగుచుఁ బర
తెంచుటయున్॥ చ॥ వరనృపుఁడెవ్వఁడో పురముపై జనుదెంచెనటంచు
గాధిభూ । వరుఁడు మహారథ ద్విరద బంధుపదాతల తోడఁగూడి ము ।
ద్గరకరవాల తోమరగదాపరిఘ క్షురికాదిసాధనో । త్కరము వెలుంగ
బెట్టెదురఁగన్గొని డగ్గఱివిప్రుఁడిట్లనున్॥ శా॥ మామా తెచ్చితి వేయిగుఱ్ఱ
ములు కొమ్మా నాకుఁనీకన్యని । మ్మా మాట ల్వేయియేల యుంచనిన
గోత్రాధీశుఁ డౌరౌరనీ! స్సామాన్యంబు తపోవిశేషమొకదా జామాతయ
య్యెన్భళీ । యీమౌనీంద్రుఁడు నాకు నాకులము నెంతే పావనంబయ్యె
డిన్॥ గీ॥ అనుచు ముదమున మునిదోడుకొనుచుఁ బురము! సేరిపురమెల్లఁ
మిగులఁ గైసేయ బనిచి । వేగమౌహూర్తికులను రావించి లగ్న । నిర్ణ
యముచేసె గాధి భూనేతయంత॥ సీ॥ చెలువయొక్కతె నూనె చిలికించి జడ
విప్పి నిదుర రాదలయంటె నేర్పుమీఱ । చెలియొర్తు నంగము నలుగిడె
భసితావలిప్తదేహము హైమదీప్తిమెఱయ । గంధమిందేలన గందంపు
టటకలి బెట్టెనవ్వచు నొక్క బిసరుహాక్షి । ఉష్ణాంబువులటంచు నొద్దు
కోగోర్వెచ్చ జలములనొకకల్కి జలకమార్చె । చలువలిదిచ్చె నొక
చెల్వ వెలఁదినవ్వు । లుత్తరీయములంచుచే నొడియ మాల్య । భూష
ణంబులఁగైసేసె పోలఁతియొకతె। రాజులమెయంచు నమ్మౌనిరాజు నెలఁగ॥

గీ॥ ఇవ్విధంబున రుచిక మునీంద్రచంద్రు । పెండ్లికొడుకును జేసిన ప్రేమ
మీఱఁ । గన్యకామణి సకలశృంగారములను । చెలులుగై చేసి రట మ
న్న చెలువమీఱ॥ సీ॥ అటగాధిభూపాలుఁ డత్యంతమోదముతో జాతిము
త్యపు పెండ్లి చవికెలోన। ఘోరమై మంగళ తూర్యఘోషంబులు భోం భోం
తరముల భోరుకలగఁ । బాటలగంధులు పాడంగమమతతో దం: తుల్
చిగురు పాదములుగడిగి। మధుపర్కమొసఁగి సమ్మతి సత్యవతి దనపుత్త్రి
కామణి ధారబోసియిచ్చి । యంత నాల్గుదినంబులు నైనపిదప। భూరిమ
ణివస్తువాహన భూషణంబు । లరణముగనిచ్చి యల్లుని నాడుబిడ్డ। దన
పురంబుననిల్ప చిత్తమునఁ దలఁచి॥ మ॥ అనఘా మానసశద్ధి గల్గిన నర
కాన్యనిం బ్రవర్తిల్లుట । ల్గనకాగారమునందునుంట నరియేకాదే తమో
దూరుఁడై । జనకుండేల్లడఁ భూమి మీఱటుల నన్మత్పట్టణాభ్యంతరం ।
బునఁ గొన్నాళ్లు వసించుటొప్పదేయన న్భూమీసురుం డిట్లనున్॥ ఉ॥మం
చిది సార్వభౌముని కుమారికకు న్వనవాసఖేదమె । ట్లంచునటంచు నెంచి
వసియించెద నట్లనె దీననేరమే । మంచుఁ దదీయ పట్టణమునం దొక
కాంచన మందిరంబునన్ । జంచలనేత్రతోడఁ బతిసల్పసమస్త గృహస్త
ధర్మముల్॥ చ॥ గురుకుచకుంభము ల్గదలఁ గ్రొవ్వెదజాఱఁగడాని కమ్మ
క్రొ । మ్మెరుగులు దళ్కు చెక్కులనుమించ మిటారపు కల్కిచూపులం।
దొరసిన సిగ్గుతో నళుకుతో సతతంబును గ్రొత్తపెండ్లి కూఁ। తురుపరిచ
ర్య సేయ పతిఁదోరపు వేడ్కనొనర్చు సత్క్రియల్॥ సీ॥ ఔపాసనంబన
కక్షుతల్దెమ్మన్న తరినిచ్చునవుడు తత్త్రాపుపేర్మి। యానకే నైవేద్య మా
యెనాయెన నాయె ననక పదార్థంబు లునుచునేరు । పడగకేమున్న మా
రిడదెచ్చి యాతఁడేమాత్రంబు వలదన మగుడు సిగ్గు । మడుపులన్నియు
నొక్క మరియిచ్చి భుజియింపఁ జనుమన్న నొఁడొండొసంగు ప్రేమ ।
విశ్రమింపఁగ శయ్యగావించు నెనరు । వీజనం బల్లనల్లన విసరుమ
మత । యొయ్యనొయ్యన పాదంబు లొత్తు బత్తిఁ । ఒతిని సాక్కి చప
మెలఁగు నప్పద్మగంధి॥ సీ॥ అంతట నొక్కనాఁ డాగాధినృపపుత్త్రి సి

నిక్కోలాటంబు ప్రతిమజోళ్లు తీరైనమంజిష్ఠి తెరతోటి పచ్చల పల్లకియెక్కి
ప్రాభవము మెఱయ । నిరువంకనుడిగపు విరిబోండ్లు రా నన్నగళ్ళుముంది
నందడి గదలక్రొత్త । రంగులఅవికెలు బంగారు పూకొప్పు సవరముల్వ
గవగ సన్నచీర । లద్దముల్పరిమళములు నాదిగాఁగ । పెట్టెయలతోడ
శాఁధనపట్టియున్న । నగరికే తేర నారాజనందనియును । మోదమునద
ల్లిపాదాబ్జములకు మ్రొక్కె॥ గీ॥ మ్రొక్కినను లేవనెత్తి యమ్ముద్దుకూఁ
తు । నక్కునను జేర్చి యోయమ్మ యుగ్రవర్ణ। చెట్టవట్టియు దండంబువెట్టఁ
దగునె । రాచవారికి నంచు నా రాజవదన॥ క॥ ననుసిగ్గునఁదలవంచిన ।
తనయకు వస్త్రములొసంగి తపసీతాగృహం । బుననొక్క రత్నపీఠిని। నెవర్చు
గఁగూర్చుండి యిట్లనియెఁగూఁతురికిన్॥ ఉ॥కన్నియ నేఁడు నీముఖవికాసము
దెల్పెసమస్త సౌఖ్యమై। నన్నినువేడ వేడుకగు .నాథుఁడు నిచ్చలునింగిత
జ్ఞుఁడై । మన్ననసేయునే తెలుపు మామెలఁబ్రాయపు ముద్దుగూఁతుమే ।
తెన్నకయిచ్చితిం జడున కేనని నీజనకుండు చింతిలున్॥ గీ॥అనిన నేమనకున్న
సత్యవతిఁజూచి । సఖులు దెల్పఁగరాదటే జననిచెంత। సిగ్గువడనేలమాతో
డఁజెలగి పెంఁగి । పతిచతురుఁడంచు దెల్పు దే ప్రతిదినంబు॥ గీ॥ అమ్మయిది
దెల్పుకున్న నేమాయె వినుము । తనమనోహరు సాటిగారనుచు బలుకు ।
నింద్రుచంద్రుని నెపబాయ రింతదడవు । నేమిమంత్రమెఱుంగునో ఋషి
వరుండు॥ చ॥ అనవినియం తెచాలు చెలులార మహాత్ములు గారె తాపసు।
ల్పనితలకింపు సేయఁదగు వైఖరిగూడి మెలంగఁజాలరే । యనిశమునవ్వనే
లఘునియామకనాథకుమారపత్నిత । త్తనయను గౌఁగిలించి ప్రమదంబున
నిట్లనియె న్మృదూక్తులన్॥ గీ॥ కన్యనినుగన్న కతమున ధన్యమయ్యె। నాకు
లంబంతయును నైసనాకులంబు । గాకమానదు నామది నాకుబలెనె। నీకుప
నయుఁడు లేమికి నీరజాక్షి॥ క॥ పతివేడికొనుము పుత్రుని। సతుల తపోన్వి
తుఁడగాన సతఁడొసఁగెడియా। సుతుఁడుభయ కులంబునకుం । గతియై
నఁగెడిననుచుదెల్పి గ్రమ్మరఁజనియెన్॥ ఉ॥ బాలికనాటిరేయి పతిపజ్జకు
బోయి పయింటకొంగు కెం । గేలబిగింపుచున్నెలను గేరెడు లేనగుమోము

వంచి వా। చాలతేజూపలేకిగురుచాయల మోవిగదల్చుచున్న నీ! లాల కచెట్టవట్టి తనయంకముసందడి మానియిట్లనుక॥ గీ॥ యేమిరయడుగంగవచ్చితివింతలోన। సిగ్గుపడనేల దెల్పవే చిగురుబోడి। శుద్ధిమైనఘటేరిచైదనేనటన్న। జననివాక్యంబు సతిదెల్ప మునివరుండు॥ క॥ కనిపెంచువయసుగాదే। తనకేటికి లేకపోవుతనయుండికనీ। కను నీజననికినుత్తమ। తనయులు గల్గుటకు గర్వ దగగావింతుక॥ క॥ అని యున్న తరిని భృగుముని। సను దేరంగ రుచికమాని సతిమణికలశం। బున బన్నీరము వంచంగ। జనకుని పాదములుగడిగి సంతసమెసంగక॥ గీ॥ చౌకమైమించు దంతంపు చవికెలోన। రత్నమయపీఠమైనుంచి ప్రకటభక్తి। పొసంగబంగారుపువ్వులంబూజ సేసి। వినయమునజాసి వీవన విసరుచున్న॥ ఉ॥ వేడుకమీఱంగా విభుని వీవనగైకొని చల్ల తెమ్మెరల్। గూడంగ మెల్లనేవిసరుకోడలివల్లభభక్తి యెందునుం। జూడని సద్గుణంబులును జూచి ముదంబున నమ్మునీంద్రుండు। డిల్లాడె వధూమణీ యడిగి సర్థమొసంగెద వేడుమీవనక॥ క॥ వనజముఖి పలుకనున్నం। దనతల్లికిందనకుమంచి తనయులు వలెనం। చును వేడెదిన్నరేన। న్నని రుచికుండు దెల్ప సతి ద్రపాన్వితయగుచుక॥ గీ॥ తలంగిపోయినభృగుమానితనయుంజూచి। యాత్మజులుగల్గుటకు నుపాయంబుదెల్పి। శముల కేటికి నృపనివేశములుంబుత్రు। బడసి వనినుండు విరావనివలికిచనిన॥ ఉ॥అంతట భార్గవుండు దనయుంగనంగన్గొని సిగ్గకేటికే। యంతిరా నీదుకోర్కి ఫలి యించెను నీజనయిత్రి నీవుబు। త్వంతమునందు జిప్పలము నత్తియకౌంగిట నొత్తిరందునా। చెంతకు నీకు నేచరుచ్చేసి యొసంగెద నంచుబంచినక॥ క॥ సరభసముగ సత్యవతీ। తరుణీమణి యవ్విధంబుదనకెఱుంగింపం। బరితోషంబున నరవర। సురపతి సతిబుతువు కెదురు సూచుచు నెలమిక॥ సీ॥ మును దాను కడకుంబోయినదినం శాదిగా దెచ్చుకదిన మును దినము లెన్ను। మధురముల్ప్రియమైనమానిభోజనవేళ సారెకునా వపచ్ఛల్గిమెసవు। తురుముర నొకపువ్వు దురు నెచ్చెలిమోర్తు తెరవవుష్ప వత్నివైతిపనభావయు। సలవోకతొడమీది పలువ కుంకుమకజ్జి కనుంగొని

తోలఁగిలివనుచుఁదోలఁగుఁ । దెలిసి కాకున్నవగచు నవ్వనరుహాక్షి! యం
తనెలవైన ఋతువైన యాత్మజయును । తానుమూన్నాళ్లు మూఁడేండ్లుగా
నుగడఁచి । నాలవదినంబు నందు స్నానములుచేసి॥ వ॥ నిబ్బరంబు నబ్బ
రపుసంతసపుకబ్బి తబ్బిబ్బగు నబ్బిబ్బోకవతులు దుఃఖుఁడాడిన క్రమంబువో
నాడి వాడి చను మొనలుగాడిపార పుడమిఁజేనిపూఁబోఁడిమేడియును రుచి
కముని లిఖుచకుచరావియును గౌఁగిలించి పసుపాడినరాచిల్కలవడువున
నశిథిలనడతేరసపుడు తమరకమునుకల్గ సౌవిదల్లులవలన విని చంకలనిండ
పసిబిడ్డలు గల్గుతల్లులు సరుగమరుగునకరుగ మందిరంబునకరిగి॥ గీ॥
మౌనిపతి బ్రాహ్మణక్షత్ర మంత్రములను । చరువుగావించి యటయుం
చి సవిఘనదికి । చనిన నావేళ మెసవిరి తనయచర్వు । జననిజనయిత్రి
చరువు దత్తనయపకరి॥ ఉ॥ అంతట మౌనివచ్చి యదియంతయు నాత్మ
నెఱింగికిన్కతో । కాంతరో నీదుగర్భమున క్షత్రకులాంతకరుండుపుట్టెడి।
న్యాతిథనుంబు బ్రహ్మఋషి చంద్రుఁడుపుట్టెడి నీదుతల్లికిన్ । భ్రాంతినినీ
వానర్చినవిపర్యయము మిటు ఫలించునావుడున్॥ చ॥ భయపడి యంత సత్య
వతి భర్తపదంబుల వ్రాలి రాజహంసం । డయినకుమారునోల్ల సదయాత్మ
నొసంగుమటంచు వేడిన। న్దయ ముని నీసుతుండగు నుదాత్తుఁడు దత్తన
యుఁడు ఘాతుకుండయిజనియించు నీ జననియందు మహర్షివరుఁడుపు
ట్టెడిన్॥ క॥ అనిపల్కిన ముదమందిరి। వనితామణు లంత సత్యవతిజమ
దగ్నిం । గనిరె జగత్త్రియసజ్జన। వినుతుని నృపపత్నిగనిరె విశ్వామి
త్రున్॥ శా॥ విశ్వామిత్రుఁడమిత్ర భీకరభుజా వార్యం బవార్యంబుగా ।
విశ్వం బేలి వసిష్ఠమౌని పతితో విద్వేషియై యంతట। న్నశ్వద్బ్రహ్మ ఋషి
త్వముంగనిమెసాహసోద్బ్రహ్మ దేవాగ్రణీ। విశ్వేశాదులు సన్నుతింపఁగ జగ
ద్విఖ్యాత శీలంబునన్॥ క॥ జమదగ్ని మునియుసకలా । గమనిగమ పురా
ణశాస్త్రకలనాచణుఁడై । శమదమయమ నియమాదిమ । సమధికగు
ణశాలియగుచు సన్నుతికెక్కెన్॥ అక్కాలంబున॥ క॥ రేణుకభూపకు
మారిక । శ్రేణిక గుణగణసగుణ్య ఋక్షధరిత్రీ । రేణుకగతి జత సమ

దక। రేణుక విలసిల్లురూపు రేఖలకలిమిఁ॥ క॥ ఆకన్నె ...
ణొకృత గావించి కాంచె నలుగురిసుతుల। స్వీకాంతుఁడైదవసుతుం। డై
కూరిమి నెరపెనతని కవసనీనాథా॥ క॥ అనువ్రఁడు నమ్మునిఁ గనుఁగొని।
జనపతి యిట్లనియె శౌరి జమదగ్నికి సం। దనుఁడై జనియిఁచుటకే। మి ని
మి_త్తం బనిన మౌని మృదుగతిఁ దెల్పెన్॥ ఉ॥ నారదమౌనిచంద్రుఁడొక
నాఁడు వినోదముగాఁగ నా సహ। స్రారము జేరి భాస్కర సహస్ర నిదర
నయో సుదర్శనా। వైరినిశాటకోటినివారణ్ద్రుఁచుట నీదుశక్తియో।
కరగొనుమట్లశౌరి యొకకారణమేన హరించె శత్రులన్॥ చ॥ అనవినిశౌరి
జేరి కలహాసనుఁ డబ్జపలాశలోచనా। దనుజవరేణ్య ఖండనము తావక
శక్తియొ చక్రశక్తియో। యనవుఁడుచక్రమేమిపని యస్మదుదార బలం
బెకాక విం। టనుహరియించెనో యువినడంచునో వైరుల నీవెఱుంగవే॥
మ॥ అనినన్వెన్నునిఁ జూచి మౌని కమలాక్షానీవు నీశక్తియుం। చను నీచ
క్రము వేడిన న్స్వబలమంచుం బల్కనిందేటియొ। కొ_ నిజంబన్ననునన్వి
యట్లయిన నీకుం దేటఁగానింకనే। నును ధాత్రింజనియింతు చోరులకు
దానుంబుట్టుగా శుర్వరన్॥ మ॥ అనిపద్మాక్షుఁడు పంప జక్రము హసాదం
చుం బ్రమోదంబు మీ। అను మాహిష్మతి నేలుచున్న కృతవీర్యక్షోణి
పాలాగ్రగ। ణ్యునకుంబుట్టె సహస్రబాహులయి నైజో గ్రాకారముల్మించ
న। ర్జుననామంబున ధీరతానుగుణతా శూరత్వము ల్మోభిలన్॥ మ॥ అను
మాత్రేతద భక్తియుక్తుఁడయి దత్తాత్రేయు సవించియ। య్యణిమాద్య
ష్ట విభూతులంబడసి సప్తాంభోధి సంవేష్టితా। గణితోర్వీ_స్తవ సప్తకష్య
గృహరక్షాలీల రక్షించెఁ దా। రణఁడై తోఁచుచు నెందు యోగ మహి
మం గ్రూరాత్ములం ద్రుంచుచున్॥ సీ॥ మఖభోక్తులయుక్తి రి మాన్పఁగావే
ల్పువు వాజ్జుమందులుసారె వెతకసాగె। హోమధూమంబుల నుబ్బుము
బ్బులు మరున్నేతశ్రుజ్ఞఖులలో నిల్వనయ్యె। వివిధకాంతులఁ జెంది జనులు
కృతార్థులై దేవతాతతులఁ బ్రార్థింపనైరి। యుడలేదు నృపుని ...
గనస్వప్నమ్ములయందు యజ్ఞముల ... । ... పాల

కూడ హారహంబు । సేయుయాగంబుల నతండు సేసినట్లు । ధర్మములు చే
సినట్టి భూధవుని గాన । భూతభావిభవత్కాలముల నరేంద్ర॥ సీ॥ ఉడు
రాజముఖులతో నొకనాఁడు జలకేళి సవరింపుచును విలాసంబుగాఁగ ।
చేతుల చేత రేవాతోయములుగట్టి యొకయిన్నియవ్వాలి కుబుకనీక। యం
తటవిడువ నయ్యేఱు ప్రవాహంబు సైకతలింగపూజనమొనర్చు । రావ
ణుముంప విభ్రాంతుఁడై కోపించి కలహించివచ్చిన గాంచినవ్వి । వానిఁగొ
నిచని చెఱసాలపైచెనంతఁ । బౌత్రునకుఁగాఁ బులస్త్యుండు ప్రార్థనంబు।
సేయుదశకంఠు విడిచె రక్షితరణహ్య । తార్జునుండగు కార్తవీర్యార్జునుం
డు॥ సీ॥ మఱియొక్కనాఁడల్ల మహీపుకొల్వునకొక్క బ్రాహ్మణుఁ డరు
దెంచి పార్థివేంద్ర । యొకలిగొట్టినే నడిగినయన్నంబు బెట్టింపుమనవుడు
ప్రీతినతఁడు । నటువలెఁ బెట్టింతు నవని నేవహానుండ నీదేశమాహుతి
యిమ్మటన్న। బొంకకదా వెంటఁ బోవుచు శిఖనార్చు వారివారింపుచు వను
లుపురము । లాదిగాఁగాల్పనీయనిజాశ్రమంబు । దగులవగచును వరు
ణనందనుడు రాము । దళితభుజుఁడవు గమ్మని యలుకఁ బలుక । యుతికి
యంతట నగ్నినుండెపురిని॥ చ॥ హరియును రేణుకాజలరుహాయతనే
త్రుకు జామదగ్నినా। ధరణిజనించి జాత్యుచితతాపసవేషముమీఱ శూరుఁ
డై । పరశువుఁబూని మానిజన బాధక సింహాయు ద్వీపన్మృగా। త్క
రికిరిముఖ్యసత్త్వముల దైత్యుల ద్రుంచుచునుండె నెల్లెడన్॥ చ॥ అట
యొకనాఁడు రేణుకమహర్షి పురంధ్రిలఁగూడియాడియె । ప్పటివలె
గంగకేగి యతి పావనతీర్థములాడి యాడిద । ర్ఘటముగ వాలుకాపటలి
గట్టి ఘటిక ఘటియించి నీటితో । గటితటినుంచి ధోవతులు గాలికిఁబై
పడ తేరవచ్చుచోన్॥సీ॥ అలతిజక్కవపిట్ట లంచుబట్టితిగాని గుబ్బలంచెఱుఁ
గనే కోమలాంగి। నునునాచుతీవియ యతియెడిసితిఁగాని వేణియంచెఱుఁ
గనే విద్రుమోష్ఠి । సుడియంచుమునివేళ్ళ బుడికిచూచితిగాని నాభి
యంచెఱుఁగనే నళినగంధి। తామెకవిరియంచు తావిగ్రోలితిగాని మోమం
చు నెఱుఁగనేమృగనేత్ర। యంచు నక్కోర్కిఁ జెనకుచు మించుబోండ్ల। గూడి

జలకేళిఁ గావించు కోడెకాని । తలిరువిల్కాని నగుచక్కదనమువాని। నొక్కగంధర్వుఁగాంచి యయ్యుత్పలాక్షి॥ శా॥ ఏమీ రేణుకఁ గూడిరాఁదగదవె నీవెవ్వారి నీక్షించితే । మామాటల్వినవేయటంచు మునిభామారత్నముల్పిల్వనో । హా మీ కెంతటితీవ్రమే నిలువరే యొక్కింత సేపంచున । కాఁకున్యుత్తమ నిల్చె తోఁటి సతులేగ న్వానిపేక్షింపుచున్॥ గీ॥ మఱియుమఱియువాని మన్మథవికార। ములవిలోకింపుచును వేఱెతలపలేక । భ్రమసి యనురక్తయైయున్న పంచబాణ । కాండముగలించె నసఁగటి ఘటముపగిలి॥ క॥ జలములఁ జేఁదముదసిన । చెలియది యపుడెఱేఁగియుకట చేసడలెనటం। చలగంగ నిసుక నెప్పటి। వలె ఘటముఁజేయబోయి వసగాకున్నన్॥ క॥ తనపాతివ్రత్యంబున । కును భంగము వచ్చెనేలొకో యని చిత్తం। బునఁదలఁపుచు గుండియదురు। ల్లనవీక నేనెందుబోత్తునని సతివగతోన్॥ శా॥ నానారీతులఁబిల్చు నెచ్చెలుల వెంటంబోవకేమారకే । యీనిర్భాగ్యని నేలఁజూచితిని నాకీభంగిపాటాయె నే । లా నాపాలివిధాత నానుదుట వ్రాయంబోలు నీరీతి నిం । కేనేమందును గంగలోఁబడుదునో యీదుర్యశంబింకఁగన్॥ గీ॥ అనుచుఁ జింతించుచును రిత్తహస్తములను । గడియవచ్చినయిల్లాలిఁ గాంచినాథుఁ । డెంతప్రొద్దాయెఁ బోయినీవింతదడవు । నెచటనుంటివి జలఘటం బేదియనిన॥ క॥ ఏమన నేరకమూరక । కామిని దలవంచికొనినఁ గపటజ్ఞుండౌ। నామునికి వచ్చెఁగోపం । బేమాత్రము నాటికోప మీశ్వరుఁడెఱుఁగున్॥ గీ॥ జటివరుఁ డిటువలెఁగసలుచు । చిటచిటనిప్పుకలు సెదర జిగి కనుఁగొనలఁ । దటతటకట తటులదరఁగ। గిటగిటమన రదనపటలి గీటుచఁబలికెన్॥ శా॥ జౌనే యోసి దురాత్మురాల నిను నిల్లాలంచు నేనమ్మియుం। టే నిన్నిట్టిదురాశఁజెందఁదగునే నీభోగముల్సెల్లునే। కానిమ్మంచును రుక్మవంత ఇదిగో కన్గొంటి దుశ్చేష్టితన్ । దీనిన్ద్రుంచుము శస్త్రపాణివయిమాతృస్నేహమ్మింకేటికిన్॥ గీ॥ అనిన శ్రీరామరామయటంచు మాని। నందనుఁడుహస్తముల మకర్ణములుమూసి। యెంతమాటాన తిచ్చితి రింతసేయ। నేమినేరంబు గా

వి౦చెనీపురంధ్రి॥ వ॥ అనిమఱియు స్వేచ్ఛాగర్భవతులగు సతులకైతంబు నోర్చి కూర్చుకొనుబృహస్పతి ప్రభృతులవినమే అట్టి కాయిక దోషంబణు రేణుమాత్రం బీ రేణుకయందు లేదుగదా మానసిక దోషంబునకుందగిన ప్రాయశ్చిత్తంబు చిత్తగించుట యుత్తమం బిది నీచిత్తంబునకు రాకున్నని మ్మాతృకాశిని వర్జించుట-తియకాక క్రూరకర్మంబు బ్రాహ్మణునకు ధర్మంబుగాదని పలుకు రుక్మవంతుతోఁ గూడ వివస్వత్సుషేణ విశ్వావసు లను ముప్వురనుకులటుపలికిన దురాధర్షామర్షంబున నమ్మహర్షిఁదురా త్ములారా మాకుధర్మోపదేశంబు సేయవచ్చితిరే యలంఘ్య మద్వచనోల్లం ఘన దోషంబున నజ్ఞానులై వనజంతుసంతతులంగూడి తపింపుడనిశపించి యామునిచెంతనున్న పరశురాముఁవిలోకించి నీవైన నీచంచలాత్మ ద్రుంచె దవో లేదోయని యడుగ గడగడవడంకుచు కేలుమొగిచి మీరునొడవిన పనుపున నడంచెదననిన దడవుసేయకుమని తండ్రితరువిడ బెల్లడరునడలు న భార్గవుండు నర్గళధారాకఠోరంబగు కుఠారంబు దెసచూచినఁగని కొడు కులారా మిమ్ము నెడఁబాసిపోయెదనని కన్నీరునించు తల్లింగాంచి రుక్మవం తుండు మొదలైన నలువురుసుతులు మాతృస్నేహంబువలని దుఃఖావేశం బున జనని కంఠంబు పట్టికొని తోఁబుట్టువుల మమ్ము మొదటమట్టుపెట్టి మఱిమీఁదట మాతృశిరంబుగొట్టి కీర్తిగట్టుకొమ్మని బెట్టు చలపెట్టిన వారల నెట్టువిడిపించలేక పరశ్వధాయుధుండు దనమోము చూచిన జమదగ్ని యగ్నివిధంబున భగ్గున మండిపడి రుక్మవత్ప్రభృతులమున్ను గా హతులఁ గావించి పిదప రేణుకను డెగవ్రేయుమని త్వరపెట్టిన బెట్టు లిక్క యిట్టికట్టిడి తనంబున కొడిగట్టుట కెట్టిపాపంబుచేసితినోయని యెదఁ బట్టుసాలక నెట్టుకొనుదట్టపు నెవ్వగ నిట్టట్టై యెట్టకేలకు నొడంబడి దిట్ట తనంబునఁ దనతోఁబుట్టువుల నొకరొకరిఁజెట్టవట్టి కడకు రాదిగుచుచు వారు తమ్ము నానికి ధర్మంబుగాదని వాపోవుచు నొకకేల మాతృకంఠంబు విడకనొ క కేలనొడ్డించుకొన్న నొడ్డారంబుమానక గండ్రగొడ్డంట నన్నలువుర శలజ డ్డిగంబులు ద్రెవ్వఁచిన దిగువంబడ్డ తత్కళేబరంబులపై వ్రాలి వారిబిడ్డలు

నిల్లాండ్రు కన్నీరుమున్నీరై దొరఁగ నురంబులు శిరంబులు మోదికొనుచు బహువిధంబుల విలపించుచు కట్టాయిట్టిశోకంబెట్టు భరింపఁగలవారము రామా పరశ్వధంబుననే ఇఁక మావధంబునుంగావించి యధిపులం జేర్చియధిక పుణ్యపదంబునంబొమ్మని వేడుకొనిన నట్టిక్రూరకర్ముండ నౌఁగదా యని శోకించువగ రైణుకేయుండు దల్లికిఁ బ్రణమిల్లి యమ్మా భావంబున నిష్టదైవంబు దలంచుకొమ్మనిన యమ్మానిని నాకింక నితరదైవంబున్నదే యనిపలికి నమస్కృతిచేసి మహాత్మా మనోవాక్కాయ కర్మంబుల నీవ దైవంబని యుండుదుంగాని యొండెఱుంగ పురాకృత వశంబున నిట్టిమానసిక దోషంబనుభవించితి యీదోషంబు మరణాంత ప్రాయశ్చిత్తంబున నివృత్తంబుగావించి నాజన్మజన్మాంతరంబుల మీకే దాసినై పరిచర్య సేయుటకనుగ్రహింపుండని పునర్వందనంబు చేసి కరగత పరశుధారాభీముండగు పరశురాముం గనుంగొని కుమారకా క్షణభంగురంబైన యీశరీరంబునకుఁగా విచారంబు వలదు జనక వాక్యోల్లంఘనంబున రుక్మవదాదు లెట్లయిరిగదా నీవైనజనకవాక్యప్రతిపాలనంబున దీర్ఘాయుష్మంతుడవై కులంబు నిలుపుమని రేణుక పద్మాసనాసీనయై పుత్త్రా యన్యుల నియమింపక నాపతి నన్ను నియమించి మేలుచేసె జను చెదరక యుదరక ధారదప్పక యొక్కవేటునం దెగనరుకు నీనేర్పు చూతమను మాత తెగువసూచి తల్లి తెగనరుకమంచుఁ జంచలివే యీచేతులంచు పలపలకన్నీరునించి యొడలు గడగడవడక జమదగ్ని దురాగ్రహ దుర్గకుం బలివెట్టు చందంబున నెట్టకేలకు కేలికుఠారంబున రేణుక శిరంబు గరుక్కున దెగనరికిన తలమిడిసి యల్లంతటంబడి యోదత్కంఠ నాళంబున ఝల్లుననరక్తంబు వెడలునప్పుడు హాహాకారంబులు సేయువారును రేణుకవలన నేమిపాపం బిది యధర్మంబనువారును నిట్లయిన స్త్రీలకిఁకపాతివ్రత్యమతిదుర్లభంబనువారును ఋషులకింతరోషంబు చెల్లనే యను వారును పరశురాముం డతిక్రూరకర్ముండనువారును నెట్టిపాటొందినఁ దానేమి యిట్టిక్రూరకర్మంబున కొడిగట్టఁదగునే బ్రాహ్మణున కనువాడను వీరెక్కడి బ్రాహ్మణులు జన్మాంతరంబున బోయలను నాగను బోయ

లైనం దమవారిం దెగఁజూతురే యనువారును నిట్టియుత్కృష్ట కర్మంబున
జమదగ్ని సర్వజ్ఞుం డతఁ డెఱుఁగఁడే యిది మెట్టి ధర్మసూక్ష్మంబో యనువారు
నై రి యయ్యాశ్రమవాసులయ్యెడ గరుడగంధర్వ సిద్ధవిద్యాధరాదుల
తోఁగూడ బ్రహ్మరుద్రేంద్రాదులంబరంబుననిల్చి యాసాహసకర్మం బద్భు
తంబని చూచుచుండి రయ్యవసరంబున॥ చ॥ భళి భళి నిన్ను మెచ్చితి
నపారభుజా [illegible]మహామనీ । వలయు వరంబు వేఁడు మునివారణ నిచ్చెద
నన్న తండ్రి [illegible]। జ్ఞాజములాదు బ్రాలి మునిచంద్ర యొసంగుము జీవితంబుల।
న్నలకును నాదు తల్లికని నం జమదగ్ని ప్రహృష్టచిత్తుఁడై॥ గీ॥ వారివారితల
లు వారివారికబంధ। ములనమర్చబంచి మునివరుండు। గరకమండ
లూదకములు పైఁజల్లిన। సుతులతోడ బ్రతికె సతియునంత॥ ఉ॥ నిద్దురబోయి
లేచుగతి సేరజలోచన లేచినవ్వులే। ముద్దు మొగంబుతోఁ బతికి మ్రొక్క
పదానతుఁడైన పుత్త్రులం। దద్దయుఁ గౌఁగిలించి ముని దారలతోఁ దగ
సుద్దులాడుచు౯। నిద్దపువేడ్క నందఱిని నివ్వెర పాటున ముంచె నత్తఱి౯॥
క॥ విరిసోనగురిసె మొరసె। న్సురదుందుభు లపుడు మిగుల చోద్యములను
చుం। బరితోషంబున వేలుపు। దొరలెన్నిరి వందిమాగధులవలె నంత౯॥
క॥ జమదగ్ని యొసఁగ రాముఁ డ। కమితభుజాబలము సంగరాంగణవిజయం
బమరనరాజేయత్వము। నమరత్వము లోనుగాఁగ నఖిలవరములు౯॥ క॥
హరి శిష్యుండై సురరిపు। హరణం బొనరించి శివుదయ౯ దివ్యాస్త్రో।
త్కరముగనిగుహుని పైమ। చ్చరమున భేదించెఁ గ్రౌంచధర మొకకోల౯॥
సీ॥ అంతటఁ గార్తవీర్యార్జునుం డొకనాఁడు వేఁటలాడఁగ వచ్చి విపినవాటి। గజ
గండభేరుండఖడ్గాదిదుష్ట సత్త్వములను ఖండించి శ్రమము మించి। జమదగ్ని
యాశ్రమస్థలముఁ బ్రవేశించి యతఁడు విందొనరింప నారగించి। కామధేను
వుఁ గాంచి కలుగదో కో యిట్టి యావునావంటి జనాధిపతికి। నంచు నెంచు
చు ప్రగముసకరుగనతని। చిత్తమెఱిఁగి కుమారులుద్వృత్తులగుచు। రాముఁ
డటలేసివేళ నాశ్రమముఁ జొచ్చి। కామగవి దెచ్చి తనయింటఁ గట్టికొనిరి॥
శా॥ ఆవార్తల్విని భార్గవుండు పటురోషావేశ సందీప్తనే। తాగ్నివిర్యాత

దీర్చి। పంచవటిలోన సౌమిత్రి యుచితముగ। జాలనేరుపుతోఁ బర్ణశాల
గట్టి। వాస్తుహోమంబు గావించి వాసుదేవు। ప్రేమతోఁ గూడియుండె
శ్రీరాముఁడచట॥ మ॥ వనరాశిన్ వటపత్రశాయివయి మున్ వర్తింతువం
చుం జెవిన్ । వినుటల్గానికనంగనేరముగదా విన్నట్టులన్ దండకా। వన
వాసి న్వటపత్రశాయివగుచు న్వర్తింప నిన్గంటిమం। చును దత్పంచవటీ
నివాసుఘనభాసున్ గాంతురాయామునుల్॥ సీ॥ అటయొకనాఁడు మోహ
ముగ శూర్పణఖరా నిటునటు ద్రిప్పి హాస్యంబుచేసి। శ్రీరఘుపతిసన్న జేసిన
సౌమిత్రి యేమిశూర్పణఖ రావేయటంచు। గటకటా యిపుడైన గటిగెఁ
గామసనంచు మరియుచుజేరఁగా ముక్కుబట్టి। యేసీమసరసంబు లివియ
మ్మనెజెల్ల యనిన నీ వెఱుఁగవే వనితయింత। జాణవయ్యును మాసీమ
సరసమంచు। ములకరాచూలి పెదవితో ముక్కుజవిరి। చెవులుగూబల
తోఁగోసి చేతనిడిన। నరిగె మ్రొక్కిఁడి యోలక్ష్మణా యటంచు॥ గీ॥
అరిగిఖరదూషణాది దైత్యాధిపతుల। దర్పబలసంయుతులచతుర్దశ సహ
స్ర। రథికముఖ్యులఁ దెచ్చె సంగ్రామమునకుఁ। దద్బలంబుల చెండె కోదం
డధరుఁడు॥ ఉ॥ ఆహరివంశమౌళి ప్రథమాహుతిజేసెఖరుం బ్రభాతవే। ళాహ
తభూమి బాహుజ మహానల కీలలదూషణున్ ద్వితీ। యాహుతిజేసెన త్రి
శిరునవ్వలియాహుతిజేసెఁ దోడుతో। నాహుతిసర్గదోష. పరిహారముగా
విధిచోదితక్రియన్॥ సీ॥ అరవీడుకొప్పుతో నపరంజిచాయ చెక్కులధళాలను
కమ్మతళుకుతోడ। జాఱుపయ్యెంటతో జంటితై కెయలోఁగ గమకించుగు
బ్బజక్కవలతోడ। నడలెడుమోవితో జఘనస్థలిన్ర్మోయు మొలనూలి
ఘంటలమ్రోఁతతోడ। గిలుకుమెట్టియలతోఁ గలహంసముల దెల్వ నవుజాళు
వాలం దెరవతోడఁ। ఇనుసగవుమోముతోడను సిగ్గుతోడ। సొలపుచూపు
లతో నపై వలపుతోడ। సీతచను దెంచి కౌఁగిటఁ జేర్చె రాము। ఖరముఖవిరా
ము ఫీగనృంగాని ధాము॥ చ॥ ఖరరకారా కాండ కాండ మెదగాడిననప్పుడు పాకశాస్య
ము...। హారియు...ఘామను...విభీ...ను భూమిను తాకుచ ఫుట్టినంబులు। బరవశుఁ
డయ్యెఁ దిస్టవ ...బుసఁగాతుఁడు ... వు। ...ములనే...గాదసిన్ఁ

కన్నానలంటి యురంబు నాటు నే॥ గీ॥ శూర్పణఖ యంత దన నేర్పు శోభిలంగ। రామ
కర్పూరగంధిని బ్రణుతిసేయుఁ। గపటము నఁ దెస్తు నని దశకంధరుండు। పంపె
మారీచు జానకి భ్రమయఁ జేయ॥ మ॥ అలమారీచుఁడు నాతఁ గాంచనమృ
గంబై పర్ణశాలాగ్రత।స్థలి నానావిధ చేష్టలన్ మెలఁగ గోత్రాపుత్రి కా
లోచనం। బులకుంగ గ్గొను నుత్తమంబయిన సమ్మోదంబు చిత్రంబయో।
యిలలో నే వికరుం పపచ్చినముచే నింపొంద వీక్షింపమీ॥ శా॥ స్త్రీచాపల్య
ముచేతఁ దెమ్మనినుఁబో సీతాలతాతన్వితా। నే చందంబున లేడి వెంబడిసి
బోయెన్ రామచంద్రుండహా। తుం దా జానకి వాఁశిలిప్పుడుగదా దూరం
బు నేఁగెన్ భళీ। యాచోఁబోవలదంచు దెల్పె యనుజుండైనన్ సుధీశా
లిగా॥ గీ॥ అధపుఁడీరీతి వేడి చెన్నాడిపోయి। సీతకన్నుల ముందర చెలువుఁ
గులుకు। నంతమద మేమిటికి దీసి కన్నభంగి। శరము వైచె మృగంబు ల
క్ష్యంబు జేసి॥ సీ॥ శ్రీరామశరమున క్షితిఁగూలి మారీచుఁ డాసీత హాలక్ష్మ
ణాయటంచు। ప్రాలిన యార్తరావంబు చెవిసోఁక క్షితిసుత బెదరి
మూర్ఛిల్లి దెలిసి। యేమిసేయుదు నింక నెందుబోయెను నాథుఁ డెట్లవ్వ
నాదు వాక్యంబు వినక। మొదట నేఁ దెలిపితి మునులతోడఁ బ్రతిజ్ఞ గావిం
చునపుడె రాక్షసులతోడ। వలదు వైరంబటంచు నీవలనవచ్చె। దాన
విని ముక్కు గోసిన దాన నలిగి। ఖరుఁడు వచ్చిన ద్రుంచె రాఘవుఁడు నేఁడు।
రక్కసులఁగూడి సూడు మరల్పఁబోలు॥ క॥ ఈయెడ శాపసమేటికి।
నీయన్నను జూచిరమ్ము నీవనిలోనన్। గాయమ్ములబడినాఁడే।
మో యనవుడు లక్ష్మణుండు మగుడకు ననియెన్॥ చ॥ ఎఱుఁగవె యస్య
దుర్గమగిరీశు శరాసన ఖండ ఖండనం। బెఱుఁగవె రాజలోకభయహేతుభృగూ
ద్వహమాన మర్దనం। బెఱుఁగవె నిన్ను గాంచిన సమిద్ధకరాడజయంబు తె
ల్లనీ। నెఱిఁగియునిట్టు లెంచదగవా తెగవేయడె రాముఁ డరిన్॥ చ॥
దనుజుఁడు నేను నిస్సట వెతం బొగిలింపఁగఁ గూసె కానియు। మ్మనుకులుఁ
డెట్లు జీరడ సమాన బలస్వ్యుఁడుగాదె యంచనన్। జనకజ దోటి మాట విన
నైచదు రాఘవు నాడ గూనుచ। య్యనుజనుమన్న బావక సయి క్రియఁ

ల్పిన గోపగింపుచుర్॥ ఉ॥ వంచనజేసెడే తగినవాఁడని రాముఁడు నమ్మి యీఁపని । న్నుంచిచనంగఁ గాముకుని యోజన చేసెదవిట్టులైనయా । సింహనె యీశరీరమిక సీత యటంచును దాళలేకచే । లాంచలమూది నేత్రముల హోఁగఘుపిర యటంచుఁ జింతిలుర్॥ ఉ॥ కలకణాలక్ష్మణుఁ డింతయేల జననీ కాగానిదోసానసీ । పలుకుల్పల్కకు మమ్మ కంటఁ దడినింప న్నీతి గాదంచునా । పలుకున్నమ్మగదమ్మ యిప్పుడిదె నీప్రాణేశుఁ డేత్తెంచుఁబో । వలెనన్న న్వడిబోయివచ్చెద ధృతిన్వర్తిల్లు మజ్జాననా॥ క॥ అని యుంపించుక చనుచుం । జన కాహ్లాదకమహీజ జాలములోని । ల్చినయటకుం జనివాంచెద।జనవా యని సీతవలుక చనెనతఁడంతర్॥ చ॥ అతను గర్తుఁడౌట దశలాపను మూఁడును జెందియంతనే।గతిగడలేకయాతురమగ్రై కొను రీతి యతీంద్రవేషుఁడై । గతిగలుగర్ స్మరించుహరి కంజదళాక్షహరే నృసింహసి । గతికపటంబుమీఱఁగ దశాస్యుఁడు జానకిఁ జేరియిట్లనుర్॥ సీ॥ ఘననీలవేణినీ కచపాళిమత్తాళి వత్సంబునకునైల్య భిక్షయొసఁగు । ముకురాస్యనీముద్దు మొగమురాకాచంద్ర బింబంబునకుఁగాంతి భిక్షయొసఁగు। గ్రమలాక్షి నీవాలుకనుదోయివలకారి బేసఁకుత్రాల్య భిక్షయొసగు । గుంభివక్షోజ నీకుచములు కనకకుంభికలకుశృంగార భిక్షయొసఁగు । రామయిటుగాన నీ యధరామృతంబు । భిక్షయొసఁగవె తృపితుండఁ ప్రేమనసిన। బెవరిశ్రీరాముఁడే శరభిక్షయొసగుఁ। దాళుమని సీత శాలికాంతరముఁజేరి॥ ఉ॥ అమ్మకచెల్ల మెవ్వఁడో నిశాటుఁడు భిక్షుక వేషమూనిమో । హాప్తునవచ్చె కాదన సమర్థులు లేరిట నేమిసేయుదం। చమ్మహికన్యచింతిల దశానన వింశతి బాహుదండఘో । రమ్మగుమూర్తిజూపి యలరావణుఁడంతట హుంకరింపుచుర్॥ చ॥ పరవశ భూసుతర్ రథముపై నిడి లంకకుఁ బోవునేళన । వ్యగ్రదను జెక్కయంబున రయంబున నొక్కటగ్రద్ధ్రరాజయీ । సురపతి మార్గమునంబోవ వ్రసుక్కక దాని వధించె గాని లో। నరయఁడు పోవు వెష్కపమూఁట దశాననుఁ డెంతమూఢుఁడో॥ క॥ ధరణిజను దెచ్చి ... । ఉపవనమున నిలుపి దనుజపుంగవ సాంద్రా । ట్యర

నీకనెందుదీర్తునే యిందువదన। వలిగుబ్బచన్నుల నెలవంక లుంతుగా
నీకనెందు నుంతునే హేమగాత్రి। పెన్నెరికొప్పున గ్రొన్ననల్ దీర్తుగా
నీకనెందు దీర్తునే యేణనయన। పికిలిచే చెక్కుల మకరికల్వ్రాతు
గానీకనెందు వ్రాతునే యిగురుబోణి। జలరుహాముప్పున గొత్తులు పట్టు
దాళి। లనఘనఖములు జూసితో యిదిసహింప। కన్యవనితాంగ తులితం
బు తాలతావ। కాంగసమములు గామినో హంసయాన। సీ॥ పటుసింహ
గర్జన భయముజెందని నన్ను పికనాదములు భయ పెట్టదొణగె। సుడి
గాడ్పులకు మున్ను జడియకుండెడి నన్ను లేఁదెమ్మెరలు సంచలింపఁజేసె।
దవవహ్నికీలల తాపమొందనినన్ను మించువెన్నెలదపియింపసాగె। ఖరయు
ద్ధమునను భంగమ్ముగాంచనినన్ను భంగంబు నొందించె నంగజుండు। గట
కటా విధి సైరింప నటవిగాన। కలదె నినుబాసినను దృణాగ్రంబునైనఁ
గదలగాదంచు ప్రాణనా కలిమి బలిమి। జీవదేహంబులును నీవె గావె
సీత॥ సీ॥ చల్లనిదరహాసచంద్రికల్ పైజల్ల జాబిల్లి వేడిమి చల్లజేసి। బలుకుల
కప్పురంపు పలుకులొల్కఁగబల్కి కలకంఠకటువచః కలనమాడి। తనుసౌర
భంబున దక్షిణానిలమున గలవిషస్పర్శన దొలఁగఁజేసి। భ్రూవిలాసంబుల
పుష్పకోదండ కోదండములన్ని ఖండనము జేసి। నన్నుఁబోషించితివి కాన
నంబులోన। నీవిపుడు లేమి యివియెల్లనిజముబూనె। కాకయుండినగలదె
యేకంబునందు। రెండు గుణములు నవ పుండరీకనయన॥ సీ॥ అనివిల
పించుచు నందందజానకి వెదకుచు నట గృధ్రవిభునిగాంచి। సంస్కార
మొనరించి చనుచో కబంధుని బాహులు బంధించి ప్రకటభక్తి। శబరి
యొసంగు పూజనములుగైకొని పంపాసరోవర ప్రాంతములను। హనుమం
తుతో మాటలాడి తన్మాత్రంబు వలన సుగ్రీవుతోఁ జెలిమిచేసి। యడుగు
బొటవ్రేల దుందుభి యొడలుమీటి। సప్తసాలంబునొక్క యస్త్రమునఁగూ
ల్చి। వాలిఁబడనేసి కపిరాజ్యమేలుటకును। గరుణ సుగ్రీవుఁ బట్టంబుగట్టి
యంత॥ సీ॥ రవి కర్కటముజేర రాజసింహము రాముఁ డలమాల్యవద్గిరి
కటకమునను। మీనకేతనగనుర్జ్యానాదపరిముక్త వృషభకేతన భీమ విశిఖ

మేప। యానకీలలనతులాదిచే జనక కన్యాళివేణీసమాయత్తచిత్త। వృత్తి
నుండంగ సుగ్రీవుండు తారా రుమామత్త కరికుంభ మహితకుచల। మమ
తతోఁగూడి మరకత మందిరముల। కల్పకారామ తులిత శృంగారవనుల।
స్వర్ణసౌధంబులను కేళి సదనములను। వేడుకలుగాంచె మిథున సంక్రీ
డనముల॥అంత॥ గీ॥భీష్మ గ్రీష్మ శిఖండిన ర్తితశిఖండి। కాననహుతాశిఖండి
మేఘప్రతాన। కల్పితవిధాన చిత్రశిఖండి యనఁగ। లక్షితంబయ్యెవాన
కాలంబుక్షితిని॥ సీ॥ నృపవరాస్థాన మంటప సరోవరము హోసంతికాహల్ల
కో జ్జ్వలితమయ్యె। మంత్రీంద్ర శిబికావమావఘాదవఃఘాద పరికల్పి
తనిచోళ పటముబూనె। చరమానవభుజాభుజంగంబు కేతకీ దళకలితా
తపత్ర ఫణమయ్యె। విరహిణీచిత్తంబు విరహితాశ్రయకాన నాశ్రితా
ళికి యాశ్రయత్వమొందె। విఘణికమలాక్షి యాఘణ వీక్షణముల। వడకెఁ
గనురెప్ప వ్రాల్చె మోదమునఁబొదలి। కేహమూకాస్య గోగణాక్రియ
నుగోగ। ణంబువసియించె నాసమయంబునందు॥ మ॥ గొనబాగింట పు
జంట గొంగడి ముసుంగుల్ వెట్టి సంకేతతా। వనికింగొంచపు చిన్కులో
పలనుబోవఁ వీధిలోనఁదళు। కైన యకాలమునందు గ్రామ్మెఱుఁగు
డాయఁ దన్ముఖాంభోజముఁ। గనియుం గానరు జారులఁ దలవరు ల్గా
ఢాంధకారాంధులై॥ ఉ॥ ఇమ్మెయిగ్రొమ్మెఱుఁగులు పయింబయిమించు ప
యోధరంబులుఁ। వేమరుగట్టి వాన కడువేగమెవచ్చు నటంచు నెంచితే।
నీమదికింపుగాదిచట నిల్వుమంటచును బల్కె బాంధునిం। గోపాలిమో
ర్తు తోడి యళికుంతలకుఁ మరుబెట్టినేర్పునఁ॥ చ॥ వడకెద వేటికేతడసి
వచ్చితి వలభ వానలోపలం। దడిసివడంక లేమ గృహనాయకు వంచనసే
యనింతగాఁ। దడసెద గావునఁ వడకెదఁ మఱియొగతిగీకు దోఁచునో।
మొడవనటన్న మెచ్చుకోని యెవ్వరిగూడె భుజంగుడత్తఱిఁ॥ సీ॥ ఆమ
రేంద్రముక్త మేఘముల దెచ్చు క్రమంబు రవణించమించు వాయువులవి
సరె। మబ్బుచేతనె వారి మరలింప వరుణుండు ధనువుబూనఁగ నింద్ర
ధనువుదోఁచె। దననైల్యమునదండి తనుకాంతి దండింపఁ గదలెనాఁగ

వలాహకములు నడచె । నానటన్నీలకంఠ జటాచ్ఛటల నాగ తోలుకాఱు మెఱుఁగులు తులకరించె। జలదకరిశంక గర్జించు సమయసింహ। గర్జలనగర్జితములొప్పె గగనకరటి । సాంద్రరుధ ధారలనఁగ వర్షంబుగురిసె । వనధిపైకొన పొంగుమునను నదులు॥ ఉ॥ తే తేలక్ష్మణ విల్లునమ్ములును దేతే తామసంబేటికిం । దైతేయుండఁదె పోయెపోయె మనసీతంగొంచు నంచున్నిజ । భ్రాంతిఁ వేఁడుచు దత్తరించె రఘువీరస్వామి యుద్ధామజీ । మూతద్రక్షకై తఘుస్కనిఁ మొరసె సొంపుల్లుల్కి విభ్రాంతుఁడై॥ మ॥ మనపై మూకలు గూడివచ్చెదితిజన్మస్తోమము ల్గంటె భ । ర్జనలుంజూప విజృంభణంబు జయనిస్సాణ ధ్వనుల్లక్ష్మణా । యనినఁ రాముని జూచి లక్ష్మణుఁడు గాదయ్యా విలోకింపుమా । ఘనముల్గర్జన లింద్రచాపమును నిర్ఘాతధ్వనుల్ రాఘవా॥ మ॥ అదెగర్జింప్రమఁ జిత్రవర్ణ సుమబాణాసంబు భాసిల్లఁగా । మదనుండేసె శరప్రకాండముల దెమ్మా విల్లు వీనిఁహారిం। చెదనన్నఁ రఘురామ క్రొమ్మెఱుగులువచ్చెఁ గాని మారుండుగా।దదియింద్రాయుధ మింతెచెప్ప విలుగాదఁ లక్ష్మణుండయ్యెడఁ॥ సీ॥ ఘనగర్జ వినియుల్కి ననుగాగిలించిన వెరువకుమనినచో వింతసొలపు । జడిసినీనడలకు వెడవెడరాయంచ లనినచో ననుమెచ్చుకొనెడుప్రేమ । కొప్పున మొగలిరేకులుజెక్కి మెఱుఁగుతో మొగిలనగ ననినచో నగుబెడంగు। నెమ్మినీనెరివేణి నీలాహియని గ్రసింపఁగ జేరెననినచోఁ దళుకుచూపు। మఱువరాదిక మున్నిటి మహితలీలిదిగో । చెల్లయిప్పటి కిటువలెఁ జేసెదైవ। మిట్టిదుర్దినముల సీత యేమియయ్యె। నోర్కొతమ్ముఁడ నెటువలె నోర్చువాడ॥ మ॥ అవిచింతిల్లగ లక్ష్మణుండనినయె నన్నాకంటివే మేనుమఁ । దనస్వర్ణంబులనెల్ల గాత్రికిడి యుంట — వంతచేవెల్లనై। ఘనదాశఁజనెఁ దొల్లియెల్లెడల గోత్రందస్త్రమా క్రిగ్గియుఁ। జనెఁదొంగ్రాలిక నాతకెమ్యెడల శశ్వత్కీర్తి సంధిల్లునే। సీ॥ క్రిసిమానరావణ రాజ్యలక్ష్మియుఁబోలె నెండుండి నిమ్మగలింకఁ బారె। విజయుస్వామునుచు దీపింపఁగానే తెంచు కైవడిదోఁచె నగస్త్రయిసూ.ఱ।స్ఫవిసినుకే గ్గిసంపఁబోలి యెల్లెడ నుల్లసిల్లెనుతెల్లు పిల్లు

బెజ్జఁగి। తానును హంస సంతతిగాన సాహాయ్య మడరించుబలె నంచ లరు
గుదెంచె । నాశరస్ఫూర్తి నటువలె నతిశయిల్లి । సింక నీదు శరస్ఫూర్తి
హెచ్చ చేయ । కేలఁ గురియించె దివ్యాస్త్రవృష్టి పైరి । బలములఁ దదీయవనిత
లగలుగఁ జేయు॥ వ॥ అని సౌమిత్రి తిరస్కారోక్తి దోడుకొని రాఘవ భోజనీబంధునం।
దనుఁడే తెంచె నవలి ముఖ్యప్రముఖ నానాసింహనాదార్భటీ జనిత ప్రతిధ్వనిశబ్ద
సూచిత భవిష్యద్దక్షిణాంభోదిబంధ । ధనవేళోద్ధరణ క్రియాకుల సముద్రస్థితా
ధరాక్రోశుఁడై॥ క॥ ఏతెంచి నల్గుదిక్కుల । సీతాసతి వెదకి ప్లవగ సేన
బనుపుచో । సీతాపతి హనుమంతుని । చేతికి ముద్రిక యొసంగి శీఘ్రంబ
నుపఁగ॥ మ॥ అతఁడు పొంగుచు నంగదాది కపిసారంగాచ్ఛ భస్తేంద్రసం
గతుఁడై దక్షిణ దిక్కునం జనుచు రంగత్పక్ష సంపాతలసం । వృత సంపా
తిఖగోక్తమార్గమున నుర్వీకన్యకాలోకనో । ద్ధతుఁడై యొక్కమహేం
ద్ర శైలము పరున్మార్గ స్పృహత్వాలముల్॥ సీ॥ నిలిచి యంఘ్రుల
దన్ని నిగుడుచో గిరిఘటోద్భవ పదన్యాస విన్ధ్యాద్రిబోల । ఘట్టి
తాలపుటంట పిట్టకై వడియుచో ఘట్టనలెక్కల ఘట్టుగూల । సురసా
ర్థకృతమహత్తరసూక్ష్మతర రూపములను హరిత్వంబు విలసితముగ । సం
జనాసంతతి యురుడుసింహికనొంచుటని సిలింపుల గుంపు లభినుతింప ।
రాముచే దైత్యుఁడీల్గుకార్యంబు దెల్పె। విశ్వసింపుము నామాట వేల్పులార।
యనుచు బాడబలంఘనసమాచరించు । పగిదినౌర్వాంబుసిధి దాఁటెఁ బవ
నసుతుఁడు॥ ఉ॥ ఏపున నాసువేలగిరి యెక్కి యచట న్నతయోజనోన్నతం ।
బై పదియాఱువన్నె చెలువైన త్రికూటముమీఁద సింహళ। ద్వీపమునన్
బలారిముఖదేవభయంకర దీప్తిశోంపులం । కాపుర రాజ్యలక్ష్మి తటకావ
డి చూచుచున్న నత్తతిన్॥ మ॥ రవియస్తంగతుఁడైన సూక్ష్మతను డై
రక్షోధిరాట్పట్టణాం । బవలీలం జొరఁ జారి పక్షిముఖి పంఖ్యానేక దీప
ద్వీప । ద్భవనశ్రేణుల నెల్లెడన్ వెదకి సీతంగానఁగాలేక శో । కపని
బావని గాంచెఁ బావని మహాకన్యం బ్రహృష్టాత్ముఁడై॥ క॥ కనుఁగొని తన్ను
గగుఱుపులు । కనఁగొని యటవచ్చి పక్షికంధరుఁ డనియో । యనమాట

లువినినవ్మిక । జనకసుతంజేరి మ్రొక్కి సవినయుఁడగుచున్॥ గీ॥ తల్లిజా
నకిని ప్రాణ వల్లభుండు । శ్రీరఘూద్వహుఁడనుజసుగ్రీవముఖ్య । యూధత
తితోడ సుఖమున నున్నవాఁడ । టంచు శ్రీరాము నంగుళీయక మొసంగె॥
క॥ కైకొనికన్నుల నొత్తుచు । హాకాంత రఘూద్వహాయటంచును బ్రణ
య। వ్యాకులిత చిత్తయై క్షో। ణీకన్యకయిట్టులనియె నివ్వెఱతోడన్॥ శా॥
అన్నా యేగతి దాఁటివచ్చితివి నీవంభోధి సేమంబుతో । నున్నారా రఘు
రామ లక్ష్మణులు లంకోద్యానమధ్యాసమున్ । విన్నారా దశకంధరాధ
మురణోద్వేంగూల్చు కార్యంబులో । కన్నారా వినిపింపు నీకుశుభమౌ
గాకంచుఁ దన్వేడినన్॥ మ॥ తనవృత్తంబును రామలక్ష్మణుల యందంబు
న్వివస్వత్సుతు। రునిసఖ్యంబును దెల్ప భీమతరమౌ రూపంబునుం జూ
పిసీ। తనునమ్మించి శిరోమణిం బడసి యాతల్లీముదంబుండఁమీ। యన
ఘున్ రాముని దెత్తునేయని తదీయాజ్ఞాను సారంబునన్॥ గీ॥ వెడిలియవ్వని
లోపల వృక్షవితతి । విరిచిపువ్వులువేసె నవ్వీరవరుఁడు । లంకభస్మం
బుసేయువేళకును గావ్వ । జాలమునుగూడ వేసినచండమొంద॥ గీ॥ అం
త వనపాల పంచసేనాధినాథ। సప్తమంత్రి సుతాక్షశిక్షా ప్రవీణుఁ। డైనహ
నుమంతు నింద్రజిత్తును నెదిర్చి । బ్రహ్మశరపాశమునగట్టి పట్టితెచ్చి॥ గీ॥
తండ్రిముందర బెట్టి యాదానవేంద్ర। కోఁతిదెచ్చితి ననఁబోయి కోఁంవి
దెచ్చి । నాడననవుడు ముక్కులు నలుచుకొనిరి । కొలువువారెల్లనపు
డు పక్కునను నగుచు॥ క॥ కరువలిసుతుఁ డిట్లనియెం । గొరవినగుదుని
పలాశ కులముదహింపన్ । సురవైరి సత్యవాణిని। సరస్వతి యనంగవిన
మె సత్యంబనుచున్॥ ఉ॥ శ్రీరఘువీరచంద్రునకు సీత నొసంగియభంగవై
భవో। దారుఁడవై చెలంగుము దశాననయంచును బుద్ధిచెప్పినన్। మారు
తితోకచూడుమనె మండుచు రావణుఁ డౌరసమ్మతిన్ । జేరిమదాంధచి
త్తునకుఁ జెప్పఁగఁ బోయిన హానివచ్చుఁగా॥ ఉ॥ శ్రీజనకేంద్ర నందనకు
జిత్తమురంజిలఁగంభరాగవి। భ్రాజితకీలకాభినవపంకజపూజలొనర్చి కేళికా।
రాజితవాలకీలి నలరావణు లంకఁదగల్పఁ జేసెసీ। రాజన మెంత భక్తుడప్పు

శాహానుమంతుఁడు క్షోణిపుత్రికిన్॥ మ॥ దనుజానీశ పురంబుఁ గాల్చి మహి
జాతం గాంచి వాలాగ్నివా । ర్ధినిఁ బల్లార్చి కపీంద్రులం గలసి యంతే వేగ నే
తెంచి నే । కనుఁగొంటిన్ రఘువీర జానకిని లంకాపట్టణాభ్యంతరం । బున
నంచున్ హనుమంతుఁ డిచ్చె ధరణీపుత్రీశిరోరత్నమున్॥ క॥ ఇచ్చినఁ గై
కొని మారుతి । మెచ్చిన కౌఁగిటను జేర్చి మిహిరకులేశుం । డచ్చెపనగు
బలములతో । పచ్చన్వారాశితీరవని జేరంగన్॥ క॥ శరణాగతుఁ దశ
కంధర । శరణాగతుఁ డనకు యనఘు సద్గుణహాసిం । ధరణిన్ విభీషణుఁ గను
గొని । భరణంబుం జేపట్టె రామభద్రుఁడు ప్రేమన్॥ ఉ॥ కట్టడు వారిరాశి
లయకాలధురంధరుఁ బట్టెఁ గంధరుం । గొట్టడు మాతనమ్మునను గుంఠితనైజ
భుజా బలంబు చే । పట్టుగ నవ్విభీషణుని సారకృపాపార సమూరలంకికన్ ।
బట్టముఁ గట్టె రాము జనపాల శిఖామణి రాజమాత్రుఁడే॥ ఉ॥ అంత
విభీషణోక్తగతి యంబుధి చెంత దినత్రయంబు తా । నెంతయు భక్తి
దర్భ శయనించి నిరాహృతిమైఁ ధరాసుతా । కాంతుఁడు ప్రోవయిమ్మని
యకంపిత చిత్తముతోడ వేఁడినం । లంకకు నుబ్బు నాధిఁగని యారటు
వీరుఁడు దగ్రకోపుఁడై॥ సీ॥ కుంభకర్ణస్ఫూర్తి కొమరొందనం జంగ జల
కుంభ డింభము ల్పాదడింప । మేఘనాదనిరూఢి మీఱుచున్నుల్లోల కల్లో
లజాలముల్గడలుకొనఁగ । నతికాయ విభ్రమం బతిశయిల్లఁగ తిమింగిలగి
లాదివిసాగకులము బొదల । పటుమహోదర మహాపార్శ్వ వైఖరివారి
చరజంతు సంతతుల్చాకళింపఁ । బ్రతిఘటించిన రావణు బలముఁబోలి । యొదు
టఁగనుపట్టిగంటివె యీపయోధి । తెమ్ము లక్ష్మణ చాపంబు తీవ్రవేగ ।
రూపరోషంబులను వార్ధి రూపడంతు॥ వ॥ అని హంసడోలికాయమాన
కల్లోల పాలికాశాలి శాలికావాలరింఖోళికా సముత్పతత్ జ్ఝంకృత మాలి
కా కల్పిత గగన కేళికాలోల మరుద్వాళికా చూళికా పాళికా ఘనమాలి
జాలకా దుర్నివారంబగు పారావారంబు నిరీక్షించి ప్రసరి ప్రసరి ప్రవర్ధమా
న రోషంబున బరాపటలికన్న ముందర ముకిఁగొను కుటిల భ్రూభంగంబును
దూశీరాంబకంబులకన్న ముందుగఁ గొప్పలగు నిప్పుల కుప్పల క్రొక్కారు

విశాలాంబకంబులును తటినీ విట వ్రాత్పుటంబుకన్న ముందుగ తట తట
నదరు కటకటంబులును దుర్వారమౌర్వీనినాదంబుకన్న ముందుగఁ బర్వ్వ
రథసంఘర్ష కటుతర కిటకిటధ్వనులు వెలయ నిజసహోదర కరోదర కలిత
శరశరాసనంబు సొలసి పుచ్చుకొని భవిష్యజ్జలధి శిరో నమనసూచకం
బుగా కార్ముకంబువంచి యప్పుడుమరలించు మరలించుమని పొగడదండ
వేయు క్రమంబున కోదండంబున నారిసారించి లంకాంతరీప దనుజ
గార్భిణ్య గర్భ నివారణ మన్త్రాయ మానంబుగ గుణధ్వానంబు చేసి
యిటువలె శరధీ శరంబులు రిత్త సేయుదుననువలె జటుల తరవత్కాంస
లాంసరుచిర శరధీ శరంబు లొక్కపరితివిచివైచిన యంతకునుపొంగు
శరధీ శరంబులంబోలి నిజశరధీశరంబు లక్ష్యయంబుగాఁ దొడిగి యేయు
చుండ నప్పుడు ధారాశుద్ధి వెలయు వారాశి నీరంబునకు లంఘించు కాండ
ప్రకాండంబులును జలధి రాజన్యుండు వదాన్యుండని జలకరి కరభంబుల
వేడుకొన నిగుడు మార్గణ గణంబులును జలకన్యకా ముఖాంభోజంబుల
ప్రాలు శిలీముఖంబులును మకరప్రాణ సమీరణ పారణంబు సేయుమహా
జిహ్మగంబులును వనాంతరంబుల నెల్లెడం జొచ్చి వర్తించు పృషత్కం
బును పొడవంజాలఁజొచ్చి చను విశిఖంబులును జలపాయి తోదయం
బులవారించు యాశుగంబులను మణిమాంసాపేక్ష ఫణిఫణంబు లందును
శంకపత్రసముదాయంబునుంగలిగి ప్రళయావసర ప్రకటీభవ దేకభావ సకలా
కూపార వారిశోషణ ప్రణవ ద్వాదశ ద్వాదశాత్మా దారుణకిరణ శ్రేణికా
ఘుకేణంబులై రామబాణంబులు దీర్ఘనిర్ఘాత సదృశలింగంబులగు విస్ఫులిం
గంబులు చెదర వారాశిం జొరబాఱిన రఘువీర శరఘాతద్యోత దంభోళి
పోత భీత ఫలాయమానంబు లగుచు శతశః కణశః ఛిన్న భిన్నంబులగు
నంగంబులును రఘునాయకు సాయకంబు లేచాయ నిగుడునోయని నిర్ని
మేషంబున గనుంగొనుచుండి యఖండ ఖండంబులగు నగండక సముద్దండ
పాఠీన మండలంబులును దలలు దాఁచుకొనియునుం దప్పలేక తెప్పలుగాఁ
గూడు కమఠకర్కటంబులును ముడిగొనునవుగుల నెడనెడం దడబడుచు

చుట్టలు చుట్టుకొని చిట్టారలు భుజంగంబులును నారాచంబులు నాసా
రంధ్రంబులం దూరి శిరంబుల కెక్కిన నడలి తుండంబు ద్రిప్పుచు ఘీం
కృతులు గ్రిప్పుచు గుప్పదెప్పనంగూలు జలకరి ఘటాలునుఁగలిగి రత్నా
కరంబు హల్లకల్లోలమై యుండె మఱియును॥ సీ॥ జలనీలికా శిరోజశ్రేణి
బెదరించి చంకనత్పంకజాస్యంబుదూసి। కలితముక్తారదావళి సగ్గుగావిం
చి ప్రకట ప్రవాళాధరంబుజెంచి। శంఖకంధరనాటె శైల్య శృంగారఁస
ములనొంచి భుజగబాహులు దళించి। కమఠవక్షః స్థలిగాడిభ్రమీనాభి
యవియించి కరికరోరువులుచీల్చి। మనుకులశరంబు లాపాద మస్తకంబు।
ముంచుకొని భువన మోహన మూర్తిగలప। హతమహాసత్త్వమయ్యును
బ్బడగదయ్యె। నమృతనిధిగాన ప్రాణభయంబు లేదొ॥ ఉ॥ ఇటులుపొం
గ నభంగభంగజలధిన్ వీక్షించి రాజేక్షణా। స్ఫుటదంభోజభవాండము
డాచు ఖరరక్షోహర్త బ్రహ్మాస్త్రముల్। ఘటియించెన్ దనమింటవింట
గల మూకల్వీనె నూగెన్ సను। త్కూటశైలంబులు వేగమూఁడు జగము
ల్బ్రాగెన్వార్ధి స్వాంతముల్॥ గీ॥ చకితుఁడై యంత గంగాది సుతులతో
డ। నబ్ధియేతెంచి రత్నోపహార మొసఁగి। జానకీజానిపాదాంబుజాత
యుగళి। కవని సాష్టాంగ మెఱఁగి యిట్లని నుతించె॥ సీ॥ శ్రీజానకీనాథ
రాజీవ సారంగరంగదభంగ శౌర్యప్రచండ। చండకరాన్వయ జలధి
పూర్ణ శశాంక శంకరధనురహీశ్వరసుపర్ణ। పర్ణమూలాశితాప సమా
నసవిహార హారాదిభూషణోదార వత్స। వత్సలతాగుప్త వనజాప్తతను
జాత రూపాంబరోద్యోత మానమాన। మానవాశనగర్వ శిఖానిదాన।
దానజలవాహినీపూర్ణ తమనదీన। దీన జనవాంఛితార్థప్రదాన దక్ష।
దక్షజానుతనామ కోదండరామ॥ సీ॥ తనసహోదరున కిత్తరి నెట్టిగతి యం
చుఁ దల్లడింపుచు గౌరి ధవునిఁజేరెఁ। గద్రువపుత్రశోకంబు నేగతిమాన్ప
నగునంచు కశ్యపుఁ డడిగెనజునిఁ। దనపౌత్రుఁడేమి యయ్యెనొ బలీంద్రుఁ
డటంచుఁ బ్రహ్లాదుఁ డెంతయు బలవరించె। గిరికొనుచింతచేఁ గిటికూర్మ
రూపముల్సంహరింపఁదొణంగెఁ జక్రపాణి। నీశరాజులు నాసిరునీటఁజేసి।

మీఱజే పాంతాళలోకముల్దూఱునపుడు । లోకసంరక్షణైక లోలుండవయ్యు। దగునె నీవింతసేయ సీతాపహారము॥ గీ। అని నుతులు చేసి ఘనభూమి నజుని యాజ్ఞ । గంబుపరపించి సేతుబంధంబునకును । నలుని నియమించి చని యెు నట్టలసైనలుండు । గపులు దెచ్చిచ్చు గిరుల చేఁగట్టునపుడు॥ మ॥ ఒకచేఁ బట్టెఁడు నెంతగట్టు నితఁడంచు(గ్రాత్ముఁడై గంధవా । హకుమారుండట యుత్తరంబుగన దేవాహార్య మేలంచు భూ । మిభృన్మారీ వరుఁ డన్నవ ద్గనక నేమీ తెచ్చుగాకంచును । త్సుకుఁడై కట్టెనలుండు వారధినురస్తో త్రైకపాత్రంబుగన్॥ మ॥ మును సుగ్రీవునకున్ విభీషణునకున్ మోదంబు తోఁబట్టముం । దనుఁజేసంగని కట్టెనంచును సముద్రంబుందనుం జేరశో। భనలీలన్భువనాధిపత్యము నకుం బట్టంబుగాఁ గట్టెనో । జననాథాగ్రణినాఁ గ సేతువమరెన్ సాముద్రగోత్రస్థలిన్॥ మ॥ హరిసంఘంబులు గొల్చిరా సనసవాత్రోద్ధత్య సంరాధుఁడై । ఖరశస్త్రాండసమాస్త్ర రీతి వెలయంగా మాతురుం బత్త్రికం । ధరు నత్యుగ్రదశాస్యుఁ జేయుటకు దోర్దర్పంబు న్నాదైత్యారా । ట్పురముం జేరెను హంస సంతతి నుతుల్వ్యాంగార శృంగా రైరి వ। ఇవ్విధంబున రఘునాథుండుపాథోనిధిం దాఁటి యనేకబల జాలం బులతో సువేలనగరంబునఁ బాళెంబుడిగిన శుకసారణులువచ్చి చూచి చని రామలక్ష్మణ సుగ్రీవ మహాబలనందనాదిబలంబుల పేరువేరు విన్నవిం చినవిని నిశితక్రూరకటాక్షంబుల నాక్షేపించుచు జిహ్వాగమనద్విజిహ్వాని విద్యుజ్జిహ్వునిం బిలిచి మాయ సేయ నియోగించి యుద్ధరాత్మండు వద్ద రా రావణాయనక తుహనా రఘూద్వహుని శిరంబును నశరాసనంబునుంగా దెచ్చి సీతముందరం బడవైచినంజూచి యుల్లంబునఁ దల్లడిల్లి పెల్లడలు పొడ మిపత్నికి నవిశలని దెల్పు చరమవాక్యంబుల సముల్లాసముగాఁ గాంచియుండె నంత। చ॥ ఇవకులుఁ డాసువేలగిరి నెక్కి కనుంగొనియున్న నయ్యెడం । బనిగొని కుంచ గిండియడపంబును పావడలూని వేల్పుజ । వ్వనులిరగ్రే వలంగొలువ నన్నియుఁగాఁ గొలువున్న రావణుం । గని పడఁదన్నివచ్చె భుజంగ్రయమునన్ రవిపుత్త్రుండ త్తఱిన్॥ క। పడమట ననిలజుదూరుపు। కడ

నీలునిదక్షిణమున గపిరాజసుతుఁడున్ । విడియించి యుత్తరంబున । విడిసి
రఘూద్వహుఁడు సామవిధితత్పరుఁడై॥ ఉ॥ అంగదుఁ బంప నాతఁడుర
యంబున లంకకుఁ బోయి ప్రక్రియన్ । దనిగని దుర్మతి మహీతనూజను రాము
నకొప్పగించినీ । యుంగము సిల్పు కొమ్ము వలదావల దానవవైరి వీడఁగాం ।
చంగలవంచు నక్కలుపు సౌధముగూలఁగఁ దన్ని వచ్చినన్॥ లయగ్రాహి॥
సంగరము గ్గలైనని యుంగములు మిక్కిలి యుప్పొంగ కరయుఁబునను బుం
గలిదుముకన్ వే । బంగరపు కోటలతుదంగల్గు మానికపు శృంగముల కెక్క
చునలంగముల పైకిన్ । చంగునను దాఁటుచు తురంగముల రీతియు తురంగము
లభాతి యుబలంగగనభంగోత్తుంగ భుజసత్త్వము వోసంగగఫ వంగకులపుం
గపులతోఁగూడ నాలంగిరట వేడ్కన్॥ అంత॥ సీ॥ స్మరహరాదకసురాన్వర
దురావద ధరాధరమహాక్తిగ రథోత్కంఠయుతోడ । మదవదాయత సదా
స్పదపదావదఘనాంగదమదావళరాజ ఘటలతోడ । మృగనాయాది
తరయాహ్వాతి జయాహాత భయావహ హయోత్కృత్తమావళుల తోడ ।
నలికులానలవలాహక బలాహిత బలార్ణవకులాచల భద్ర తతులతోడ ।
నసురనాయకు లెదిరి శస్త్రాస్త్ర వృష్టి । గురియ నగధారులై యెదురొ్క
నిరికపులు । ద్వంద్వ సంగ్రామమయ్యె నత్తఱి నిమేఘు । నాదుఁడంగదు
కికురించి నభముఁజేరె॥ క॥ భవపాశమోదనుల రా । ఘవులన్ దశకం
ఠసుతుఁడు గట్టెన్ గద్రూ । భవపాశంబుల గరుడుం । డదియుడిపె నద్దమ
ముమాన్పు రవియుంబోలెన్॥ గీ॥ అంతహనుమంతు చేత ధూమ్రాక్షుఁ
డీల్గె । నవికంపనుఁ డతని చేత నె యడంగె । వాలినందనుచేఁ గూలె
వజ్రదంష్ట్రుఁ । డనిలపుత్రుని చేతఁ బ్రహస్తుఁడీల్గె॥ అప్పుడు॥ మ॥ రణని
స్వాన ధణంధణ ధ్వనులచే బ్రహ్మాండము వ్రీటరా । వణుఁ డేతెంచి శితా
స్త్రపఙ్క్తి రవిజున్ వారించి యయ్యకుశి । తుఁ బున్నొప్పించుచు నీలునిం గ
దిసి దోశ్శౌర్యంబు వాటించి లక్ష్మణుశక్తిం బడవైచి రామవిభుపైఁ స్త్రా
ళివర్షింపఁగన్॥ మ॥ అలుకన్ రామనృపాలశేఖరుఁ డధిజ్యంబైన వింటన్
శరం । బులు సంధించి ధ్వజాశ్వసారథి రథంబుల్గూల్చి మాణిక్యమా ।

ఘుటశస్త్రింబులు గ్రమ్మ శత్రుభయ మాలోపిటికిం బొమ్మనం । దలవీడం బరువెత్తె రావణుఁడు సేనల్కకన ల్గొట్టఁగన్॥ చ॥ ఇటువలె లంకఁజేరి దనుజేశ్వరుఁ డంతటఁగుంభకర్ణుచం। పుటయును వాఁడు నాకసము భూమి యునిండిన కొండ మెందున్ । బటపటనార్చుచుం గపులఁబిట్టుక మ్రింగుచువచ్చిభానుజ త్రుటితనాస కర్ణుఁడయి త్రుంగె తుదన్ రఘువీరు తూపులన్॥ గీ॥ నెనరుగల్గిన యన్నను నిదుర లేపి । పనుపవచ్చిన కుంభకర్ణునకు దీర్ఘ। నిద్రయొసఁగె రఘూత్తమ నిశితమార్గ। ణంబులదిపక్షపాతుల నంగరాదె॥ గీ॥ అంతదేవాంతకుండు నరాంతకుండు। త్రిశిరుఁడతికాయుఁడునువింశతిభుజ సుతులు । దగ మహాపార్శ్వుఁడును మహోదరుఁడనంగ। వెలయు పినతండ్రులనుగూడి వెడలిరపుడు॥ సీ॥ రంగదభంగశౌర్యమున నంగదుఁడప్పు డంగదుండనియె నరాంతకునకు ।. దేవాంతకుండును త్రిశిరుఁడంగదవైరి హనుమంతుచేతి మహాద్రులకును । భుజమహోదరవహ్నిపుత్రుచేభిన్న మహోదరుండయ్యె మహీధనుండు । వృషభునివలన నివేశితుండై మహా పార్శ్వుఁడయ్యెను మహాపార్శ్వుఁడొకఁడు । సంగరముచేసి యతిఘోర సంగరమున । గపులఁబెక్కండ్ర జంపి నాకపులు పొగడ । నంత నతికాయుఁ డతికాయుఁ డయ్యెలక్ష్మ । ణప్రయుక్తవిరించి బాణప్రహతిని॥ ఉ॥ అంతటనింద్రజిత్తు సమరాంగణ హోమముచేసి వీతిహో। త్రాంతర సీమ వెల్వడు మహారథమెక్కి పయోధరాధ్వ సం। క్రాంతిచెలంగె వైధస శరంబున షష్టిసహస్రకోటి వి । క్రాంతకపీంద్ర లక్ష్మణుల రాఘవుమూర్ఛిలనేసి నవ్వుచున్॥ చ॥ గెలిచితి రామలక్ష్మణుల కీశుల నంచు మహాట్టహాసము। ల్సలుపుచు నింద్రజిత్తు చన చయ్యన బ్రహ్మాసుతోపవిష్టుఁడై । మలయక వేగ నేగి హనుమంతుఁడు మందులగట్టుదెచ్చి వా । రలకుజ లెల్లమాన్పె రఘురాముఁడు మెచ్చుచు గౌఁగిలించుచున్॥ అంత॥ మ॥ ఖలుఁడారావణుఁ జేరియుండెనని యింకాదీనిగై కొండు ని । ష్కలుషుండైన విభీషణుండనుచు లంకన్ శుద్ధిగావించి ను। జ్జ్వలకీలానల ముందగల్చి కపిరాట్సైన్యంబు హాహారవా । కులదైత్యాళి తదంతరా

[illegible]లన్ క్షోభించె నత్యుద్ధతిన్॥ క॥ కుంభుఁడు సంస్ఫాలిత భుజ । కుంభుఁడు పురివెడలె మఱి నికుంభునితోఁడ। త్కుంభచ్ఛదకు దివాకర । సంభవదోర్దండ మప్పుడు చండంబయ్యెన్॥ గీ॥ తోడఁబుట్టిన కుంభునిఁ జేర నేఁగి । నలనికుంభుండు నంతట ననిలసుతుని । చేతనంపించుకొని మైందు చేతశోణి । తాకు ద్వివిదునిచేత యూపాక్షుఁడరిగి॥ క॥ మకరాలయ బంధన రా । మకర శశరాంక శస్త్రి మహితురుపోద్ధా । మకరాక్షుఁడ గుచుఁగూలెన్ । మకరాక్షుఁడు దనుజసేన మల్లడిగొనఁగన్॥ అంత॥ ఉ॥ జంభవిదారివైరి కృతసంగరుఁడై రఘువీరరోషసం । రంభము జూచి నిల్వక పరాజితుఁడై కుహనామహీసుతా। లంభమున న్మరుత్సుతు దొలంగఁగఁ జేసి యఁటన్నికుంభిలా। కుంభిని దీక్షఁగై కొనుచుఁ గొబ్బునహోమము సేయుచుండఁగన్॥ మ॥ హనుమంతుం డటపోయి యశ్రువులతో హారామ హారామయం । చును శోకింపఁగ సీతచంపిచనె నచ్చో నింద్రజిత్తుండటం । చును దెల్పన్ విని హావిదేహ సుతయంచున్ మూర్ఛిలెన్ రాఘవుం । డు నివారించెఁదదీయమూర్ఛ ననుజుండున్ యత్నపూర్వంబుగన్॥ ఉ॥ అక్కట నేఁడు సీదగునవర్థముఁ దెల్పెను నిట్టులైననే। నెక్కడ జొచ్చు వాఁడ నిఁక నెవ్వరిఁజంపిన నేమియంచుఁడా । వెక్కుచులక్ష్మణుండు పలవింపగ రాముఁడు చేరి యాగతిన్ । బొక్కపడన్ విభీషణుఁడు భూసుతమేలు వచించి యిట్లనున్॥ చ॥ ఇనకుల యాంజనేయు భ్రమయించి నికుంభిల హోమదీక్షగై । కొనఁజనె నింద్రజిత్తటకు గొబ్బునలక్ష్మణు బంపుమన్నయ । జ్జనపతివిస్మయంబున స్వసైన్యముగాఁ బనుపన్నికుంభిలా। వనికరుదేర లక్ష్మణుఁడు వాసవవైరియు ముక్తహోముఁడై॥ మ॥ కనక స్యందనమెక్కి బిట్టెగయ నుగ్రపశునేత్రజ్ఞుఁడై । హనుము ద్వాహనమెక్కి లక్ష్మఁడు దివ్యాస్త్రాళిచే వానిమా । య నివారించి శిరోవరంబుఁ దెగ వ్రేయం గల్పక శ్రేణిభో । రునవర్షించెఁ బ్రసూనవర్షములు మెండయ్యెన్ సురస్తోత్రముల్। అంత॥ శా॥ సౌమిత్రేయుఁడు శక్రజిజ్జయ శమాచంచన్నఖ శ్రేణికా । సామగ్రిన్ బిసునాశుగవ్రణితనూ సౌందర్యుఁ

హై ప్రమోక్కినఁ । వైమాత్రేయునిఁ గౌఁగిలించు కొని మఱి వారాశినో లాడెత్రి । రామక్షోణివిభుండు రావణుగతప్రాణుఁడుగా నెంచుచుఁ ॥ మ॥ హతశేష త్రిదశాహితుల్ జలధిపతూరాతి యారోధన । క్షితిలోఁ గూలుట దెల్పు మూర్ఛిలి దశగ్రీవుండు హాపుత్రియై । వతిలోకేంద్రుఁడు మున్ను బట్టుకొని పోవఁ వాని వారించితె । చ్చితి నేడేటికి యొప్పగించి జని తీ శ్రీరాము బాణాగ్నికిఁ॥ మ॥ అనిరోషించి సరోషుఁడై జనకకన్యఁ జంపఁగాఁ బోయిమం । త్రినిరుద్ధుండయిబంపు మూలబలముఁ ద్రద్దెళ్లెఁర ఘూత్తంసుచే । తనితావచ్చి యనేకకీశభటులం ద్రుండించె యత్యుగ్రశక్తినిసౌమిత్రిని నేయునాతఁడు ధరిత్రిఁ ద్రాలె నిశ్చేష్టుఁడై॥ చ॥ అనుజుని జూడశోకము దశానను జూడ పగర్చురోషముఁ । బెనఁగొన రామభూవిభుఁడు పేర్చిజ్వలద్విశిఖార్చినేర్చగా । దనుజవిభుండె దుర్చటకుఁ దాళకయుండనిబారె ఖిన్నుఁడై । వనచరు లోదశాస్య యులవాటుగదా యిది నీకు నంచనఁ॥ సీ॥ అంతటహనుమంతుఁ డౌషధుల్గొని తేర కదలుచుముని వేషకాలనేమి । గని మిమ్ముగానమి మ్మునియంచు డిగివాని జలము వేడినవాడుగొలనుజూప । జని యచ్చటనువాని శాపంబు దీర్చి పొమ్మని పదంబులుపట్టు కున్నమకరి । మర్దింప నదిధ్యానమాలినియై కాలనేమిదెల్పినవైన నేమియనుచు । వానిఁబరిమార్చి ద్రోణ పర్వతముఁ జేరి । యచట కాపున్న గంధర్వ నిచయములను । గెలిచి తరిగట్టు కొని తెచ్చు పులుగుతేని । సరణి మందుల కొండయాంసమునఁ జేర్చి॥ క॥ తెచ్చిన యంతనె ప్రాణము । వచ్చె న్సౌమిత్రి కఖిలవానరబలము । న్మెచ్చెఁ రాఘవు శోకము । వచ్చెఁ రావణమనోరవిందము నొచ్చెఁ॥ సీ॥ అసురేంద్రుఁ డంత శుక్రాదిష్టమగు నియమమునఁ బాతాళహోమంబుసేయ । ననలుఁడు చెప్పి పంపెనొ నాఁగ ధూమంబు భీమమై వెడల విభీషణుఁడు । దెలిసి రాఘవులకు దెలిపి తద్విఘ్నంబు గావింప సబలునం గడునిబంప । నతఁడు మందోదరి హరిణాక్షి వేణి పట్టీడిచి తెచ్చి దైత్యేంద్రు చెంత । నిలుప నాకంజవదన కన్నీరువోయగ । నాయకునిఁజూచి వెసకోయ బాయనాడ । స్వశస్త్రవఁటుబు

బడ్డైచి సురియఁబూని । యంగదాదులదరమి మహో రయమున॥సీ॥ దశ
హస్తకాదగద్ధగితరత్నకిరీట కాంతిభాస్కరుఁగచాకచికిగవయ । భుజచ
తుష్పంచకాద్భుతసాధనశ్రేణి భుజగసింహభుజాభుజికిని మొనయ। జాజ్వల్య
మానవింశతి దంష్ట్రినుర్త్యహార్యకుదంష్ట్రార దారదికి నెదుర । దీప్తరోష
జ్వల ద్విధశిఖాలోకము ల్నిఖశిఖావళిముఖాముఖికిడాయ । వెడలెసంగ్రా
మమునకు పృథ్వీధరేంద్ర । సహజగౌరవ వైభవ సహాశతాంగ । ఫటపటా
త్కార పటల లంపట పటాగ్ర । గళిత దశకంధరుఁడు దశకంధరుండు॥
చ॥ మనుకులచంద్రుఁ డట్టియెడ మాతలి దెచ్చిన వాసవీయకాం। చనరథ
మెక్కి యెక్కిడిన చాపములో ప్రతిఘాజలద్విలో । చనములతో యు
గ్రాంత యమశాసనుకై వడి ఖుంచు వేల్పులన్ । గనుఁగొని కొక్కిరింత
దశకంఠు నెదుర్పడి పోరెనయ్యెడన్॥ సీ॥ పల్లవారుణజటాపటలంబు
ముడిగొన ముడిగొనుబొమల నెమ్మొగము వెలుఁగ । వెలుఁగురాజన
చూపు విలయాగ్ని వెదచల్ల చల్లగానిమహోచ్ఛ్వాసమ్ము దనర । తనర
పంబై కటి తటియంగ మదరంగఁ తరగపై రథపట ధ్వానమాన ।
మానని ఘర్మపాలమున చెక్కులునౌన నౌనతంబగుచు బాణాసమలర ।
మలరహానిబోల్చు రావణు మర్మమంటి । మంటలన్నియు కరములుమాటి
మాటి । మాటికేయుంచు నంధక మథనుభీము । భీమునకు రోషమునవీ
రరాముఁ డెదిరె॥ మ॥ పరుషాన్యోన్య వికర్షనంబు విహితప్రత్యస్త్ర నస్వ
స్థిథ । శ్శరజాతంబిత రేతరత్వరిత మూర్ఛామగ్న సారథ్యభం। గురర
థ్యంబు పరస్పరాహత దళత్కోదండ దండంబునై । కరమొప్పెన్ రఘు
రాము రావణుల సంగ్రామంబు భీమంబుగన్॥ మ॥ గుణజాతంబు
లాయఁగుళ్లీభవములో కోదండ క్లిప్తంబులో । గణుతింపంబనకాదు కా
దన నిషంగంబింట సేసాబిమా । ర్గణముల్ దీసినయప్డు కుండలితమైకన్ప
ట్టునే భానుదా । రుణమౌవిల్లుని మెచ్చి రంద రఘువీరున్ దేవతా బృంద
ముల్॥ మ॥ శరవేగప్లవమాన గండక సమంచద్భంగలీలాప్తి సా। గరముక్తా
హాహు తులాధికాయత ధనుః కంఠీరవప్రాప్తి నం । బర్మమం బోలుచు

రామరావణుల సామ్యంబైన యుద్ధంబు జే । సినరక్తందివ నేడునాళ్లుదివి
జశ్రేణు ల్విలక్షింపఁగన్॥ అంత॥ ఉ॥ రామవిభుండు నిస్తులశరంబుల
రావణుహస్తమస్తక । స్తోమము ద్రుంచినన్ మొలచుతోడనె తోడనె ద్రుంచు
రాముఁడున్ । వేమరునట్లు ద్రుంచియిటు వెక్కవిభీషణు నేచరించగ । ర్నాభ్యమృ
తమున్ హరించెననలాస్త్రమున న్నిరమొందుదక్కఁగన్॥ శా॥ బ్రహ్మణ్యం
బయి మించు రాఘవ పరబ్రహ్మంబు ధన్యంబునన్ । బ్రహ్మాస్త్రంబలి
పోసి యేసిన కృతా బ్రహ్మణ్య విద్రావహుల్ । బ్రహ్మాండోజ్జ్వల తేజు
రావణు జగద్బాహాచణుం ద్రుంచి వే । బ్రహ్మాదుల్నుతియింప రామ శర
ధిం బ్రాపించె నత్యుద్ధతిన్॥ గీ॥ విజయకమలాధి రాముఁడై వీరరాముఁ।
డనుజకరమున కొసఁగి శరాసనంబు । కరముడిగ్గి మనోల్లాసకమునభాను।
సుతనిపై దండగొని యుని చూచుచున్న॥ మ॥ పరితఃకీర్ణకచావృతాంస
ముగళద్బాష్పంబు సిక్తస్తనాం । తర చేలంబు పతద్విభూషణము హానాథే
తివాగాస్యము । త్యయనిశ్వాస విశోషితాధరము శోకద్విగ్న చిత్తంబునై।
యరుదెంచెన్ రణభూమిఁ జేరె దశకంఠాంతఃపురం బయ్యెడన్॥ క॥ అరు
దెంచి వరునిపైఁబడి । బొరలవిభీషణుని వారిబోధించి ధరావరు నాజ్ఞపంక్తి
ముఖునకుఁ । బరలోక క్రియలుదీర్చి పావనుఁడైనన్॥ శా॥ యావత్కా
లముభూమి రామకథ సూర్యాచంద్రులున్ వారిధుల్ । తావత్కాలము
లంకనేలుమని తాత్పర్యంబుతో రామ సం । సేవాలోలు విభీషణున్ సు
గుణరాశిన్ నిల్పెసౌమిత్రి సీ । తారామాహృదయేశ జంగమ జయస్తం
భంబుగానంతటన్॥ మ॥ తళుకున్నిగ్గపు పైడిబొమ్మవలె సీతాకాంత పెంచి
చ్చువి। ల్చలరుంగాకలవస్త్ర వాసిగనిపించంగాంచి హర్షింపుచుం । గుల
కాంతామణి చెంతనుంచుకొనియెం గోదండదీక్షాగురుం । డలఘు ప్రౌఢ
వచో నిరూఢిదగ బ్రహ్మాదుల్ప్రశంసింపఁగన్॥ అంత॥ గీ॥ దశరథుని గాం
చిమ్రొక్కి యింద్రవరమునను। జలచు బ్రతికించి పురికేఁగ దలఁచు రాము।
నకువిభీషణుఁ డొసఁగె సాంద్ర ప్రఫుల్ల। పుష్పకంబైనకౌబేర పుష్పకంబు॥
క॥ రతివలెఁ గామ గమనమయి। వితతంబగుపుష్పకము బ్రవేశించిచమూ।

తతితోఁ దంష్ట్రికి మ్రొక్కుచు । బతితోరపువేడ్క రాజ్యపథగతుఁడగుచున్॥
సీ॥ అదె చిత్ర మకరాంక హయవిచిత్రవిటంక వసతిలగ్నశశాంక యసుర లంక । సకలలోకములందు జయలక్ష్మినేజెంగ కుంభకర్ణుండిందుఁ గూలెముందు । మనలక్ష్మణునితోడ మల్లాడి మదమూఁడి శక్రుగెల్చినప్రోడ నను సెగీడ । యటవ్రాలె పటుదండుఁ డైయుండు మునుపిందు రాజసంబుననుండు రావణుండు । సేతువదె యంచు దెల్పుచు సీతతోడ । రామచంద్రుండు రామేశ్వరంబు చేరి । తనదుపేర సమీరణ తనయుపేర । దివ్యలింగంబులంట ప్రతిష్ఠించి కొలిచి॥ వ్యోకేశ్వాచల జిహ్వోద్వ్య తురీకందం॥ భవభావిభవవిభావా । భవభావ భవాభిభావ భావిభూభా । భవభావభావివైభవ । భవభావిభు భావివిభవ భావావిభవా॥ మ॥ అనివర్ణించి విభుండు సేతువు శరాసాగ్రంబున ద్రుంచె । ఘనకైనం బొగడంగ శక్యమె ధనుఃకోటిప్రభావంబుగ । న్గానినంతం జనుబ్రహ్మహత్య మొదలౌ క్రూరాఘసంఘంబుమ । జ్జనముంజేసినవారి పుణ్యమెయ్యెఁగన్ శక్యంబె మాబోంట్లకున్॥ గీ॥ అంత రఘువల్లభుండు పుష్పకాధిరూఢుఁడగుచు గిష్కింధ త్రోవఁగా నరిగి రవిజ । సుతులనొప్పించి సీతపార్శ్వములనిలిపి । జనకనందనతో నిట్టుల నియ్యెఁ జనుచు॥ సీ॥ పంపానదిని గంటె శంపాలతాతన్వి ఋశ్యమూకముకంటె ఋష్యనయన । శబరీవనముగంటె శబరీజితఘనాళి దండకఁ గంటె వేదండయాన । పర్ణశాలలగంటె స్వర్ణభాసురవర్ణ ఘటజాశ్రమముగంటె కటజగంధి । చిత్రకూటముఁ గంటె చిత్రశాలికపోల గంగఁ గంటివె భృంగచికుర । యనుచు దెల్పుచు వచ్చి యయ్యనిలసుతుని । బిలిచి తిమ్మరాక భరతుతోఁ దెలుపఁబంచి । ఘనభరద్వాజుఁగన బ్రయాగమునఁ నిల్చి । యాతఁడొనరించు మంచి విందారగించి॥ వ॥ ప్రభాతసమయంబున ప్రభావతీ ప్రభాతరంగిత పుష్పకాభిరాముండై భరద్వాజసమాసాదితభోజనానంది గ్రామ సమేతంబుగా రామచంద్రుండు నందిగ్రామంబునకు జనుదెంచునప్పుడు నెదురుగా సకల సేనాపరివృతుండును శత్రుఘ్న సేవితుండును గౌసల్యాదిజననీత్రయ సహితుండును నైన భరతుండు కృతాచార తరంగిణీరోధః పురోధఃస్ఫురస్సరం

బుగా నరుగు దెంచినం జూచి రఘువీరుండు డిగ్గునలేచి సుగ్రీవు గైదండ గొని విభీషణుపురోనిర్దిష్టమణి సోపానమార్గంబున బుష్పకంబుడిగ్గివసిష్ఠనకు వందనం బాచరించి వందమానులగు భరతశత్రుఘ్నులగౌఁగిలించికొని తల్లులకుం బ్రణమిల్లి తదీయానందబాష్పధారా సేకంబు చిరాద్భావి పట్టాభిషేక సంసూచితంబుగా సంతసిల్లి నందిగ్రామంబు ప్రవేశించి భరత పూర్వకంబుగా సుమిత్రాపుత్రులతో జటావల్కలంబులు సడలించి పతంగ వందన దనుజపుంగవాది పురోహిత సహితంబుగా నభ్యంజన స్నానంబు చతుర్విధ శృంగారంబు లంగీకరించి మణిమయ శతాంగం బెక్కి సుగ్రీవాంగద విభీషణాదులు మాతంగతురంగాది వాహనారూఢులై కొలిచి రా పురాంగనలు సేసలుచల్ల వందిమాగధులు వొగడ బంచమహావాద్యంబులు భోరుకలుగ మహోల్లాసంబున॥ సీ॥ అలమేరువునుబోలి యందందనందమై కురుజులు మేరువు ల్గొమరుమిగుల। కలువడంబులలోన యలజవ్వనపుబుటారులచూపు కలువడంబులు ఘటింప । కలయనెల్లెడవణిక్కుల దీపములవాకిళులయందు మణిదీపములు వెలుంగ । మకరతోరణములంబరమార్గమకరతోరణవిచక్షణములై రాయడింప । రహివహించునయోధ్యాపురంబుసొచ్చి । తననగరలక్ష్మణుని యింట తపనసుతవి । భీషణులయ ...్యలను నన్యపృథులరత్న। గేహములనుంచితా రాజగృహముచేరి॥ ఉ॥ అనురునాఁడు మారుత సుతాదికపీంద్రులు వారిరాశిగం । గాముఖపుణ్యతీర్థములు గైకొనిరా శుభ వాద్యఘోషముల్ । భూమిసుపర్వ మంత్ర ...వముగా చెలఁగన్మణి పీఠిసీతతో । శ్రీమెరయంగ రాము నభిషిక్తునిజే ...సెరసిస్థుఁడ త్తరిణ॥ సీ॥ భరతుండు ముక్తాతపత్త్రంబుధరియించి యిందు ...బింబు కొల్వొక్కసేయ । సరిగాఁగకపులు చామరములువీచుచు విష్ణు ...యోగనుల విధము దేలుప । కపిరాజతనయుండు ఖడ్గంబుధరియించి శేషా ...హ్వ భు సేవనెరప । పవమానసూనుండు పగలుదీవటిబూని స్వప్రతా ...నంబు సాక్షాత్కరింప । సీతప్రతిబింబ మన సుర స్త్రీప్రదీప । మర్కసం ...శరత్న సింహాసనమున । బ్రేమగొలువుండె బట్టాభిరాముఁడగుచు। రామ

చంద్రుండు భక్తసంరక్షకుండు॥ గీ॥ అపుడు బ్రహ్మాది దేవతలఖిలమునులు।
వచ్చికృతపూజ్యులగుచు రావణుని ద్రుంచి। మనిచితివి లోకముల రామ
యనుచువినుతి। చేసిరందఱు వేఱ్వేఱచిత్రగతుల॥ బ్రహ్మస్తుతి॥ పుష్ప
మాలికాబంధము॥ చ॥ ఖరకరఘోరతేజ కవికల్పక బంధన దీనజానకీ।
వరధరధీర రాఘవభవ స్తవలోలుపచాపరోధ భా। స్వరకర వీరగ స్తవ
వసర్వ సమారమణీమణీమనో। హరశరహార కీర్తియనయప్రియ దానవ
దావజీవనా॥ శివస్తుతి॥ గోమూత్రికాబంధము॥ చ॥ రఘువరదీరతా విమ
లరామదయాపర దివ్యమూర్తిమా। నఘనలినాక్ష దానరతయక్షయ
రూపజితారిభాసురా। లఘుశరవీరభూవిభులలామ జయాకరగ భవ్యకీ
ర్తిని। త్యఘన ఘనాభ దాశరధి యక్షయరూపప్రతాప భాస్కరా॥ ఇం
ద్రస్తుతి॥ ఛత్రబంధము॥ సురవర దరకరఖరకర। కరఖరశర వారివీ ఖ
రహారహార। స్ఫురదర నరవరధీర। త్రరమారఘురమ్య రక్షి రణరత
రథ్యా॥ సనకస్తుతి॥ నాగబంధము॥ స్రగ్ధర॥ భవ్యారామక్షితీశా భవనవజ
లజప్రాయవైశవ్యకీర్తీ। దివ్యాగత్యాగరాజ ద్విజకులరమణా దీనభ
ద్రాఫలాయ। త్క్రవ్యారాక్షీణ నానాదహన వినత పయోజరాతీతధీర।
నవ్యాపద్మేశ భావ్యానరభరణదిశానాథగణ్యోపసేవ్యా॥ వాలఖిల్యస్తుతి॥
పాదగోపనము॥ చ॥ నరవరధీరగుప్త కృపణావర భూదనమన్య వేగిజే।
త్రరియుతధీర తాలఘుతరావన భృల్లలితా భ భూసుచా। తుర్యదఘనభా
వమావిభవ యుక్తరమావహవత్స నిర్మలా॥ బృహస్పతిస్తుతి॥ అనులో
మవిలోమము॥ క॥ మానవపా యజనుతశివ। మానధనాసారభవన మద
సదవనదా। దానవదస దమనవభర। సానాధన మావశినుత జయ పావ
నమా॥ వసిష్ఠస్తుతి॥ అష్టదళ పద్మబంధము॥ స్రగ్ధర॥ హారినిత్యా సనర్మా
హారవినుత నయాత్యాయ సత్రావిరాధీ। ధీరానిత్రాస యత్యాధృత పద
న తథాత్రీపదివ్యాభరా కా। కారాభవ్యాది పత్రిగ్గమన శుభగుణగ్రా
మ సక్తాసరామా। మారాసక్తా సమగ్రావిహిత వరధనుర్మాన సత్యాదరీ
హా॥ క॥ అగ్నిబ్రహ్మాదులు వొగడగ। విని సంతసమొంది రామవిభుసభ
భక్తిన్। వినుతియొనర్చి సమీరణ। తనయుండిట్లనుచు బొగడె దశవా
క్ప్రశ్రీన్॥ ఉత్పలమాలికలో మంజుభాషిణియను వృత్తము॥ భా॥ శవి
క్రమావికచ పంకజపత్త్రవిలోచనారణో। త్సాజిత దానవావిమల కార్తి
చంద్రనిభాననా మహో। రాజశిరోమణీజనకరాజలలామ కుమారికామ

నో । జ్ఞాంజలహస్తతేజ యతినన్నుత చారుగుణోన్నతాహారీ॥ క॥ అనిహ
నుమంతుఁడు పొగడఁగ । విని వేడుక మీఱ రామ విభుసుధరిత్రీ । తనయ
గని చెలువవించెనె । ననుబొగడెడి పద్యమునకె నైపుణిమెఱయన్॥ మం
జుభాషిణి॥ వికచపంకజపత్త్రి విలోచనా। విమలకార్తిక చంద్రనిభాననా।
జనకరాజకులామ కుమారికా । జనుతిపన్నుతచారు గుణోన్నతా॥ మ॥
అనియీస్తోత్రము మంజుభాషిణి తపీయస్తోత్ర మున్నర్భికం । బునునైమిం
చరచించె నం మననినం భూపుత్త్రి మోదంబుతో । దనచేహీర మొసంగ
మారుతియు ముక్తాదామముందాల్చి చె । ల్వెలసెన్ స్ఫాటికమాలికా
మహిత వాణీశాను చందంబునన్॥ అంత॥ గీ॥ వారివారి యథోచిత వైఖ
రులను । బనిచిక్రతయుగ ధర్మంబు ప్రబలసకల । యాగములు చేసి జను
లు సౌఖ్యములఁ బొదల । జగములనుబ్రోచు శ్రీరామచంద్రవిభుఁడు ॥
క॥ ఈరామాయణకథ యె । వ్వారుపఠించినను వినిన వ్రాసిన సౌభా ।
గ్యారోగ్య భాగ్యయుతులై । వారలు వెలయుదురు సుమతి వసుమతిలో
నన్॥ క॥ అని శ్రీవైశంపాయున । మునిముఖ్యుఁడు దెలుప విని ప్రమో
దాన్వితుడై । జనమేజయుఁడవ్వలి కథ । యునఘా వినవలతు దెలుపు
మని యడుగుటయున్॥ శా॥ శ్రీరాగోజ్జ్వలగేహాత్రోయజదళాక్షీ ...
మానాదానవ । త్యాళీరంగ ప్రమాళి పాశ్వాన నినదఘంటీరవ ప్రాంగణా।
సౌరాష్ట్రప్రియ శంకరాభరణ రాజత్ప్రీక్ష కేదారకా । శ్రీరామేశ్వర
ఘనమన్యా లలిత శ్రీనాభిరామక్రియా॥ క॥ పూర్వోత్తర మీమాంసా ।
పూర్వోత్తర వినుత సమర భూసాహసితా । పూర్వోత్తరగ సారధిరథి ।
పూర్వోత్తర రాజమిత్ర భూరి ధనాఢ్యా॥ స్రగ్విణి॥ చంద్రకాంతోన్నమ
త్సౌధయూథక్రమా । చంద్ర కాంతోపలాంచద్యశశ్చక్రమా । చంద్ర
కాంతోపమా నన్ముఖాబ్జక్రమా।చంద్రకాంతోత్తమాశ్వస్ఫురద్విక్రమా॥

గద్య॥ ఇది శ్రీరామభద్ర దయాభిరామ భద్రకరుణాకటాక్ష వీక్షా
పరిప్రాప్త దీప్తతరాష్టభాషాకవిత్వ సామ్రాజ్య ధౌరేయ సకల విద్వ
త్కవిజనవిధేయ ధరణిదేవుల నాగనామాత్య సుధాసముద్ర సమున్నిద్ర
పూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతంబైన దశావతార చరిత్రంబను
మహాప్రబంధంబునందు సప్తమాశ్వాసము.

ఏడవ యవతారంబగు రామావతారము సంపూర్ణము.







## అష్టమాశ్వాసము.

## బలరామావతారకథ.

శ్రీద సఖశౌర్య యాధుని । కాదమహారాజ భాన హాసకుముద్వై ।
శ్యాదార్యాదికగుణధు । ర్యాదవనము కృష్ణయార్యయధికైశ్వర్యా॥ గీ॥
అ[illegible]ంపుము జనమేజయక్షితీశ । శేఖరునకిట్టులను వ్యాస శిష్యవాని।
ధరణివర బలరామావతారమింకను। దెలియఁజెప్పెద వినుమని తెలుపఁదొణ
గె॥ శా॥ మధురమణీయకేళి దనమంజుళ వంజులకుంజమంజరీ।వధు రసధా
రలక్ రమణ మానిత మానితమానినీమణీ । మధురవచోవిలాసముఁ మా
సరమైసరమైకవాసమై।మధురయనంగ నొక్కపురి మండితమా వహిమం
డనంబునన్॥ క॥ అసదృశవితరణలీలా । వసుదేవుఁడమిత్రమిత్ర వసజా
తవిభా। వసుదేవుఁడనఁగ మధురన్। వసుదేవుఁడుదనరు యాదవకులోద్వ
హుఁడై॥ క॥ కలరతనికి పదునలువురు । కులభార్యలు వారిలోన గుణలా
భార్యల్ ।వెలయుదురు వనోజితకో । కిలలై రోహిణియు దేవకియు ని
రువురున్॥క॥కమలాప్తుఁడు దేవకిస। ప్తమగర్భము జేరిపిదప దనయోగము
చే। విమలంబౌ రోహిణిగ। ర్భమునఁబ్రవేశించి పుట్టె బలరామాఖ్యన్॥ గీ॥
గర్భసంకర్షణమున సంకర్షణాఖ్యఁ । గలిగెబలరాముఁడనుచునంతఁ గనక్షితి ।
రోహిణీకాంత నందని గేహమునవ। సించి బోషింప బెరుగుచు సీరపాణి॥వ॥

హరియుండానును గొల్లగుబ్బెతల గేహంబుల్ ప్రవేశింపుచున్ । పెరుగుం
బాలును గొల్లలాడుచును గోపీవృత్త వక్షోజముల్ । శరజాగ్రంబుల జీరు
చున్ గదిసినం గౌఁగిళ్లఁ జొక్కింపుచున్। కరమర్థిన్ విహరించు సీరి సఖసం
ఘంబుల్ ప్రశంసింపఁగన్ ॥ క॥ బృందావనముల నావుల । మందలు మేపు
చును గోపమాణవకులతో। నెందును బాలక్రీడా । నందంబున బొదలు
నంచవందనుతోడన్॥ సీ॥ ఒకనాఁడు బలభద్రుఁడుత్సాహమున తోడి బా
లురఁబిల్చి యోబాలులార । మనలోననెవ్వరే మాత్రంబు దాఁటఁగా వల
తురోకనుఁగొనవలయు హెచ్చు। దాఁటినవారిని దాఁటఁజాలనివారు వహియిం
చి బాండీర వటముదాక। నరిగిరావలెనంచు హరికి శ్రీరాముని దక్కినవారికిఁ
దగినవారి । యుద్ధు లేర్పాటు సేయుచు నున్నచోఁ బ్ర । లంబదైత్యుండు
గోప వేషంబుతోడ । వచ్చివంచన జేసిరీవధమొనర్తు । ననుచు సంకర్షణు
న కద్దిగుమ్మెనపుడు॥ గీ॥ నేరుపుననిట్టులుద్దులు నేరుపఱచి । రామ
కృష్ణాదులొకట శ్రీదామముఖ్యు । లొకట నెలకొని తమతమ యురుబ
లంబు । వెలయ లంఘింపుచుండిరి వేడ్కమీఱ॥ క॥ చిరుబొజ్జగ[illegible] జిగి
బం । గరుగజ్జెలు మొరయ మద్దికాయలు మెరయన్ । బరువెత్తి వచ్చి
దాఁటెన్। హరి యిరువదినాల్గు యడ్గులారా యనఁగన్॥క॥ హరిపాటిఁగ
దాఁటెదనని । పరవున శ్రీరాముఁడెగరిపడె ముప్పదిటన్। సరివారలుము
ప్పదిరా। యరయగ వేయనుచు ఘొల్లుమనినవ్వంగన్॥ సీ॥ సిగజుట్టుకొ
న్నసంపగిమొగ్గ తాయిత చేరు చేరువ తేటిశారుగదుమ । నొసపరి మొసలి
వాయొంట్లు దాళ్వాచెక్కు నిద్దంపు చెక్కులనీడజూడ । బిగియించి కట్టిన
మొగిలువన్నియచేల చెరగులు కటియందు జిందుద్రొక్క । వనమాలిక
విశాలవక్షఃస్థలీశాలి శాలికాడోలికాకేళి దెలుప। దూరముననిల్చి తొడదట్టి
త్రోవవారి। దొలఁగుమనిదృష్టి చక్కఁగానిలిపి పిడికి। లించి కరములుగుద్ది
యుంచి రివిగునుకు। పరువుననుదాఁటె బలుఁడు తొంబది యడుగులు॥ గీ॥ ఒకట
నుదయాద్రి కస్తాద్రి కొక్కబంగి। దాటజాలియు గిరుదుగా దాఁటి యోడె!
దానవుఁడు మీఁద గెలువఁగా దలచి యోడె । గెలువ సులభంబె యోటమి

గలుగుగాక॥ సీ॥ ఎగిరినల్పదినాళ్లగడుగులు దాటంగ నొకండలికింప దాటుక
నేలమినొకండు। దాటినరీవమందరికి క్రొమ్మొగ్గనొకండు క్రొమ్మొగ్గకయుటగాలుం
గు గోనెనొకండు। గుజ్జికిప్పలడుగిడ గుజ్జిలోనె బడెనొక్కండు డివ్వలప్పల
దాటు నేలమినొకండు। పసువిడుచోజాఱు చెరగుద్రొక్కినొకండు కీవి
గాదని మల్లినెనొకండు। నమమపీరిబట్టి జొమ్ముల పొడవుభుజను।
పొడవుకుత్తుక పొడవును పూన్కిదప్ప। కుండగుప్పించి రొండ్లారు లుద్ధ
లగుచు। గెలిచెహలిచెర్వ యసల్పిబలములోడె॥ శా॥ అంతం గృష్ణుండు
గేరినవ్వుచును భావాయింకనికేమనుచు। పంతంబుల్ పలుకంగ నింగుమని
దర్పంబొప్ప శ్రీరాముపై। సంతోషంబలరంగనెక్కి పదముల్ ఝూడిం
పుచుకాపల్లైతా। ఉంతేనైకొని హోయటంచు గదిమెగా హేలావినో
దంబునన్॥ క॥ వేడుక గెలిచిన బాలకు। లోడినబాలకులనెక్కి యుల్ల
సములుపె। క్కాడుచు బరవప్రలంబుడు। తోడనెబలుడ జావహించి
డులదులనడిచెన్॥ గీ॥ దిటముమీఱంగ భాండీరవటముదాక। నరిగియుం
దరు మీరలంగ మరలకసుర। బలునిగొని సనె గుజ్జి దాటి భారమైన।
యంత దనరూపుగైకొనె యద్భుతముగ॥ సీ॥ తగిలికాలినమోటు చిగిరిం
చినటువలె నొక్కరుజంజాగు వెండ్రుకలు దనరె। నగ్నికుండములంచు నక్షి
గోళంబులు గనులుగూడు పతంగగుములుద్రావాల। వివృతాస్య పాతాళ
వివర నిస్సీరదచ్ఛద దారుణాహుల నాగదంష్ట్రిలమర। గగనంబునను
వానకాళ్లు జాఱిన రీతి నురుతరదీర్ఘబాహువులుదనర। కుంభతటమునసిం
గంపుకొదమనుంచి। తనువెఱుంగక చనుమత్త దంతిలీల। వరనిశాటవి
పాటవబలుని బలుని। యంసమెక్కించుకొనిపోయె నసురవిభుండు॥ క॥ అప్పు
డా బలుండు నిశాచరు। కపటమ్మెఱగని కృష్ణకృష్ణ గ్రక్కునజెపుమా। యిపు
డేమియుపాయ మనన్నన్। విపరీత మటన్న నగుచు వెన్నుండనియెన్॥ సీ॥ గగ
నాదిసృష్టి గల్గకయుండు నెగ్గొంచు నిర్మల బ్రహ్మంబునీవకావె। ప్రభవిం
చువెనక ప్రపంచస్వరూపమై నెగడు విరాణ్మూర్తి నీవకావె। జన్మాది
రహితుండై సత్త్వగుణాంబువహించు నారాయణుండ నీవకావె। వేయుఫణం
బులవిశ్వంభర భరింప నిపుణుడౌ ఫణిరాజు నీవకావె। యేనునీవయకాదె

నీవేముకాదే । యవనిని రక్షింప నిరువురమైతిమింతె । తలఁపునిజమూర్తి
మానుషత్వంబునిలుపు। మటుమనేటికి యన్ననీ మహిమలన్న॥ క॥ కడువడిబ
లుఁడు నిజస్మృతి । చెడిదంబగు కడిమిదనుజు చీఁకటిబొడవఁగ । బొడబొ
డనెత్తురుగ్రక్కుచుఁ। బడియెఁ బ్రలంబుండు గోపబాలురు సెలఁగన్ ॥ అంత॥
క॥ తొలుతన్ రాముఁడవె ఖరు బొలియించితివనిటులనను మభూజనములకున్।
దెలిపెడుగతిబలరాముఁడు । పొలియించెన్ ఖలుని తాళములనవనిబడన్॥
వ॥ యివ్విధంబున ననేక బాలక్రీడా లోలుండును బ్రలంబధేనుకాసుర విఘా
తుండును నగు నంద గోపబాలుం డంత నృశంసుండగు కంసుండను జిఘాంసా
క్రూర బుద్ధియై యక్రూరు చేత ధనుర్యాగావలోకనవ్యాజంబున గొంచక కాం
చనాంబర సహాయుండై మధురాపురంబున కరిగి॥ సీ॥ తొంగరేని లీలము
ద్దులు గుల్కునెమ్మేను నలుదకాలుక కొండవంటిరూపు । బిడికిటకణఁకు
వాబెగడు నెన్నడుమును బ్రేవుల ప్రోవులై పెద్దకడుపు । నట్టహాసంబున
నడరెడుతెరనోరు దళుకు గోగలపేరి దంతయుగము । వెరకపై గమకించు
విక్రమక్రమమును మైమెఱుంగని మదోన్మత్తవృత్తి । దనరంపారియను కరి
నిమాల్కొనిన కరణి । గంసుసభలోన ముష్టికచాణురులిల । నఖముఖంబు
లజీరి దన్నస్త్రదళన । గురు యశోమార్తికముల గైకొనియెబలుఁడు॥ గీ॥
కృష్ణుఁ డేకంసుఁజంపించి యెలమినుగ్ర। సేనుతద్రాజ్యమున కభిషిక్తుఁజేసి।తల్లు
లును తండ్రియును దాము మొల్లమిగని। యెల్లసంతోషములజెంది యుల్ల
సిలఁగ॥ వ॥ అంతకంసపత్నులగు తనకుంబుత్రికలస్తియు బ్రాప్తియు నార్తి
మష్యాబుబ్రోత్సాహంబు వేసన నాహవబాహుళేయ బాహుబలుండగు జరా
సంధుండు పదునెనిమిదవమాఱుమాఱులేని కడిమియిరువదిమూఁడక్షౌహి
ణులంగూడి మధురాపురంబు ముట్టుకొనినం గలగబారు యదువృష్టిభోజాం
ధకవీరులంజూచి పురక్షోభంబు గాకుండ నేర్పున నరాతులతో జరాసుతుం
బరాజితుం జేసెదనని మురాహిత సహితుండై ఖరాడపురంబు నిర్గమించి
దక్షిణాభిముఖుండై యనేక జనపద వనంబులు దాఁటి సహ్యనగరంబున
సహ్యతేజోభిరాము భార్గవరాముదర్శించి తదీయకామధేను పయఃపానపీన
బలులగుచు భార్గవోక్తదుర్గమార్గ ననర్గళ ప్రమోదంబుసంజనిచని॥ శా॥

త్రిమంతంబు శిరోగ్ర ధామసుమమా సింధూరితద్యోరమా । సీమంతం
బు వధూసమేత విహారత్సిద్ధాది నానామరు । త్సామంతంబు సిలోకి దూ
ష్కృత పయోజస్తోమ హేమంతమా । గోమంతంబున కేఁగి యబ్బలుఁడ
నుంగుందోడుతో నిల్లినన్॥ సీ॥ కాంచన మయమౌట కనకాద్రి యనవ
చ్చుఁ గలిగియేక శృంగంబు గాదుగాని । ఖర్జూరమయమౌట కైలాసమన
వచ్చుఁ బలలాసిచేఁ బెల్ల గిలదుగాని । హిమనిధానంబౌట హిమశైలమన
వచ్చు బహుమనూలని చెప్పఁబడదుగాని । కలితగంధంబౌట మలయజం
బనవచ్చు జడమహాద్రినారీతి జెప్పబడదుగాని । యదియేగిరులనియింక
నమర విధున । మందహాసనాతి తుహినహే మంతదరికి । హారివిలోక
విలాయిత ప్రాంజపాద్య । సత్త్వ సామంతకరికి గోమంతగిరికి॥ మ॥
అనివర్ణింపుచు నగ్గిరింగలుగు నాయూవింత లీక్షింపుచున్ । ఘనతాపింఛ
మహావనీతమములో కంజేక్షణుం బాసియొం । టినిదానొక్క కదంబభూ
రుహము క్రీనీడన్ వసించెన్బలుం । డనురాగంబున నట్టి యద్దియుమ
యంబౌ చంద్రునీక్షింపుచున్॥ ఉ॥ అంతట నొక్కమందమలయానిల
మెంతయుఁ జల్లనై శ్రమం । బంతయుశాంతిగా మలయునప్పుడు మద్యపా
నాపిపాసవి । భ్రాంతమనస్కుఁడై హారిపిపాసకదంబ మహీజకోటరా।
భ్యంతరసీధునున్న సురపానముజేసి ప్రమత్తచిత్తుఁడై॥ గీ॥ అంతవారుణి
కాంతయునబ్జసదన । యనగమువ్వురుపువ్వుబోండ్లతనుభవన । విజయ
లక్ష్మిలాయన రూప విభ్రమముల । నొచ్చిమచ్చికహలిజేరవచ్చి రవు
డు॥ సీ॥ మదిరాంగనముగబ్బు మాటల తబ్బిబ్బు కొదమగుబ్బల యుబ్బు
నిమురమబ్బు । దోలఁగుపయ్యెదకప్పు దూసియాడెడుచొప్పు వెడవిడునెరి
గొప్పు విరులయొప్పు । మొదటిత్తుకటివి చెదరిన కెమ్మోవి జాఱినరం
గావి చీరనీవి । కన్మునెత్తనిగ్గు కడకెంపు బలునిగ్గు దడశాటు నడజగ్గు దగ్గు
మొగ్గు । వాలుకన్నులకెంపు పైప్రవాలుమంపు । నెలపాటిలనొక్క కెంగేలి
క్రమొక్కు । మురువు నెమ్మేని బిగువు కెమ్మోవినగవు । నలరనిల్లనెహాళ
హాళిహాళ్యవాలు । క॥ వరుణునిసంపున వచ్చితి । నదునినువరిణ్ణురివఁగుమా

వల్లభునివిభా । వరియింపు మీటమదిలో । వరియింపు క్రమంబు మెర
యు వరియింతునినుఁ॥ క॥ అనునంత గాంతిశశిక । న్ననుచక్కనివాఁడ
వౌటనాయకుగాని । న్ననుమతి గోఁతినన్ని । యనుమతి గతి దెల్పుమని
పటాంచలమలమఁ॥ క॥ ఆరామతిలకునందగు । నారామలఁగాఁడియన్న
యారాములతో । శ్రీరామయనియె కుశతట । హారాముల కాఁతినగ
వునందుజిగుర్పఁ॥ మ॥ వినరామాయభిరామపీరల దయఁ వీక్షించి గై
కొన్నరీ । తినినన్నుఁ గయికొమ్ము దెచ్చితి బయోధిఁ నీలచేలంబులుఁ ।
ఘనకోటీరము వజ్రకుండలము సింగారించుకొమ్మన్నమ । న్ననవానిఁ
గ్రహించి యిచ్చినమతిఁ నారీమణిం జేకొనెఁ॥ మ॥ బలితంపుఁ వలి
గుబ్బచన్ను మెరయఁ బైవ్రాలు బంగారపుఁ । గళకుఁ జెక్కులిము
ద్దుబెట్టుకొను సింగారంపు కెమ్మోవికెం । దలిరుందేనెలు గ్రోలుపోలు
మొనపంటఁ నొక్కుసొక్కుఁముదా । కలయైదానరగంటగాంతునుర
మొక్కుఁహాల ప్రౌఢక్రియఁ॥ సీ॥ ఉడుటుచన్దోయి మేనొరయ దగ్గంని
ల్చిగాఁగిలించినప్రేమ గాఁగిలించు । మోహంబుమీఁద నెమ్మొగముచె
క్కులిజేర్చి ముద్దుగొన్నను వేడ్క ముద్దుగొనును । తావిచెంగావికెమ్మో
విమోవినిగూర్చఁ గంటిచేఁనతిమిఁగంటిసేయు । బంధోచితంబుగా బిన
ఖించుఁబైకొని బడలినబైకొని బడలజేయు । జిలుగుపన్వ్యాసురటిచే సే
దదేర్చి । వేడ్కమీఱంగ గపురంబు విడెమొసంగు । రమణుఁడిటురమ్మ
నినపునాంతికినొగ్గు । కాంతిహరిమధ్య మధ్య శృంగారములను॥ గీ॥ చన్ను
గవముట్ట నియ్యదుచిన్ని మోవి । యానగానీదు సీవిఁజెనొ వ్రైనిర్య ।
దటులనయ్యును మిగుల మోహంబునెనిచె । వనజ గేహమునముగ్ధభావ
మునవతికి॥ సీ॥ ఒకకొమ్మ గాఁగిలించుక వెన్కమెలిగొన్న గేలనిర్వారగు
బ్బక్రేవలంబు । జెలులలో దాడబిరుదుల గోరులుంచ చుమారువ్రతో
నొకతెంమున్గొనగు । సకియులజఘన నాభికల జేయద్చుచు మొనబంటు
నొకతెకెమ్మోవినొక్కు । గేలిచెనొకతె సొక్కించియిర్వారసంగవిగతం
బునంగళలఁ జాఱజేయు । మధురగంధోత్తమాపాన మత్తులగుచు । జత

దుక్షి ద్రుపదవిరాటానువిందదంతవక్త్ర శతధన్వవిదూరథ భూరిశ్రవత్రిగర్తా
దు లుత్తరపార్శ్వంబునను లోకైకవీరులై కల్పద్రుమాక్షు క్షత్రధర్మజయ
ద్రథోత్తమౌజసాల్వ కౌరవేయులు పూర్వభాగంబున చేదిరాజ సహితుం
డై దక్షిణభాగంబునవిడిసి దుర్గంబులుల గ్గలువట్టు నగ్గలిక వెగ్గలంబు గటం
కంబులు గిరివిటంకంబులు భుజాటంకమ్ములు పొంకంబులుగా భేదించియు
గదాఖండంబు వేదండోపమగండంబుల దుండించియు పరిఘలు వ్రేసియు
పట్టసంబుల గ్రుచ్చియు ఖనిత్రంబుల గ్రొచ్చియు నుద్ధవిడి నుద్దామ కుద్దాలం
బులం ద్రవ్వియు నగ్గంటి గంటి సేయంజాలక మందరవసుంధరాధరోత్పా
టన పరాయణులై నిరాకృతులగు సురాసురుల చందంబున పరానీకినీనిరా
కరణ ప్రవీణ పరాక్రమ విరాజిత ధరాదిరాజన్యులు దురాపంబిధరాధరం
బని పరాక్రాంతులైన సురాళించి జరాసంధుఁడుఁ గరాలంబిత కరాళశరాస
నవరాముక్తకరాళ శరాసారంబున ధరాగ్రంబుగప్పియుం బురాణ పురు
షులగు ఖరాహితమురాభిరాతుల బరాభూతులం జేయఁజాలక దురాలో
చనంబుచేసిన॥ మ॥ సరసాభృచ్ఛిఖరానుజస్వకధి దహ్యౌకోప భూపాగ్రణీ
వసితః ప్రజ్వలితానలోజ్వలశిఖా పర్యాకులత్ఖడ్గకా। సరమత్తేభ వరాహ
సింహచమరీ శార్దూలముఖ్యాటవీ। చరదుర్వార భయారవాకులితమా శై
లంబు వీక్షింపు మన్॥ శా॥ గోమంతంబున కీయవస్థమనలం గూడంగ దాగ్గై
నా। హా మేలే యిటువంటి దుర్యశము బాహా శక్తిమీఱన్ నృప। గ్రామం
బుల్ మసియించవేమొ యని శృంగంబద్రి శృంగస్థమై। యీమత్తద్వీప
కోటిలోదుముకు చాయంగుప్పనన్ సేనలోన్॥ క॥ దుమికిన హలితోదుమి
కెన్। గమలాక్షుఁడు ముసలనందక ప్రముఖమహా। విమలాయుధములు దో
డనె। సమకూడెన్ మింటనుండి జనులరుదందగన్॥ క॥ ఈరీతి శౌరిసీరియు।
ఘోరాయుధ పాణులగుచు గ్రూరారిచమూ। వారణహయ దారుణ
రథ। వారణలీలాపరానివారణభంగిన్॥ క॥ చరియించుచు బలుఁడుద్ధతి
గరముసలము చేత సమరకరులన్ ఖరులన్। బరులన్ గరులన్ హరులన్।
ఖరలంగాఁ జేసె గదనభూభాగమునన్॥ క॥ దరదుఁడ ధరణీరమణ। ది

రథునిముసలమునఁ గూల్చెవిబుధారిచమూ। దరదుఁడుఃసంస్మితనవకుం। ద
రదుఁడుహలధారి దేవతలుమేలనఁగన్॥ క॥ అంతజరా సంధుఁడుదు। ర్దాం
తగదాదండతుండ బాహుణమదవన్। దంతావళంబుశేవన్।బంతంబునగదిసి
కామపాలునిబలికెన్॥ మ॥ హలముంగైకొని దున్నగావలయుగా కామోా
దనక్రీడకున్। బాలయన్ శక్తుఁడవే హలాయుధరణంబున్ మానిమాభూ
మిలో। పలశాలెక్కుఁడు దున్నరమ్మటకు గోపాలుండవైతేనిసం। బళ
మిత్తున్ బసిగావు కావు బ్రతి భూపాలుండవే వాజికిన్॥చ॥ హలమునవచ్చు
ధాన్యములకప్పటి కప్పుడఁదంచఁ కోగరో। కలిగయికొంటివారయటుగా
మినికూలికి ధాన్యమెద్దిప। లైలబసిగాచుమన్న బనిలేదిఁక చక్రముశూపన్
ధారిగా। వలయునునీదుసోదరుడు వారిజనాభుఁడు రోహిణీసుతా॥ వ॥
అనిన మాగధునకు హలాయుధుం డిట్లనియె॥ మ॥ క్షితినాదత్వము లేదు
గావున బరక్షేత్రంబులం దున్నిలో। హితధారంబదనిచ్చి రాజమకుటీ
హీరావళీబీజనం। తతులం జల్లితి కీర్తిసస్యముల కై తద్వేళ యుష్మద్రు
శాకృతిపుల్ మొల్వగ కల్పుతియ్యటకు నేనే తెంచితిన్ మాగధా॥ గీ॥
మా గదాదవ బహుధాన్య మర్దనమున। కేనురోఁకలిగైకొంటి నిదినిజంబె।
యుంకవిూలోవ గట్టిపాల్లేనుపరచి। చెరగ చక్రంబె చాలదే శ్రీహరికిసీ॥
శా॥ రారా మాగధ మానరా మదముతూత్రం బేదిరా నీకుగై। వారంబు
ల్ సవరించరా నృపసభన్ వారించరా నీ చమూ। వారంబుల్పురి సేరఘోర
తర దుర్వారుండరా నేనుగ। ర్వారంభంబులు వీడరాయన మహోషాద్య
మర్దదుర్ధర్షుఁడై॥చ॥ అటునిటుబొంచి పొంచి మగధాధిపుఁ డాయ్యనయా
టవాటుగా। దటుకున వ్రేసి వేటు దనుదాఁకగ నియ్యకొట్టివైచియ। కు్కు
టిలు నురంబువై చె యదుకుంజరు డందున గొంతనొచ్చియ। ప్పటుబల
శాలి నందుకొని పార్శ్వముబేసె దటానదర్పఁగన్॥ వ॥ ఇవ్విధంబున
మాగధ హలాయుధులు గదారణప్రవీణులై పెక్కువిన్నాణంబులం బోరు
నెడ దస్సిన మాగధువధింప నుద్యోగింపమాగధవైరివేరెయున్నాఁడు నీవు
ప్రయాసపడవలవదని నుడువు నాకాశవాణిపలుకుల కులికిపడు జరాసంధుం

...మసంగరంబున దశకంధరు దయదలంచిన సింధుబంధనుండగు రఘు
రాము చందంబు గృపాభిరాముండై బలరాముఁడు వెలువక పురంబునకే
...హమని జరాసంధుబంచి యున్యరాజన్యులం బరాజితులం జేసి విజయలక్ష్మీ
విరాజితుండై విజయసఖ శమన్వితంబుగా ద్వారకాపురమునకరిగి సుఖం
బుండెనంత॥ మ॥ ఎలవంకంబుల వంకజక్రధరుఁడున్ వృష్ణ్యాదులౌ శాం
భ ప్రక్ । నలువంకన్ మడిజాక చేతులిడి నానాభూషల్లోలుగాఁ । దల
వం నెలవంకఁగల్గు దొరచంద్రాన్ ప్రభాభాభ్యుఁడై । కొలువయ్యెన్
..లువై హలాయుధుఁడు దర్పున్ గొల్వ కూటంబునన్॥ గీ॥ అప్పుడొకద్వా
రపాలకుఁ డరుగుదెంచి । స్వామివిన్నప మొకటి యెవ్వాఁడొకాని । పు
..జనులకు ముమ్మడిసొడవు వాఁడు । నివ్వెఱగుతోడ వాకిటనిలిచినాఁడు॥
క॥ మనుజుఁడుగాడు నృపాలక । ఘనలక్షణలక్షితుండుగఁ డుమరుడున్ । కను
ఱెప్పపాటుగలదా । తనిగనిజనులదరిపారెదరు పురిలోనన్॥ చ॥ అదియు
..కయొక్క ధవళాంబుజలోచన వెంటవచ్చియు । న్నదిభువనైకమో
హన మహాద్భుతరూపము కల్మినిందిరా । సుగతియుదప్పదీ ధరణిజూడ
..ను తాదృశరూపలక్ష్మియా । త్రిదివములోననైన కం దేయికే దేవరచిత్త
..చనన్॥ క॥ ఎవ్వఁడొకోయని మదిలో । నివ్వటిలన్ సంశయంబు
..పరలన్నన్ । కవ్విడి చెలికాఁడనియెన్ । నవ్వుచుఁగృత పౌరుషుఁడొట
నాకున్ దోఁచెన్॥ గీ॥ ఎవ్వఁడైననేమి యిటకుర వసనన । తోడితెమ్మటన్న
..పోయి । తోడితేరగతఁడు దుస్సహాతనుదీప్తి । హెచ్చగొలువు సే
..ట్టయును॥ క॥ ప్రత్యక్షమ్యతుఁడైయతనిన్ । ప్రత్యేకవరాసనంబు పై
..చాన్ । కృత్యంగులుదీర్చి హలధరుఁ । డత్యాత్తను ప్రీతిపినతుఁ
..యిట్లనియెన్॥ ఉ॥ వింటిరె మిమ్ము చూచినను విస్మయమయ్యెను నా
..గ । గాంటిమహాద్భుతంబు సమకూరెడు మీకును కాలభేద మీ । రెం
..సీతుమికంక వివరించెద నా కథవిన్మనాకభి । త్కంటకలుంఠన ప్రవణ
..జన్మఫలా హలాయుధా॥ సీ॥ ధర్మజ నాల్గు పాదంబుల నిలియించు
..రనగుంట కెంత శేర । తోడనహో..దురు బంధువులబ్బొ

లియేయుగంబుల నాకనాయకులును। తనసాత్త్వికము దోఁప ధవళాంగుఁడై
మించు నేయుగంబునను లక్ష్మీన్వయుండు। నేవిఘ్నములు లేక యెల్లవాంఛిత
ములు నేయుగంబున ఫలియింపుచుండు । నట్టికృతయుగమున కీర్తిహారి
యగుచు । ప్రబలునానర్తమేదినీభర్తసుతుఁడ। పేర్మిరైవతుఁడ న్రునా
యూకులవరుఁ। జలధిలోపల దగుఁ గుశస్థలియనంగ॥ క॥ అనఘుఁడు రై
వతకా । ఖ్యనగరమదే నీవు పేరగావించినదే। యలసర్వజ్ఞుఁడవీ వెఱుఁ।
గనిదిగలదె యతుల సౌను కంజదళాక్షా॥క॥ అదియొండె వినుమ నాకథ
హృదయాంబుజ మధ్యమునను శ్రీహరిమన్నన్ । బదిలముగ సిల్పినలిపి
తి । పదివేలేడులు మహాతపంబతిన్నిష్ఠన్। గీ॥ అంతనైదేండ్ల బాలికనైయె
పయోధి। కన్నెనాతోడమున్ను రాకన్నెయనుచు । ప్రేమముద్దాడు చుం
డితిరామనాటి। యద్భుతప్రేమ యింతంత యనఁగరాదు॥ గీ॥ కడపటమరే
మి యిటువంటికన్నెగలుగ । వలయునంచును నాతపఃఫలముగాఁగ । నడి
గితినివెన్న ప్రత్యక్షమైనలక్ష్మి । నటులదయజేసె నాయమ్మహర్ష మొద
వ॥ క॥ తనయుల నూఱ్వురగంటిన్। దనుసంభవ యొకతెలేమి తపములచే
తన్। దనయన్ వేడితిదనయన్।దనియన్ లేకున్న కోటితనయులనైనన్॥గీ॥
ఆడుపడుచాయటంచు నత్యల్పముగను । మదినెఱుంగక కొందరాడుదురు
గాని । కన్యసామాన్యమే బుత్త్రిగాంచెనేని । యుభయకులముల దరియిం
పనోపుగాదె॥ గీ॥ అదివినిచెలంగె మత్సతియటులగాదె। యల్లుఁడని యా డు
బిడ్డని యగవుతగవు । లంపకము శుభశోభనమని యవెల్ల। సంతసము
జేయు కన్యకా జనములకును॥ క॥ కొన్నాళ్లకు గర్భిణినైయె। కన్నియగనె
మద్వితీయ కరములు మొగుపన్। కన్నజనుల్ శశిరేఖన్। గన్నట్టిద్వితీయ
పోలె కళ జెలువొందన్॥ గీ॥ చూచువారెల్ల నమ్మక్క చుక్కరీతి । చొ
క్కమైయున్నదీకన్య చక్కదనము । నిక్కమెక్కడ లేదని చొక్కెఁ దగ।
రేవతీనామమిడితిబుత్త్రికి మహాత్మా॥ గీ॥ ఏటబెంచుదాని పూటబెంచె
నటంచు । జనులుబల్కు పలుకు సత్యముగను । కన్నతల్లిమిగుల గారాబ
ముననెంపఁ। జెరిగెనైప్రలతిక జొంపుమీఱ॥ సీ॥ అచ్చనగల్పు దోఁయాట

న్కడాగిలిమూఁతలు నాలుగుమూలలాట। గుజగుజరేకులు గుజ్జనగూళ్లను
బొమ్మలపె ళ్లిండ్లు నమ్మనములు। నత్తగోడలియాట నాలుమగనియాట
తాటిచెట్టాటకోలాటములును। పింపిళ్లుజెండుగోరింపులు వామనగుం
తలు వెన్నెలకుప్పలాది। మఱియు పుడికిళు మొదలుగా మనసువచ్చు। నా
టలన్నియు తోటి తొయ్యలులఁగూడి। పడుచుదనమున వేడుకపడుచునాడు।
ముద్దరాండ్రకునల్లారుముద్దుగాను॥సీ॥అయ్యయయ్యయటంచు నెయ్యంబుమీ
ఱఁగా పలుమాఱు పైపక్క బడకయుంట। జెల్లెబొమ్మల పెండ్లి జేసెదిందే
టికి సేయవైతివెయన్న సిగ్గుపడుట। దాదులమనవి యత్నమునవాతో
డెల్పనరుదెంచితిని యన్నమఱలిచనుట। యమ్మయెవ్వారి పెండ్లి యాడెద
వేయన్న ముసిముసి నగవుతో మసలుటయును। గరిగరికెగాఁగ మన్నో
మ గలుగుటయును। ప్రేమమీఱంగ వన్నెలు బెట్టుటయును। కురులుగొప్పు
న గూడెడు కొమరువయసు। దెలిపె నానాట గన్యకా తిలకమునకు॥ వ॥
ఇవ్విధంబున గన్యకారత్నంబునకు మెఱుఁగుసానయుంబోలి యనన్యాదృశ
హావభావంబగు యౌవన ప్రాదుర్భావంబగుటయు స్వయంవరంబు చాటిం
చిన॥ శా॥ సప్తద్వీపమహీప శేఖరసుతు లౌందర్యరేఖాన్వితుల్। స
ప్తార్చిప్రతిమానతేజులు బిడౌజస్పర్ధి సంపద్భుజుల్। సప్తార్ణవక్షణదాక
రాన్వయ భటుల్యార్యక్రియాశాంభవుల్। సప్తాంభోధిమణీ విభూషణ
ధరుల్ సక్కదెంతురశ్రాంతముల్॥క॥ చంద్రానన యిందొకరా। జేంద్రకుమా
రునినిగోర దింతియకాదా। యింద్రుని మెచ్చుదు మఱియా। చంద్రుని
మెచ్చదు విలాస సంపదకలిమిన్॥ ఉ॥ ఓయిగురాకుబోడి కనవో వినవో
యిదియేమిచెల్లనీ। ప్రాయపుతోయజాక్షు లెడబాయరొకప్పుడుప్రాణ
నాథులం। ప్రాయము రిత్తబుత్తురకొ పల్కవెనీవుదినున్న యట్టియా। నా
యకుదెల్పవే త్రిదశనాయకు గోరిన దెచ్చికూర్చెదన్॥ క॥ అనికన్నతల్లి
వేడిన। జనులనే వేడికొనిన సకులడిగినవీ। డని వ్రీడనొడువకున్నన్। తనప
తినిన్ నిశ్చయించుతలపుజనించన్॥శా॥సన్న్యాసంబునగానిమర్త్యులకు గాం
చన్ రాక త్రైలోక్యమూ। ర్ధన్యంబైతగు బ్రహ్మలోకమున కేతన్మర్త్య

దేహంబుతో । గన్యారత్నముతోడనేగి భవనాగ్రక్షోణి సంప్రాప్త సా।
జన్యుండై మను ద్వారపాలకుఁడువచ్చెన్ బోవుచోఁగొల్వునన్॥ చ॥ మిళితగ
భీరమర్దళ ధిమింధిమినాదముఁ గిన్నరాంగనా । కులకలతానమాన ములు
ఝుమ్మనివీనుల విందుసేయనం। కులసురసిద్ధ సాధ్యమునికుంజర ముఖ్యు
లద్రోఁచికొంచుఁగో । పలికటుబోయి సందడిని బొల్చి యొంతయుఁ దత్తరిం
పఁగన్॥ క॥ ఒకయోరనిలిచి దివిష । న్మకురాస్యల మంజులాస్యములు
జూచుచుకొం । డొకదడవుండితిమాన్ని । త్యకళావైభవములెన్న ద
రమేమనకున్॥ క॥ ఎక్కడజూచెనో యప్పుడె । వాఃకాంతుఁడు నూచి
పిలువ వడిజనిభక్తిన్। మ్రొక్కినిలుచున్నఁ గన్నియ। నిక్కడి కేమిటికి దెచ్చి
తివనియడుగన్॥ శా॥ ఈయారాజు లటంచుగొందఱికి బేర్వేర్పాటుగావిం
చి ధా । తాయిందేనృపమౌళికిత్తుఁదనుజాతన్ దెల్పుమాకన్యకున్ । బ్రే
యుండెవ్వఁడటన్ననవ్వుచువచోబింబాధరావల్లభుం। డేయేరాజులు నీవు దె
ల్పితివా వారెవ్వారు లేరువ్వరన్॥ గీ॥ నీవువచ్చిన వెనుకను క్షోణితలము।
కృతయుగంబాది యిరువదియేడుమారులు । దిరిగె నాలుగుయుగములు
దెలియవింత । వింతగాదిది యిదియొకవింతవినుము॥ చ॥ మునువరమిచ్చు
టన్ గలిమిముద్దియ ముద్దులకూఁతురయ్యెగా । పునబెరవారి నేగతి ధవుం
డుగగోరు మురారిసీరియై । తనరెడు ద్వాపరంబునను ద్వారకలోహరి కి
మ్ముబొమ్ము చ।య్యనయన వారిజాసనుని యంఘ్రులకున్ నతిచేసిగ్రక్కు
నన్॥ వ॥ సత్యలోకంబు వెడలి తపోలోకంబుదాఁటి జనర్లోకంబు నిర్గమించి
మహర్లోకంబుగమించి నాకలోకసౌభాగ్యంబులు గనుంగొనుచు భువర్లో
కంబుడిగ్గి॥ సీ॥ తమతమనిత్యకర్మములుగావింపుచు నధిపులగొల్చు బ్రా
హ్మణులఁజూచి। దాయాదిపాళ్లకై తమలోపలనెపోరు నన్నదమ్ముల కల
హంబుజూచి । పరులకుఁగలుగు సంపదలు జూడఁగలేక మతినీర్ష్య నొందు
దుర్మతులఁజూచి । సతులనొల్లక యన్యసతులగోరెడివారిఁ జేరగోరెడుకు
ల సతులఁజూచి । హ్రస్వదేహుల బధిరులనంధకులను। రోగపీడితులను దరి
ద్రులనులోభ । వంతులనుదుఃఖశీలుర వింతగాఁగ । ధరణిఁజూచుచు మిగు

ల ఖేదంబుపొడమ॥ గీ॥ వెనుక కాళ్లనె దాఁటులు ద్రేయువాండ్రుఁ । వృషభ
మీక్షించి ముందరి రెండుపదము । లెవ్వియననొప్పి బట్టిన దిండులోన।
కుశిపదంబని యతిబల్క జడిసియేను॥ క। వచ్చితి నిద్వారావతి । కిచ్చ
టఁగృతి యుగము బోలే నింపైనదిసి। వచ్చ్యతుఁడవుటంగన్నియఁ। బుచ్చ
కొను ము తపము సేయబోయెదనింకన్॥ చ॥ అని సుత నొప్పగించిన హ
లాయుధుఁడెంతయు బ్రేమమీఱద। ద్వనితగళంబుపై హలముపైచి యొ
కించుక నైచునంతలో । మునుపొడవైన యమ్ముదిత మద్దుగవల్లభు నం
తమాత్రయై । తనరెవిలాస సంపదలు తగ్గయుమించె విచిత్రవైఖరిన్॥సీ॥
జలజాక్షి నగుమోము చంద్రుఁడు శారద పూర్ణిమాశశిబోలె పొలుపుగాంచె ।
ముద్దియకమ్మకెమ్మోవిమాణిక్యంబు సానదీరినరీతి చాయఁలూనె ।
పద్మాక్షి వలిగుబ్బ బంగారుకుండలు మెఱుఁగు బెట్టినరీవి మెఱుఁగుమాపె।నం
గనామఃశిమోహనాంగ హేమశలాక పటికనార్చినరీతి బాగుమీఱె ।
మరియు వాసంతవేళఁ గ్రొమ్మావిలీల। తొలుకరినిమించు కేతకీ దళము
పోల్కి । వింతచెలువున రేవతీకాంత వెలసె । హలధరుని యోగమా
యామహత్త్వమునను॥ వ॥ అంత గర్గాది పురోహితులారేయి వివాహ
ముహూర్తంబున్నదని విన్నవించిన నెంతయు సంతసంబున యాదవసార్వ
భౌముండు పురంబు గైసేయించిన॥ సీ॥ రాజబింబాననల్ రాజవీథులఁజల్లు
మలయజోదకముల జలకమాడి । మేలిమిమీఱంగ మేలుకట్టులుగట్టు
రమణీయచీనాంబరములుగట్టి । కేవలరమ్యమౌక్తిక రంగవల్లికా తార
హారంబులు దనరబూని । కమనీయవిపణికా ఘుమఘుమాయితబహు
పరిమళంబులు మేన నెరువుపఱిచి । మానితవితాన కుసుమ దామములు
దాల్చి । ప్రతిగృహద్వార రత్న దర్పణములందు । కాంచుచున్నదనా
ద్వారకాపురంబు । లక్ష్మిమెప్పె జతుర్విధాలంకృతులను॥ వ॥ అం
తట బలభద్రుండును మంగళతూర్య ఘోషంబులు మొరయ నభ్యంగన
స్నాతుండును జతుర్విధాలంకార సమేతుఁడునునై సమావర్తనాది వైవా
హిక శుభకృత్యంబులు నిర్వర్తించి కల్యాణవేదికాంతరంబున నున్నయె

డ॥ సీ॥ శిరసుమజ్జనమయి నెరిగొప్పవవరించి యరవిరి విరవాది సరులు దురిమి । వలిపె చెంగావి పావడనిగ్గులీనంగ జాళువాసరిగంచు చేలగట్టి । తిలకంబుదీర్చి చక్కులజవాదియలంది గుబ్బచన్దోయి కుంకుమముబూసి । కట్టాణిముత్యాల కమ్మలు మొదలుగా నవరత్నమయభూషణము లుదాల్చి । నిలువుటద్దంబులోపల నీడజూచి । వ్రీడ చలియించు కపురంపువీడె మంపు । కెంపుకెమ్మోవి కొకవింత సొంపునింప । రేవతీకాంత యభినవ శ్రీ చెలంగ॥ గీ॥ రేవతీకాంతతోఁ దెచ్చి రైవతాఖ్యు । భూమిపాలుఁడు మధుపర్క పూర్వముగను । రామునకుధారవోసిన రామ కేలు । పట్టె బలరాముఁ డెంతయు ప్రమదమునను॥ క॥ అప్పుడు పువ్వులవానలు । దెప్పలుగాఁగురిసె మ్రోగెదివిదుందుభులు । ముప్పిరిగొనుమోదంబున । నొప్పిరి జనులెల్ల నమ్మహోత్సవవేళన్॥ వ॥ ఇవ్విధంబున సకల సంభ్రమంబులు గలిగి వెలయు రేవతీబలరాముల వివాహ మహోత్సవంబు కన్నులపండువుగాఁజూచి వైవాహికదినచతుష్టయానంతరంబున రామకృష్ణానుజ్ఞాతుండై రైవతకమహీపతి బదరికాశ్రమంబునకుం దపంబు సేయంజనియె నంత॥ మ॥ కళుకున్మిత్యపు గచ్చుసౌధముల సింగారంపు పూఁదోఁటలన్ । జలధిప్రాంతరకాంతసైకతములన్ సౌవర్ణ గేహంబులన్ । నెలతాతిన్నెల తూగుటుయ్యెలల మాణిక్యంపుమేల్కట్టులన్ । బలుఁడా రేవతిఁగూడి క్రీడసలిపెన్ భావంబు రంజిల్లఁగన్॥ సీ॥ అదివింత యిదివింత యనిరిత్తజూపుచు సొలపుచూపులసారె జూడనేర్చె । చెలిమితో వయ్యెద చెఱఁగుదెమల్చుచు విడుమంచు నొయ్యన నుడువనేర్చె । నరవింద మందుకొమ్మని కేలు పొడవెత్తి వలిగుబ్బ లురమున నలమనేర్చె । నధరబింబముజుఱుక్కన నొక్కికిన్కతో మినుకుచెక్కిలిగోట మీటనేర్చె । సొంపుమీఱంగ కళలంటి సొక్కనేర్చె । గూడిరతికేళి వేడ్క నోలాడనేర్చె । కూర్మిగొనరుచు నంత బైకొనఁగనేర్చె । నెఱతనంబున రమణుఁ డన్నియునుసతికి॥ క॥ కతిపయ దినములలోపల । జతురత ప్రౌఢత్వ మొందెదిజవ్వనియొకనాఁ । డతిముదమున రైవతక । క్షితిధరమున మెలఁగు

చుండి చెలువున కనియెన్॥ సీ॥ మునుపిందు కదళికా వనరాజి చెలువొం
దు బందిటి ద్రాక్షల బ్రబలెనిప్పు । డీకానలోపల నేగాననీకాన నెంతగా
బలిసె ప్రాణేశ కంటె। యమృతోపమానంబు లాదొనయంబువు లనిశంబు
మాతండ్రి కదియ బ్రియసు। పొలుపొందెగొజ్జగి పూదేనెకాలువ నీవుదీ
ర్పించితో నిన్న నేడు । మొన్న జూచిన యటువలె నున్నదపుడె । యింతలో
పలెనే యెంత వింతబుట్టె। ననుచు బలుకంగ బెడబెడలైనగంబు । గద
ల రేవతీప్రాణేశుఁ గౌఁగిలించె॥ చ॥ వెంవకు మంచు దేర్చె యదువీరుఁడునల్గ
డ జూపకట్టురా । పరగటనిల్చియున్న గము బాహుల నూపుచుమంచు
గట్టునా। మెరయు కపీంద్రుజూచి తరమే ధరమెత్తగ నెవ్వఁడీవురా। యె
ఱుఁగవె రామునన్ వనచరేశ్వరుఁడన్ ద్వివిదుండ శూరుఁడన్॥ క॥ తరమే
పెకలింపఁగనీ । గిరియంటివి మునుపుజానకీపతి పనుపన్ । శరనిధిగట్టగ
దెచ్చిన । గిరులశిఖర మాత్రమింత గిరియెయ్యదియున్॥ క॥ నాసఖుఁడ
గు నరకాసురు । శాసించెను శౌరిగాన శైలముతోని । న్నాసంద్రంబు
న వైచి ము। రాసురరిపుతోడముంతు నట ద్వారకయున్॥ క॥ అనినూ
ట లాపుచు నెయా । ఘనశైలం బగలజేయఁగని హరికినుకన్ । తనముస
లంబున వ్రేసిన । వనచరపతి శిరముపగిలి వసుమతిగూలెన్॥ వ॥ ఇవ్విధం
బున ద్వివిదు వధియించి యెప్పటిలీల బాలికామణిం గూడి కేళిసీరమణి కేళి
శాలోలుండై వినోదింపుచు హాలామనోహరుం డొకనాఁడు పూర్వాను
భూతగోపికలం దలంచి నందవ్రజంబున కొక్కరుండచని చందన ప్రతి
వందనాలింగన మృదుభాషణంబుల నందయశోదా శ్రీదామోపనందా
ది బంధువులకు సంతసంబు సేయుచు జరాసంధాది పలాయనంబు నొడువు
చు ప్రొద్దుగడుపుచున్నయెడ॥ సీ॥ మధుమదాకులహలాయుధవిలోచన
లీల నరుణుఁడై యరుణుఁ డస్తాద్రిఁజేరె। వరుండు వారుణీ వరుసకీవచ్చు
చెంగావి నా సాంధ్య రాగంబు మెరసె । హలిహలాకృష్టయై యమునయో
గతిలింపు ననురీతినిండె గాఢాంధకార । మాతమోమయమునపై నలరారు
దెలికల్వ విరులునాఁజుక్కలు విరివికొనియె । గలితనీలాంబరుండును గా

నుపాల్పుఁ। డమలవర్ణుఁడు రేవతీరమణుఁడగుట। రాము పోలిక లోకా భిరాముఁడగుచు। సోముఁడుదయించె సురసార్వభౌమదిశను॥ గీ॥ పాంథజనములు గొమ్మల బ్రాకుగోర। సారిదియొండొంటి లతికూన లొరిగిపడగ। ధరణిచక్రంబు నిగుల సంతాపమంద। నడరె రేయెండలప్పుడత్యద్భుతముగ॥ వ॥ అట్టిసంగు వెన్నెల నద్వైకకుండయి గోపికాపుండరీకనయనల సంకేతంబులఁగూడుక యమునాతీరంబునకుంజని॥ సీ॥ కలికియీపొదరింటగాదె నీవూరకె కినిసినాచేత బ్రొక్కించుకొనుట। తెరవయీద్రాక్షపందిటగాదె నడికిరేయనివచ్చి నీవు నన్నేలికొనుట। మెలఁతయీగుజ్జుమామిడి నీడగాదె చిల్కలుపల్కఁ జెలులంచు నలికిపడుట। వనితయీకదళికావనిగాదెదళవీజనముచేరతాంతర శ్రమముడుపుట। దలచుకుందువె యీసైకతమున గాదె। కానబైకొనకున్ననో చానమంచి। దత్తుకోఁజెప్పి కొట్టింతు ననినజడిసి। నీవునాకోర్కి దీర్చుట నీలవేణి॥ క॥ అనియిష్టాలాపంబుల। వనిదిరుగుచు మద్యపానవాంఛజనింపన్। వనితామణులుందానును। గొనియెన్ మదిరారసంబు గుత్తుకమోపన్॥ సీ॥ అలవకతెప్ప వేయక చూచుచునుదెల్పె భామయార్తగుణాను భావకటిమ। గాంతునేరముద్రోచి కౌఁగిలింపుచుఁదెల్పె నాతియొక్కతె ప్రసనాతిశయము। దలయూచినొక్కుచు దలపించెనొకపంకజాననగంధోత్తమానుభవము। పరిహాసబహుళోక్తి ప్రకటించెనటనొక్క కంబుకంఠరవిరాళి కాకలంబు। హాసనకుసుమంబు లందంద నెసగజేసి। వనితయొక్కతె విధువైభవంబుసూపె। కన్నుగవయందు సాంధ్యరాగంబు మొనయ। గాంతయొక్కతె వారుణి గరిమనెరపి॥ మ॥ తళుకుంగుబ్బలపైట ద్రోయ మనికాంతల్ దూరహాలామదా। కులితస్వాంతయొకర్తు వేగజిలుగుంగుచ్చుల్ కొంగెత్తిగు। బ్బలపైగప్పిన బైలుదెల్పఁగ నఖాంకంబు వీక్షించియో। చెలువా సిగ్గరివౌదువంచు నగియెన్ చిత్తేశ్వరుం డింపునన్॥ గీ॥ కొదమగుబ్బల తావిఁకుంకుమ పూత। విభుఁడు చెంగావి అవికంచువిడువఁబోవ। గొనక చూపుల దప్పించుకొనుచునొక్క। కలికి వెన్నెల పైట

గాఁగప్పు కొనియె॥ సీ॥ ఓయత్తదీనికి యూరకేనన్నేల కొట్టెదవనినొ
డ్డుకొనియె నొకతె । మగడువచ్చె నటంచు మచ్చికఁగట్టుకొంగెడలించి
తమిఁబడకిచ్చె నొకతె। యొకసుధాఘటి నెత్తినుంచి చల్లోచల్లయంచును
వనవీధికరిగె నొకతె। యెలనాగబలరాముఁడేల రాఁడాయె నేయని సారె
ముచ్చట లాడునొకతె । తోడికోడ లటంచును తోడిచెలిని । దబ్బర
లెత్తిపెట్టెనొక్కతె దానితనదు । కోడలంచును చెక్కిలి గొట్టెనొకతె ।
మదిరసొక్కున గోపికామానవతులు॥ మ॥ మదిరాపానవిఘూర్ణ మాన
నయనున్ మత్తద్విరేఫాలకున్ । వదనాంభోరుహ గంధలుబ్ధమధుపవ్యా
ఘాతలోలద్భుజుం। గదుకర్ణోజ్జ్వల వజ్రకుండలు వలగ్న ప్రస్ఫనీలాంబరున్।
మదధామున్ బలరాముఁజూచి వ్రజభామారత్నముల్వేడుకన్॥ మ॥ తళు
కున్ జెక్కిలి ముద్దు కెంపుజిగినిద్దాకమ్మకెమ్మోవి తే । నెలు నాలింగన
మంగనాజనములెంతే వేడ్కతో నొండొరుల్। పలుమాఱుం దగ మార్చి
కొంచు సుఖయింపన్ వారితోఁగూడియా।బలభద్రుండును గ్రీడసల్పుచు న
నల్పంబైన దర్పంబునన్॥ ఉ॥ వారివిహారముల్ సలుప వాంఛజనించెను
జేరరాఁగదే।వారిజమిత్రపుత్త్రియని వాకొనిపిల్చిన ఫేనహాసము। ల్మీరగ
నెంతవేడనుచు మించిచనన్ యమునాప్రవంతికి । న్నారగజూచి యల్క
నుహలాగ్రమునన్ బెకలించె నత్తటిన్॥ వ॥ ఇవ్విధంబున గోధుగ్వధూ
విధంబున స్వేచ్ఛచూనసమధిక క్రోధధనంజయ క్వథితనయన పథుండగుచు
హలాయుధుఁడు నిర్ణిరోధపాద ప్రవాహధామానిధితనుభవారోధంబు
విశ్లథంబుగావించి శతధాప్రవహింపఁజేయు సమయంబున॥ సీ॥ కోడెజ
క్కవగబ్బి గుబ్బచన్నులమీఁద దరగ పయ్యెదకొంగుపొరలి పడగ। తమ్మి
కన్నుల మరందపు బాష్పములు చింద గరువంపు తేటిముంగురులు చెదర।
జలపక్షిమేఖలా కలకల ధ్వనిమించ సైకతజఘనంబు సంచలింప । నబ్జ
పాదంబుల హంసకంబులు మ్రోయ బెళుకు బేడసచూపు బిత్తరించ। న్న
పబలాకృష్టపరమృగీనేత్రభోలి । హరికరాకృష్టవేణియై జలనినాద ।
నటన మొరయుచు యమునబృందావనంబు । సందుఁబ్రవహించె వ్యాకులి

తాత్మ్రయగుచు॥ గీ॥ అంత భయమున కాంతయై యమునఁజేరి। సీరికిదీన
ప్రమదై కటాక్షించినన్ను । తగునె కులసతి మార్గంబు తప్పినదువఁ । బరులు
నవ్వరె రేవతీ ప్రాణనాథా॥ చ॥ అలుక శమించి సాపయి హలాయుధ
తావక లాంగలాగ్రని । దళితవిశీర్ణమంతట నితంబములన్ నఖరేఖ
లట్లనీ । హలముఖరేఖలంగని వయస్యల జోలు సపత్ని కెల్లబాం । సుల
వయితంచు నవ్వెదరు శుద్ధపయోజనిభాచలంబునన్॥ చ॥ జలనిధి రేమ
మియంచనునో చయ్యనఁబోవలె తోడిచేడియల్ । నిలువకపోయి రేపగి
ది నిందగడింతురో యంచువేడినన్ । బలుఁడుదయాళుఁడై భుఁ నపావని
యేమిటి కింతమాటనీ । చెలువుని జేరుమఁచుబని చెంగని చెంతల పాదుమె
చ్చెఁగన్॥ గీ॥ కొదమరాయంచ జవరాండ్ర గుంపుతోడ । సరసివిహరిం
చు రాజహంసంబుబోలి ।. గోపికాహంసయానలఁ గూడియామ । నాం
బువులఁదేలె యదురాజహంసమపుడు॥ క॥ ఈరీతిఁ గొన్ని దినములు । నారీ
తిలకములఁగూడి నందవ్రజసం । చారముల నలరియంతట । ద్వారావతిఁ
జేరెఁ గృష్ణదర్శనరతుఁడై ॥అంత॥ సీ॥ వలపుమీఱఁగస్వయంవరమహోత్స
వమున లక్షణాకన్య బలంబుమెరసి। కొనివచ్చుసాంబుని కినిసిపట్టుకచన్న
కురుకుమారులఁగని క్రోధమునను । బదఘట్టనలమహీభాగ మట్టిట్టుగా
నలసీరినడిజేరి హస్తిపురము। ఫలసాలమూలంబునను లాంగలముగ్రుచ్చి
పెకలించ ఫెళఫెళ పెకలిపురము । యమునకై యొడ్డగల భీతి సాంబుతో
డ । లక్షణాకన్య నర్పించి యాక్షణంబె । జేరిమ్రొక్కు సుయోధను
చెలిమిమీఱఁ । గౌఁగిటనుజేర్చె రేవతీకాంతుఁడంత॥ గీ॥ అవనియొక్కఁ
డె సాంబుకల్యాణవేళ । పెల్లగిలె యట్టిదేవుని పేరివాని । పెండ్లికొక
పట్టణంబైన పెల్లగిలదె। యనుచు భీష్ముఁడు నగియెఁ దాలాంకుఁజూచి॥ ॥
అంత హస్తినాపురప్రవేశంబుచేసి సాంబునకు లక్షణాకన్య వివాహంబుచేసి
కొని దుర్యోధనుం డరణంబుగా నొసంగు శతాంగమాతంగ తురంగమణి
మయ భూషణాంబర కోటులఁ గైకొని ద్వారపతి కరుగుదెంచె నప్పు డి
క్కడహస్తినాపురంబు యమునానది కొడ్డగిలినక్లైయున్నదీ బలదేవు భుజా
బలంబు సన్నుతిప నవ్వారతరంబు యదియునుంగాక నింకనొక్క విచిత్రంబు

వినుము॥ సీ॥అలభోజపురమున ననిరుద్ధునకురుక్మి పతి పెండ్లి చేసితర్వాతరుక్మి। ద్యూతంబుదలపెట్టి యొడ్డినయాపెల్ల గెలిచిహలాయుధు గెలిచేయ। చేన చ్చినట్టిపాచికెలు గావునగెల్చె దదివద్దనుచు వేఱె యక్షములను। గ్రీడించ హలిగెల్చు గెలుపులన్నియు రుక్మి కాదనివాదించ గలజనంబు। వానినెగూడి యాకాశవాణియపుడు। బలుఁడు గెల్చెనటంచన నలిగిబలుఁడు। రుక్మినష్టాపదంబున రూపణాచి। పరనృపాలు రతరమె దోర్బలము మెఱయ॥ చ॥ జనకక్షోణి విభుండు భక్తుఁడగుటన్ సౌహార్ద్రిమింపొందఁగాఁ। జనితత్పట్టణ వాసియై యతనిచే సంపూజితుండై సుయో। ధనుఁడచ్చోటికి వచ్చి శిష్యుఁడయి పాదద్వంద్వ సంవాహనం। బొనరింపం దెలిపెన్గదా కదన నానోపాయముల్మక్కువన్॥ క॥ కురుపతి శిష్యుండయ్యెం। హరిఘకుము పాండుపుత్రు లనిచేయఁగఁదా। నిరువురఁ గలయుక తీర్థా। చరణంబునకరిగెసీరిసమరము వేళన్॥ వ॥ అరిగియశుభతిమిరవిభాకర ప్రభాసముదంచితంబగు ప్రభాసతీర్థంబున గృతస్నాతుండై నిజవిలాస సముదిత సరస్వతియగు సరస్వతీతటినిమునింగి గగనరమాకబరీసుమనఃకోరకాయితబిందుసరంబగు బిందుసరోవరంబున నవగాహనంబుచేసి కలుషభూదర వజ్రధరంబగు వజ్రతీర్థంబున మజ్జనంబొనర్చి రామాది భూపాలతటస్థాపిత మానసరయూపంబగు సరయూనదిందాఁటి దురితలతా నివారణాసియగు వారాణాసింజేరియచ్చట॥ మ॥కనియెన్ రాముఁడభంగమంగళతరంగన్ రంగదంభోధిలం। ఘనసంప్లావిత దేవమానవ భుజంగన్ జంగమాఘచ్ఛటా। ఘనవైశష మదివ్యనామశతసంగన్ సంగరాసింధుబిం। బ నభశ్చారితరూప మానసుషమాంభా గంగ గంగానదిన్॥ వ॥ కని వినయపూర్వకంబుగా నమస్కరించి॥ మ॥ నవరించెన్ యమునాభమాధవు సుస్వత్యాభ పద్మోద్భవున్। భవదీయచ్ఛదిశంబు నైక్యమగుటం బ్రత్యక్షమా బ్రహ్మమీ। వవివేకాఘ్యుఁడు నీయెడందనుపులే పిష్టాన్నచో బ్రహ్మయో। గవిశిష్టాత్ముఁడవో లెముక్తిగను గంగాసంఘముక్తిప్రదా॥ వ॥ అని నుతియించి స్నానదానంబులుచేసి ముముక్షుజన శరణ్యంబగు నైమిశారణ్యంబున కరిగి తన్నుంగని

ప్రత్యుత్థానంబుసేయని ప్రతిరోమజాతు సూతు ముసలాఘాతంబున గతజీవితుంజేసి మునిప్రార్థితుండై పురాణార్థవేది పునర్జీవితుంగాఁ గటాక్షించి సవనాంగణకల్పిత మునిజనరక్త పల్వలుండను నిల్వలతనూభవుండగు పల్వలువధియించి మునిజన సంస్తూయమానుం డగుచుఁ బ్రశంసాపరానాశికయగు కౌశికం దీర్థమాడి ప్రతిదినకల్పిత విప్రయాగంబగు ప్రయాగంబున కరిగి కృతమజ్జనుండై సంశ్రితాపాశయగు విపాశను కోకనదశోభా శోణయగు శోణంబునం గృతమజ్జనుండై తరువిజిత మహేంద్ర నగంబున నిశ్చలసమాధిలీలాసమావృత రేణుకాయని రేణుకం దర్శించి కృతమజ్జనా గోదావరీతి వెలయు గోదావరీ తీరంబుచేరి కృతస్నానుండై వినీతశ్రీశైలంబు దర్శించి వేంకటాచలంబున కరిగి॥ సీ॥ జాతికిరీట పచ్చల కిరీటముడాలు ఖంజరీటంబులు పుంజుదేలుప। మకరకుండలమరీచికఁ బోల గండలీ మండలీనాట్యసంభ్రమముఁజూపఁ। గరశంఖచక్రముల్వరచక్రతిమిర వారణ చక్రరిపుహిత ప్రౌఢిమెఱయ। రమణీయ పీతాంబర ప్రభాతంబరమంబరంబునకు హేమంబునెరప। వక్షమునఁ గౌస్తుభంబు శ్రీవత్సతులసీ। దామముల కాంతియును సముద్దామలీల। గలసి కుంకుమ కస్తూరికల ఘటింప। మెఱసికొలువుండు వేంకటేశ్వరునిగాంచి॥ సీ॥ సదయిపీయూషోత్సర త్సకలదీక్షావని గనుపట్టు వీరరాఘవునిఁగొలిచి। ఊష్మకాంచి యనమించు కాంచీపురంబులో విలసిల్లు వరదరాజులభజించి। యుభయకావేరీ మహోజ్జ్వల శ్రీరంగధాముని శ్రీరంగధాముఁ బొగడి। దక్షిణద్వారకాస్థలముననుండు కృపాలుఁడౌ రాజగోపాలుఁజూచి। దర్శనంబున బ్రహ్మహత్యాసువర్ణ। దోషణాది మహాదోషములు దొలంగఁ। జేయుటకు హేతువౌ రామసేతువునను। మునిఁగి రామేశ్వరుని పదములకు మ్రొక్కి॥ గీ॥ ముత్యములుబండునవిలోన మునిగినుంచి। గంధముగు కొండయందు నగస్త్యమౌని। భర్గుసేవించి కన్యాఖ్య దుర్గగాంచి। భక్తిగోకర్ణనాథుని బ్రణుతిఁ జేసి॥ గీ॥ అంత మాహిష్మతీపురి కరుగుదెంచి। భక్తి గను తీర్థమాడి ప్రభాసమార్గ। మునను సీరి కురుక్షేత్ర మునను గాంచె। మో

ధమానుల భీమ దుర్యోధనులను॥ క॥ కాంచి దయ న్వాలదనివా । రింప
చు వినకున్న శ్రీహరి ప్రహితుండై । కాంచనమణిమయ భవన । ప్రాం
చితమగు ద్వారకాపురంబున కరిగెన్॥ సీ॥ బలదేవుఁ డొకనాఁడు పద్మా
క్షుతోఁగూడ ధర్మనందను సభాస్థలికివచ్చి । యిష్టగోష్ఠిని వసియింపనా
తఁడహారి యరుదెంచి సత్కృతుఁడై వసించి । బకునిహిడింబుఁ గీచకు
నిజరాసంధు రారాజుగెల్చి విక్రమముమెరపి । ఘనుఁడు గదాయుద్ధమున
నుభీముఁడు బలఁదేవునకొరునకు దిగుడుగాని । యనిన నటులేల బలుస
రి పెనఁగలేనె । యనిన భీముని గనుఁగొని కినుకబొడమి। సీరి గదదిక్కు
జూచినచిత్తమటుల। నైన నాకోర్కె ఫలియించె ననుచులేచి॥ క॥ భీముఁ
డుగదగైకొనినన్ । రాముఁడు గదఁబూనెఁ గ్రోధరక్తాక్షుండై । యానేటి
మగల గనుఁగొని । భూమీశులు మిగులవెరగు బొరయుచుఁదమలోన్॥
సీ॥ కలహశీలియిప్పు డెక్కడనుండివచ్చెనో యన్యోన్య రణమున కనియెనొ
కఁడు । గురుఁడుగాఁడేసీరధరుండధికంబెన్న దనకేల సీరోస మనియెనొకఁ
డు । ఇతనిశిష్యుఁడు కురుపతి గల్వఁడేసీరికిని సరిబోరఁడే యనియె నొకఁ
డు । నవియేటిమాటతాలాంకులోపల సహస్రాంశంబుబోల లేడనియెనొ
కఁడు । వలదు బలభద్రుతోనేల కలహమనుచు । బుద్ధిగొలడని సమన
ర్తిపుత్రసఖులు । దెలిపి వినకున్న నూరకె నిలిచిరంత । నురివిబలభీమసేను
లొండొరులదాకి॥ ఉ॥ ఆర్పులసట్టహాసముల నబ్జభవాండము లుప్పతిల్లఁ
గా । దర్పము మీఱఁ బోరుమదదంతుల పోల్కియు కాఁతలోకభి । ద్దర్ప
కవైరిరోషమున దారుణులై యరుణాయతాక్షులై । నేర్పులుమీఱఁ బోరి
తనినిష్ఠురమైన గదారణంబునన్॥ క॥ తనశిష్యుండైనసుయో । ధనుజంపె
నటంచు మిగులదారుణమగుకి । న్కనుగొట్టె బలుఁడుభీముని। యనిల
సుతుండతని గురుఁడట్రంచుంగొట్టెన్॥ క॥ బలు గద పెట్టునభీముఁడు। కులి
శాహతిఁ గొండఁబోలి గులగులలగున । బ్బలుఁడనిలజు గదపెట్టున ।
యలరు సరిన్ . విట్టయట్టులలుకడు కడిమిన్॥ గీ॥ చేరిమూఁడునాల్గు చేతు
లు వెడలిన । యంతఁబోన నలసి యనిలసుతుఁడు । చెదరి యదరి చాల

పెదవులు దడుపుచు । స్రుక్కినాల్గు దెసలు చూడఁదొణఁగె॥ క॥ అప్పు
డువిడువక ప్రేసెం । గుప్పున నడునెత్తిపగులఁగొట్టఁగ వెడలెం। గొప్పె
ర నెత్తురుభీమున । కప్పాండవలోచనముల నశ్రులుగారన్॥ సీ॥ కన్నీళ్లువ
రదలై గారఁగాఁగుంతియు ద్రౌపతియొకచోట దల్లడిల్లఁ । మునుపు నేచె
ప్పిన వినఁడాయె గార్యంబు దప్పెనంచునుధర్మ తనయుఁ డడలఁ । జూచి
యుపేక్ష చేసుకయున్న నాయమా కృష్ణ యటంచుఁ గిరీటినుడువ। ధా మ్యా
దులింత క్రోధంబేలశిష్యుపై నంచునక్కడనుండి యభినుతి ప । గినిసియె
వ్వరు చెప్పిన వినక భీముఁ । జంపఁగడగెడు యాదవసార్వభౌము। కేలు
గదగూడబట్టి శ్రీకృష్ణుఁడప్పు । డేల వలదన్న కోపంబు చాలునన్న॥ క॥
హరి వాక్యామృతధారం । బరుషరుషానామదావపావకుదారన్ । గరు
ణించివిడిచె లాంగలి। ధరుఁడనిలకుమారుఁ శాంబు తనయులు చెలగన్॥
క॥ కళబట్టిపడిన భీముఁడు । దెలిసెన్ హరికరుణనంత దేవుఁడనిన్నున్ ।
దెలియకపోరితి నేరము । గలదనఁగా భీముసీరి కౌగిటఁజేర్చెన్॥ ఉ॥
పుణ్యము శౌనకాదిమునిపుంజ శరణ్యము నైననైమిశా । రణ్యమునందు
నొక్కమఖరాజ మొనర్చెను రేవతీసతీ । మణ్యచిరాముఁడై బలుఁడమా
నుషవైభవముజ్జగత్త్రియీ । గణ్యములై తదంగజనకామితము ల్దయ
సేయఁజాలుచున్॥ గీ॥ సాంగదక్షిణలొసఁగుచు సవముజేసి । యవభృ
ధస్నాన మొనరించె సతివఁగూడి। సకలబంధు జనములతో సంభ్రమమున।
గలుష తిమిరహరుండు లాంగలధరుండు॥ సీ॥ ధగధగద్ధగితరత్న కిరీట
కాంతులు పదివేలభాను బింబములు దెలుప । దళదళద్వజ్రకుండలకాంతి
మండలీగండ మండలమున నిండి కొనఁగ । జకచకజ్జలదమేచక కటీర త
టాంచలము భుజాగ్రమ్మునఁ గొమరుమిగులఁ । గలకలక్వణిత కంకణము
ఖ్యనవరత్నమయభూషణములు నెమ్మెయిదనర్పఁ। బుష్పవర్షంబుసురదుం
దుభులరవంబు । బ్రహ్మరుద్రాదినిర్జర ప్రణుతులలర । బ్రహ్మరథమెక్కి
రేవతీ ప్రాణభర్త । ద్వారవతిచేరి పాలించె వైభవమున॥ క॥ ఇదిబల
రామచరిత్రం । బిది దురిత లతాలవిత్ర మిదియతిచిత్రం। బిదిభక్తియు

_క్తివినిన౯ । జదివిన జనుఁడిందునందు సౌఖ్యముఁ జెందు౯॥ క॥ మునుబలుని చరితఁ దెలిపిన । వెనుక౯ కృష్ణుకథనీకు వివరించెదనం । టినరేంద్రా యిపుడదివిను । మని మునిపతిదెలుప దొణగె నధిపతితోడ౯॥

బలరామావతార చరిత్రము సంపూర్ణము.

## శ్రీకృష్ణావతారము.

శ్రీమత్కృష్ణనలాహకంబు సుమనశ్శ్రీదాయియై దేవకీ । శ్యామాభ్రంబునఁబుట్టె శ్రావణమున౯ సద్యోగళత్త్రాపథా। శ్రీమానుష్యముపై గృపామృతమువర్షింప౯ నిజోరఃస్థల । శ్రీమించ౯ దులకింప నిచ్చ సురభేరీగర్జనల్మీఱఁగ౯॥ సీ॥ కమనీయ దేవకీ గర్భసంభవుఁడయ్యు రోహిణీసంభవ రూఢిఁగాంచి। దివ్యమానధరావతీర్ణుఁ డయ్యునభోవతీర్ణవిఖ్యాతిచే తేజరిల్లి । కృష్ణపక్షమునభ్రాజిష్ణుఁడై కలిగియు శుద్ధపక్షమున బ్రసిద్ధిఁగాంచి । యిందిరాలింగిత హృదయుఁడయ్యును రోహిణీనాథ సహజనిస్థితివహించి । చంద్రదశ దెల్పముద్రికస్థానభాను । కరణగనుపట్టు తేజంబు గురు ముఖేచ్ఛ। హేతువై దివ్య కారుణ్యదృష్టి వెలయ। శౌరిదనరారె సూతికాసదనమునను॥ గీ॥ ఘనమనోరంజక కరంజకప్రవాళ । మంజురుచి బాలుఁ గనుగొని మంత్రసాని । సమ్మదముపూని శూర్పానిలమ్మొనర్ప। బొడ్డుగోయఁగఁజూడ నద్భుతముగాఁగ॥ సీ॥ మొలిచె పొక్కిలిచక్కి దొలుపల్కులను బ్రమోయు నలుమోముతమ్మెద గలుగు తమ్మి । పొలిచె మస్తమ్మున భూరిరత్నప్రభా పాళిలాలితకోటి హేళిమాళి । నిలిచె హస్తంబుల నిఖిలదైతేయ భయంకరోదగ్ర పంచాయుధములు । వలచె వక్షంబున వైజయంతీదామ శోభిత తులసీ ప్రసూనపటలి । మరియు కంకణ కేయూర మకరకుండ । లాదియగుభూషణముల హేమాంబరములు । జారుతరమైన మేనితేజంబుమీఱె । శౌరిపురిటింటిలోన సాక్షాత్కరించె॥ గీ॥ అప్పుడాశ్చర్యమును మోదమతిభయంబు । వెనుకొనఁగ మంత్రసాని వేవేగవచ్చి । యువనికడను నమోనమో యనుచుఁ గాంచి ! యున్నవసుదేవుఁ గన్గొని యుల్లమలర॥ సీ॥ పెడద కన్నులవాఁడు పెడద మూనికెపుతా వెడద కన్నులమిన్న నిడినవాఁడు ।

నీలకాయము వాఁడు నిర్దంపు తమిఁగుల్కు నీలకాయము వేల్పు వేలువాఁడు। కేళిచక్రమువాఁడు కితవుల మన్నించు కేళిచక్రము బ్రోవ జాలువాఁడు। వన్నెమించినవాఁడు చిన్నంపు పడియ అు వన్నెమించినవలె వాటువాఁడు। దేవదేవుఁడు దేవకీ దేవిగర్భ। జలధిజనియించె సంపూర్ణ చంద్రులీల। నేమి తపమాచరించిరో యీవుపూర్వ। మనెను వసుదేవు పాలిత భూమిదేవ॥ క॥ అని తెలిపిన వసుదేవుఁడు। వినిరోదవల దనుచు ననుచు వేడుకతోడన్। జని లక్ష్మి విభుఁగన్గొని। కనుగవనానంద బాష్ప కణములుదొరుగన్॥ చతుష్కండము॥ శ్రీవాసుదేవప్రియ స। ద్భావా వేదాంతవాద ఫలితామోదా। సేవింతు నిన్ను మునికృత। సేవాశ్రిత సుప్రసాద శ్రితబహుభేదా॥ క॥ పటుమతి ననుమానోక్తిన్। ఘటియింతు జగత్సకర్తృకం కార్యత్వాత్। ఘటవత్తని తాదృశునినిను। నిటువలెగాంచితిమి చిత్ర మేమనవచ్చున్॥ గీ॥ అనిపొగడ శౌరిదయ మీరి యాదివృత్త। మంతయును దెల్పి భావివృత్తాంతములను। దెలిపి యప్పటి బాలుని చెలువుగులుక। శయమునను బూన వటపత్రశాయితంద్రి॥ క॥ విడికెంపువడగ గొడుగులు। కడువేడుక శేషుఁడూన గాళిందియుగా। ల్నడగాఁగనరిగినందుని। పడతుకకడ కొడుకునునిచి పడుచును దెచ్చెన్॥ గీ॥ తెచ్చి కంసుని కొసగ నుద్వృత్తినెగర। వేసి యసిపూన నద్దేవి మింటనిలిచి। వేరెయున్నాఁడునీ వైరి పెత్రియనుచు। జనియెనటపల్లెలో మహోత్సవము జెల్లె॥ సీ॥ దళపుష్పఫలసమాకుల కోకిలమిళింద కీరంబులగుచు శృంగారవనులు। కలహంసనాదత్త కమలనాళమరాళ జాలంబులగుచుఁగ సారములును। కలశాబ్ధికల్లోల కల్పనోత్కటక్షీర క్షీరంబులై సైచికీమములు। నిరతిశయానంద నిర్నిద్రమానసాబ్జములనా బాలగోపాలజనము। లలరె వింతగు మాధవోదయమునందు। సత్తిలపర్వతంబులు సౌరభేను। లక్షణోజ్జ్వల ధేనుద్విలక్షనొసఁగె। ధరణిసురులకునందుఁడౌదార్యమునను॥ గీ॥ అభినవసుగాన్నైక సామగ్రి నుభయుకులయు। శోధన్మైమించు నట్టి యశోదయుంత। భూపః పోషణుపోషించె పుత్రిమమత। సరసముఁడును మాత

వత్సలత దనరె॥ గీ॥ మేదినీనాథ నెలలు తొమ్మిదియు మోసి । కన్న దేవకి యటులుండ కడకు నందు । భామినికిఁ గల్గె శ్రీకృష్ణ బాలలీల । కన్నులారంగ చూడ భాగ్యంబుగాదె॥ ఉ॥ జోలలు పాడఁగా మిగుల సొంపగుపున్నమ చందమామనున్ । బోలినకృష్ణు ముద్దు మొగముం బలుమాఱును ముద్దులాడఁగా । లాలనమించు జెట్టికములం గనుదోయి చెలంగి చూడఁగా । తాలిమి నేము నోచిరొకో తల్లియుఁదండ్రియు తొంటిపుట్టువన్॥ గీ॥ కంసుపంపున పూతన గామరూప । యగుచు చనుబాలు విషమియ్య నమృతమొసఁగె । వైరులందును దయగల వాఁడుకృష్ణుఁ । డాశ్రితులపట్ల నింక వేరెయడుగ నేల॥ గీ॥ బండిపడదన్ని తొడలపై బండి పర్వ । తల్లికిఘటించె సురఘూలి త్రుళ్లసంచె । చన్ను గుడుచుచు తల్లికి సకలజగము । లాస్యమునజూపె శౌరి మహాద్భుతముగ॥ గీ॥ అస్తిభాతిప్రియాత్మక బ్రహ్మమాత్ర । కృతిని వహియింపఁజూచి కృష్టాఖ్యుఁడయె । గర్గమౌనీంద్రుఁ డాగమ క్రమము మెరయ । నందునకు దన్మహాత్మ్య మంతయును దెలిపి॥ సీ॥ సిగను జుట్టిన తావి చెంగల్వలరవీడ గొనరావి రేక ముంగురులనాడ । నపరంజిమద్దికాయలు చెక్కుల నటింప కమ్మకస్తురి తిలకము రహింప । పంచరత్నముల పంచాయుధములు మించ దళుకుముంగామరంబులు సలింప । గంటల మొలకట్టు ఘణఘణధ్వనిసేయ నందెలు ఘలుఘల్లు మనుచు మ్రోయ । నబ్బెగాలిడి యొకపాశి యవనినూది । యన్యకరమున నవనీత మవధరించి । బాల్యమున క్రీడసల్పు గోపాలకృష్ణు । చెలువు వర్ణింప తరమె యా శివునికైన॥ గీ॥ సగమురాత్రి వేళ జనియింపఁ గానేమొ । జారచోరలీల మీ అశౌరి । విశ్వవిభుని కేలి వేళానుసరణంబు । లవియు నొకవినోద మయ్యెగాక॥ క॥ నందుని యింటను రాధయు । నందగు నొకకన్య జవ్వనంబున దనరన్ । గెందలిరాకు జిరాదొర । పందెము గెలుపింపఁజాలు బాగులు మెరయన్॥ గూఢచతుర్థి॥ కలికి చూపును కుచంబులు మోవిమోమునుకములారి బింబ విభ్రమముగాంచి । రమణికొప్పును మధ్యమము దృష్టినీగాయ వరుసనీలా భ్రాళి గరిమఁబూనె । మొలనాగ చెవులు పలుకులు కరం

ము మొకనవసితాబ్జ సూనాతిఁ నవఘళించి । మగువ నాసిక నితంబమున
ఖంబులు మేను స్వర్ణాచలాభాతి శయముగదిచి । కలికికుచఫల రత్నదర్ప
ణతమాసు । కాండశైవాల శష్కులి కానుకేకి । సలయుపాళి తలకుసు
మ సైకతాశ్చ । కుందకోరక తిలకలకుందుపఱచు॥ క॥ వల్లభునిఁ బ్రో
చురతిగతి । నెల్లప్పుడు ఱొమ్ముండించ కెంతయుదమి న। పల్లవమృదుప
ద బెనుపగ । కల్లరికృష్ణుండు దానిఁగనిమరిసాక్కెన॥ సీ॥ తొడలపై నుం
చి యుగ్గిడువేళ చికిలిపెందొడలసం దొయ్యన బుడికిజూచు । వేడుక
విందుల విందులంచునుబిల్వఁ గదిసిపయ్యెదజాచిఁ కౌఁగిలించు । నునుము
గ్దుబెట్టుమంచును వేడుకొన గోటికొనఁ జెక్కుమీటి మంబిన మొనచుఁ ।
ముదమతోనెత్తుక మోవిముద్దాడిన చక్కెరకెమ్మోవి చప్పరించు । పట్టు
కొనిలేచుగతినీడ్చు కట్టుకొంగు। తొలఁగిజఘనంబుగనుపింపఁ గెలసినవ్వు।
నన్నిమాయలు నేర్చెనే చిన్నికృష్ణు। డనుచుఁదనుబెంచురాధ మద్దాడ
శౌరి॥ ఉ॥ ఎవ్వరుపట్టిన న్నిలువఁడెంతయుఁగృష్ణుఁడుపోరు బెట్టెడిఁ। బు
వ్వనియెత్తుకొమ్ము పనిచాలునటంచు యశోదబిల్వఁగా । నవ్వుచురాధ యె
త్తుకొని నన్నగుకృష్ణుఁడు నుద్దివారలుం। దవ్వులవారు నిద్దరికి ద్వంద్వము
టందురు వారలుబ్బగన్॥ గీ॥ చిన్నికృష్ణుఁడు దినము గై సేయ వెన్న। ముద్ద
బెట్టగనెత్తుక ముద్దులాడు । గానివేరొక పనిసేయ గానరాదు । రాధ
కాదేవి మిగుల గారాబముననుం॥ గీ॥ అంతనైదేండ్ల ప్రాయంబునందె
శౌరి । తోడిబాలురతోఁగూడి వేడుకలర । గొల్లయిండ్లను వెన్నలుఁకొల్ల
లాడు । గొల్లలాడుకటూక్తికి గొంకులేక॥ సీ॥ వెన్న బెట్టెద మేది విద్దెమన్న
నుకోప రమణులయొద్ద విద్దెములుసల్పు । నొకయింత నేమరియున్నక
వ్వముఁదీసి పక్కనభాండముల్పగులఁగొట్టు। నదియేమిరాకృష్ణ యనిన నేమి
యులేదు చేతప్పిపడెనంచు చెలగినవ్వు । పట్టుకోవచ్చిన గ్రాహ్మదనైన
ను బట్టనేర్తురెయంచు పర్వులెత్తు । భామయొక్కతె వెన్నంటి పట్టికొ
నిన । మోముద్రిప్పి చురుక్కన మోవినొక్కు । నమ్మనేజెల నెంతకా
ముకుఁ డటంచు । తరుణివిడిచిన విడువక దాఁజెనఁగు॥ క॥ లోలయుగు

లోలలోచన । వాయింజనుదోయిఁ గేల వడిబట్టుకను । య్యాలోజంపా
లోయని । వ్రేలుంగృష్ణుండుసఖులు వికవికనవ్వఁ॥ మ॥ కినుకఁ వ్రేఁత
లువచ్చి కొల్లలిడియెఁ గృష్ణుండుపాల్వెన్నలం । చనినంగోపముతో య
శోదయది యేరాగృష్ణ వ్రేపల్లెలో । ననుపాల్వెన్నలుగొల్లబెట్టితని యన్నా
తల్లిలేదే తమిం । డ్లనెయుండేయన జూడబంప జనినిట్లు న్నిండియుండున్న
డిఁ॥ చ॥ పనివడిదొంగిలించుతరి బట్టుకకృష్ణుని దొంగసిక్కెర । మ్మ
నియొక ప్రోడచేడియలు నందఱుగూడుక తల్లియొద్దనుం । చినతరితత్తనూ
భవుని చెల్వముగైకొన నీకుమారు దం । డన మొనరింప మేమువలెనాయ
న సిగ్గున బోదురందురఁ॥ సీ॥ జనయిత్రి రోటగట్టిన నర్జునంబుల బడ
ద్రోసెనద్భుత ప్రాయముగను । బృందావనంబున పృథుశక్తిదగధేను బృం
దావనముజేసె ప్రేమదనర । బకునిరోషారుణాంబకుని చంచులు రెండు
చించిచెండాడె విచిత్రముగను । వత్సరూపకుఁడైన వత్సదైత్యునిబట్టి వ
తుంబుబగులగా వైచిచంపె । బాలగోపాలకబళన ప్రావితాఘు । నఘు
విదారించె గహనమధ్యంబునందు । పద్మలోచనుఁడైదేఁడ్ల ప్రాయమున
ను । భక్తలోకైక రక్షణ ప్రౌఢిమెరసి॥ అంతనొక్కనాఁడు॥ ఉ॥ వెన్ను
నిబర్హిబర్హమును వేత్రముగేల గటీతటిఁబదా । ర్వన్నెపటంబు దట్టియు
రవాశికనాళము పైడికొమ్ముద । ధ్యన్నకరంబుగల్గి జెలువొందుచు గో
పక బాలయుక్తుఁడై । వెన్నుఁడుధేను బృందముల నెంటజరింపఁగఁజూచి
నివ్వెరఁ॥ గీ॥ జలజగర్భుండు గోపవత్సములఁడాచ । భక్తవత్సలుఁ డట్టి
రూపములనొక్క । వత్సరంబును మెలఁగశ్రీవత్సవక్షు । గాంచివెరగం
ది మ్రొక్కి నుతించెనిట్లు॥ సీ॥ మహనీయ తతపుష్పమాలికాంచితచం
చరీకపక్షసపక్ష కాకపక్ష । చిత్రేంద్రచాపరోచిస్సాంద్ర చంద్రికాం
చితకరాదికలాప కృతకలాప । బాలభానుప్రభా జాలకల్పనశీల కటితటీలో
లవిశాల కనకచేల । వేత్రదండవిషాణ వేణుదధ్యన్న ప్రశస్తపంకజశస్త
చారుహస్త । నందనందన శాశ్వతానందభక్త । నందనద్రుమసనకస
నందనాది । ముక్తజననంద కాకార యుక్తిదూర । నందకకరాబ్జ నిను

నన్నుఁ(బ్రోవు॥ గీ॥ ఏను నీమాయఁ దెలియనే నెంతవాఁడ । మోహి నీరూపమున శంభు మోహితాత్ముఁ । జేయవేమున్న నను దయ చేయు మయ్య । సంతతాత్మయ్య శేషభుజంగశయ్య ॥ గీ॥ జనకుఁడవు నీవు గోప వత్సలుఁడవౌట । నేను నటువలెనైతినే డింకెగాని । లేదు నేరంబు నామీఁద లేశమైన । నను దుఁ జతురోక్తి వినుతించి యజుఁడు చనియె॥ వ॥ ఇట్లు భక్తవత్సలుండు వత్సగోపాల బాలకుల మరలించి మఱియుఁ బెక్కువినోదంబులఁ జరియింపుచుండెనంత॥ క॥ ఏడెనిమిది వత్సరముల । వాఁడై కృష్ణుండు కొన్ని వగలఁ జరించె । న్వేషుకతో గాయకపుం। జాడలు విడువక నె గోప సహితుండగు చుక్॥ సీ॥ నాకుంబంతిదా నుకొన్న నునే నువిడుతునే యనిరొక్క చెలిగుబ్బ లంటిచూచుఁ । జెలువ యేకాంతంబు చెప్పెద రమ్మంచుఁ జెలియొగ్గి ననుగవ కీవలు గొను గు । పడతియీ యాముదినేమి ము డిచితే యేదేది విడుమంచు నను పోక ముడికిఁ బెనగు । గాఢాక్రిమస్గునం గనకుముం దైపుత్త్రి గనుగొమ్మనుచు నెత్తి గాఁగిలించు । నోడ లెరుంగక నిదురించు నువిదతొడల । గుచ్చలలుమెత్తి యత్తను దెచ్చిచూపు । నేఁచే సెవరిద్దచే యిందటంచు । దంపతుల వేడు హరియంట తనము మెరసి॥ చ॥ రమణి యొకర్తు యొంటి మధురాపురికిం బెరుగమ్మఁబోవుచో। సమయము చూచి పోకముడి జార్చిన జారెడు చీరఁ గట్టిగా । నమరిక లేక కుండ విడక త్తభయంబున దించుమంచున । క్కమలదళాక్షి వేడుకొనఁ గల్లరిచేష్టలు చేయుచున్న గుక్॥ సీ॥ క్షోణీశయంత యశోదతోఁ బుట్టిన కుంభకుండనియెడి ఘోషభర్త । మిధిలాపురము చెంత మేటిసంపదల చే దనరంగ నతనిమందను నిశాటు । లేడ్వురుమదమత్త వృషమూర్తులై చొచ్చి యనిశంబు బాటింప నతఁడు వీని । జంపినవారికి జక్కనినాకన్య భక్తిని చ్చెద నంచుఁ బ్రతిన సేయ । శౌరియటకేగి వృషముల సంహరించి । భువనమోహినినీలను స్వవశ జేసి । తత్సహోదరు శ్రీదాము దనకుమిత్రు । గాఁగఁ గైకొని వచ్చెనుత్కంఠ హెచ్చ॥ క॥ అనీలాకన్య యశో । దానందుల పట్లనెల్ల దగుభయభక్తు । లొప్పనుచు రాధాచంద్రుని । భావనతోఁ జెలి

మిసలువు నప్పయటం మఁ॥ వ॥ అంతక్రమక్రమంబున॥ సీ॥ మొనలుచూ
పెడిపినపినమొల్కు చనుదోయి యలంతిపయ్యంటకు నాసజేయు। గొంకు
వతెప్పలార్చుచుచూచు చూపులు మిసిమికన్గొలకులధునిగలంగ। జిగురా
కుపోలిం జిగిజూవువాతెర చిన్నలేనవ్వులు చెంగలింప। నొక్కింత భటు
లైన యుదుటు దెల్పెడి శ్రోణితటిపటంబునకు నెత్తరమునెరప। పొన్నపొ
క్కిలిలోఁ తైన సన్నమైన। నడుముబిగిజూపు నునుపోకముడికిలోఁగు। శాక
బీజాలివలెనూరు చందమొంద।నిలనవయావనంబున నెగడెఁజాల॥ క॥మద
వృషభంబులఁ గూలిచి। సుదతీమణిఁ దెచ్చునపుడు చూడఁగహరికిఁ।
బదుమూఁడేఁడులు గావున। బాదలుం జవ్వనయభువన మోహనలీలఁ॥సీ॥
కలికిసింగారంబు మొలకలోయన ముఖాబ్జమున నూనూగు మీసములుద
నర। కెంపులగెల్చిన కీర్తియోయనకావి మోవిపై చిరునవ్వు ముద్దుగులుక।
సంతతగోపికా స్తనఘట్టనంబున గడునయ్యనాగ వక్షంబుమెఱయ। గల
భహస్తోపమానములఁబోలియాజాను లంబియై బాహు యుగ్మంబువెలయ।
జవ్వనంబున గోపాల చక్రవర్తి। నిండుపున్నమ చందురు గండుమిగిలి।
కన్నుదోగలకు విందయి యన్నుగనుల। మనసు నెలతాల గరగింపమమత
నించె॥ గీ॥ పిన్ననాటనుండి కన్నులకింపయి। యున్న రాధమీఁదఁ గన్ను
వేసి। యున్నవాఁడుగాన వెన్నుఁడాప్రాయంపు। కన్నెపొందు గోరి సన్న సే
యు। సీ॥ ఫలపుష్పములు దెచ్చి పట్టుమంచునుబైట నించుచో గుబ్బ దా
కించుగేలఁ। నిక్కట్టుత్రోవల యెదురైన నెదురుగ నొయ్యారి మేనుమే
నొరయనేగుఁ। జీకటిలోఁగన్నఁ జెలియనాపైదయ లేదటేయని కౌఁగిలిం
పదివురు। సఖులతో రతి రహస్యములు ప్రసంగించు నెలనాగవినఁగ తానె
ఱుఁగనట్లు। చిలుకసాంబ్రాణి తేజివజీరు గేరు। కమ్మనెమ్మెన వగవగ
సొమ్ములూను। నెమ్మెమెరయించు శ్రీకృష్ణుఁడెల్లవేళ। రాధతిలకించు
కొనెపి యారాటమునను॥ క॥ శౌరికడు ప్రేమనిటువలెఁ। జేరికసేయం
గసిగ్గు చిత్తముగరఁగఁ। మారుఁడు పొడుపొడుమని యొ। య్యారంబున
వెడలెనంత ననురాగమునఁ॥ క॥ కిలకించితవతికృష్ణుం। దిలకించఁగ

సాగ సౌరె దిరుగుచుగుబ్బల్ । పులకించఁ గళుకుచెక్కుల । గులకిం
చుక చెమటజాలి కోర్కులుమీఱన్॥ సీ॥ పనిలేనిపనిబూని పైడియందె
యఘల్లు ఘల్లన గృష్ణుచెంగటవసించు। దనపైటయతని దాఁకినగిరుక్కున
మొగం బోరవైచుచూచు సిగ్గొలయుచూడ్కి । నేజెల్లనమ్మ వానికి సెల్లు
దోఁచునో చెరగుదాఁ కెనటంచుఁ జెలికిఁదెలుపు । నెటులదోఁచినవంచి
దేయన్న చాలును పొమ్మంచుఁగెంగేల తమ్మివైచు । నానసమువంచ బోట
వ్రేలనవని వ్రాయు । వేడినిట్టూర్పు లుంచు నా వెతయెఱుఁగ । వింతకదె
యంచు నన బోవు నంతలోన। గ్రక్కుమక్కువచొక్కి యక్కోమలాంగి॥
మ॥ నునుపయ్యెంటచెఱంగు జాఱి హరికన్నుం గోనలం జూచినన్ । గిను
కన్ వాతెర పంట నొక్కుచును జంకించున్ మృగాంకాస్యగ్ర । క్కున
లేదంచును శౌరికన్నులను మ్రొక్కన్ రాధ కెమ్మోవిపై । నెనయించుం
దరహాస చంద్రికల శ్రీకృష్ణుండు హర్షింపఁగన్॥ మ॥ కనుకో కృష్ణు నెఱుం
గనట్లు సఖియంగౌఁగింటికిం దార్చుచున్ । బెనగున్నాపయి బంతిలేదనుచు
గోపించున్ బలా యేలనే। యనుచున్నివ్వెర బాదితోడ నదిఱిన్నెట్టేవిలో
కింప ప। క్కుననవ్వున్ వలిచన్నుదోయి గులుకన్ గాఁదీగెజవ్వాడగన్॥
ఉ॥ కొప్పునజాజులున్ బిగువుగుబ్బలకుంకుమ తేనె మోవిపైఁ । గప్పుర
వీడియంబు జిగి కస్తురిబొట్టును నిచ్చచల్వయుం। జొప్పడవారకాంత వలె
జూడ్కికి విందొనరించెఁగాని యొ । క్కప్పుడు మైఁదోప నడయాడదు
రాధ ముకుందు చెంగటన్॥ సీ ॥ దోర్మూలములుగాంచు దొలగించుఁబ
య్యెద నాభిగన్గొన విత్తానానబూను। మురువుతోఁగెమ్మోవి గరచుచుతు
క్కున నుదుటు గుబ్బలునొక్క యొళ్లువిఱుచు । మెలతమైనొరగునేమో
చూచిపక్కున నగు బాలుముద్దాడు నన్నుఁజూడు । మనునొక్కవ్యాజంబు
నను జెంతఁజేరు చెక్కుల చెమ్మయని మీటు కొప్పునిమురు । కటిలేటంబఁటి
పొలయుఁ గ్రే గంటఁజూచు । బంతమీడేరెనా యని పైనివిరులు । వైచుఁ
గనుసన్న బిలుచు రావోయటంచు । జిలుక పైనిడి కెలయు నచ్చిగుర బో
ణి॥ క॥ అల చెలువ వలపుసొలపులు । దిలకింపుచుఁ జెల్వఁగిభళిర తెరకు

వదక్కన్ । వలకారిచిలుక యనిచం । కలుదాటించుచునుశౌరి గడుని
ర్భయుఁడై॥ సీ॥ మగువనీవ్రేలికి మట్టాయెనాయని కడవ్రేలుబట్టి నుంగర
ముబెట్టు । నిదిలెస్సయనుచుఁ బాలిండ్లమీఁదికిఁ బాణికమలముల్సార హా
రములువైచు । చెలిచూడవేయని చెంగల్వమొగ్గ యిందని వేఁడియిచ్చు
కర్ణమునను౦చు। కుంకుమయలఁదుచు గోటినితంబంబు కడవిదలించు పక్క
నహసించు । గురుజనంబులు నెడగల్గి తిరుగువేళ । శౌరిరాధనుజేరి రా
జసముమీఱ । నామిటారియు నతనిమాయలకు లొంగి । యుండెగావుఁ
న జెలరేగుచుండె నపుడు॥ క॥ వనితామణి యిటువలెన । వ్వనజాక్షున
కపుడుచాల వలచిమనంబా । ఘనవర్ణు చెంత దనువుం। బనిపాటలుమాని
మెలఁగు భవనములోనన్॥ సీ॥ ఒంటిపాటునఁగౌఁగిలొసఁగు తత్తరముతో
నంతలోపలమళ్లు నలుకుఁడైన । నేమైనఁజూచుచు నెఱుఁగనిరీతిని మాఱు
మోమునఁ జెంతఁజేరినిలచు । గట్టుకొంగెడలించి గట్టునల్లన గంభీరనాభి
క్రేగంటఁ జూడఁ । జెలియరావేయని చెయివేయఁజీకటిగాంచి నీవాయం
చు గడకుబోవు । నెదురెదుర చూచు మందల కేగియున్న । నేలరావై
తివని మాఱు నతనిజూచి । యతనిపల్కులె చెవియొగ్గి యాలకించు। వల
పునను రాధ కృష్ణుని వలకుదగిలి॥ గీ॥ మాధవుఁడు రాధనీరీతి మరలుకొల్పి।
మరియుగొల్ల మిటారుల మరులుకొల్పి । నారజపువన్నె బెట్టుచు ననుదినం
బు । వీధిలోపల విహరించు వేడ్కమీఱ॥ చ॥ మునిముని చీఁకటిన్నదువ
ముంగిటవాఁకిట నైననొంటిపా । టుననడయాడు జవ్వనులడొంకక పయ్యె
దయైనపట్టుయె । ననుజడయైనఁబట్టు నెఱనవ్వున కృష్ణుకలోఁగి రేనిగ్రగ। ఠక్క
నొకచోటు చూచుకొను కాదనినన్ వెడలున్ హుటాహుటిన్ ॥సీ॥జిలుగు
పయ్యెదమీఁదఁ జెక్కులచమరూర గనుతెప్పయిడకచూ డనిమిటారి। చెలి
యు చెక్కనను దోఁచిన కృష్ణవదనంబుకూర్మి మీఱఁగముద్దుగొనులతాంగి।
పులఖండములుగుల్కు బొమ్మంచుమోవికి గృక్కిళ్లుమ్రింగని కందరదన ।
పైడికంబంబున ప్రతిఫలించిన మూర్తిఁ కౌఁగిటఁజేర్చి చొక్కనిలతాంగి।
కలుగ నేరదు.రేపల్లెచెలులలోన । గురుజనంబులకళికి పైకొనరు గాని।

కరఁగఁగ రే చంద్రుఁగనుచంద్రకాంతమణుల । జోక గోపాలరాయనిఁ జూచు
నపుడె॥ గీ॥ ఉల్లమునకృష్ణమూ ర్తి యచ్చొత్తినట్టుల । సంతతంబున చాలు
వొంద చంద్రముఖులు । తన్నిమగ్నైక చిత్తలై ధ్యానయోగి। వరులవ
లె సొక్కుదురు పాగవశ్యమునను॥ సీ॥ అమ్మనేఁజెల్లె మాయ త్తఁజూచిన
గొట్టు పర్యాయవిడర గోపాలరాయ । యోరినాగుబ్బల గోరజీరకుపొంగీకు
క్రొమ్ముకెక్కెద యశోదాకుమార। అవులేర మంచివాఁ డవుగంటు సేతురా వా
తెరపై నవనీతచోర । చెల్లఁబోనడివీధి నెల్లవారునుజూడ ముద్దాడవత్తు
రాముద్దుకృష్ణ । యంచుఁపక్కను పవళించు మించుఁబోండ్లు । నిదురమ
బ్బున వగలిట్లు చతురులెల్ల । కలవరించిన యాసంచు తెలియలేరు। పసు
లగాచిన కాన తత్ప్రాణవిభులు॥ గీ॥ పనులుసేయువేళ పాటబాడెడు వేళ।
నాటలాడువేళ హరినెకాని। యన్య మెఱుఁగ రెందునలగోపసతులేపు। నోచినా
రొతొల్లి బాములందు॥ సీ॥ అదిగొకృష్ణుఁడు వచ్చెనన నెంతపనిమైన వదలివ
త్తురుతలవాకిళులకు । యముననీళ్లకటంచునరిగి మాధవు వేణునాదంబు
విందురు మోదమలర । పనిలేనిపనిపెట్టుకొనినందసుతుని గేహమునకే
గుదురు నూరారుమాళ్లు । తమినిబ్బరమున చెంగటి వారి నెఱుఁగక కులు
కుదురా శౌరి కెలననిలిచి । కమ్మవిలుకానిచే కీలుబొమ్మలనంగ। సమ్మో
దంబున బళిగాపుకొమ్మలట్లు । లేమ్మెనడయాడుదురుసంతతమ్ముమాని ।
నమ్ము వెన్నునియందు మగ్నమ్ముగాఁగ॥ క॥ ఈ కైవడికృష్ణుఁడు వ్రజ। కో కి
లవాణులను మరులుకొల్పె మనోజ । వ్యాకులితలైనవారల । జేకొని
క్రీడింపదలఁచి చిత్తములోనన్॥ మ॥ కమలావల్లభ చౌకసేయ నికపుం
గచ్ఛద్వచోవల్లభా । శ్వమనిశ్వాగతికంబుకై రవసుహృత్సైన్యంకిం
బాపగో । ద్యమమాశబ్దిక మంగభూవిజయ యాత్రావాపదూకంబునై।
కమనీయంబునుమించె నంతట శరత్కాలంబు భూపాలకా॥ గీ॥ ఆశర
త్కాలమున పూర్ణిమావసరము । నందు రవిజాతటచంద్రోదయంబు సొ
త్తెఁ । దనరె నిరుపేన గెంజిగి ధవళరుచియు । గిరహముని ప్రతాపసత్కీ
ర్తులనఁగ॥ మ॥ స్మరతేజంబుజనించె నించెడివి సచ్ఛత్రకంబు వత్రంబుడి

స్తరమోహాబ్ధిభ్రమించె మించెతుహినాసారంబుసారంబుతొ । నరవిం దంబులుతీరె తీరెనదికల్హారంబు హారంబుడాల్ । నెరయన్ వెన్నెలమించె మించె విటసందేశంబు దేశంబులన్॥ సీ॥ అట్టివెన్నెలలోన యమునాతటంబున ననిచినశృంగార వనములోన । పారిజాతముక్రింద మాఱుగెల్చినభంగి నంగుమీఱఁ త్రిభంగి యగుచునిల్చి । పదముపై వేఱొకపదముంచిజాఱు రావన్నెదుప్పటివలెవాటుమించ । పాచీకృతానన జలజాత వేణురంధ్రములయందు కరాంగుళము లమర్చి । ప్రౌఢిమీఱంగ మదనగోపాల మూర్తి । గానమొనరించె నల తాన మానములకు । మానములువీడ గోపికామానవతులు। గీతికాదూతికాసమాహూతలగుచు॥ సీ॥ కెంగేలజలపాత్ర గీలించియలదోట త్రోవగా నవ్వలదూఱెనొకతె। యత్తయక్కడి కంచు నడుగనెక్కడికిలే దిదిగొవచ్చెదనంచు నేఁగెనొకతె। పొరుగింటనుండుమా పొరుగింట పడుచును చూచివచ్చెదనంచు లేచెనొకతె। మంచినీళ్లకుబోయి మఱలివచ్చెదనంచు వేడ్కమీఱఁగ నేఁగె వెలఁదియొకతె। త్రోవలోతోడికోడలుబోవజూచి। యేడకేయన్న నదియునీ వేడకన్న। కూయకుమటంచు నిద్దఱుకూడితోడి । దొంగలైపోయిరాగోప ధూర్తుకడకు॥ చ॥ కడివెడువేడినీళ్ల జలకంబయికమ్మని పాలువంటకం । బిడినభుజించినాథుఁడు శయించి నవీడెము వేసికోకయ । ప్పడెనిదురాయటంచు నొకబోటి హసింపుచు తల్పుమూసివె । ల్వడియె ముకుందుడున్నెడకుపంచశిలీముఖ చంచలాత్మయై॥ సీ॥ మొగములోతేట లేనగవుపీడెము కెంపు పెంపునింప సమర్త పెండ్లికూతు । లనువొందనీరువట్టినమేని తళతళల్ దిలకింప తొలుచూలు తలిరుబోండ్లు । పసదేరు పసపుదువ్వలువకాటుకబొట్టు వింతచెల్వొన బాలింతరాండ్రు । గమకపుగుబ్బలంగములలో నుదుటునిచ్చలు ప్రేమగల నిండుజవ్వనులును । మఱియు ప్రేపల్లెలోనున్న మంద మంద। గామినులు కామినులు కీరకాండకాండ । కుసుమదోధూయమానమానసము తోన । తోనదన్నందపుత్త్రుండు తోనగుచు॥ గీ॥ ఏలవచ్చితిరీవేళ బాలలార । యనినగొండఱు ప్రౌఢరాకాబ్జముఖులు । కృష్ణనిన్నేలవచ్చి

రికోమ రెలనిన। తత్క్షణంబున నందనందనుఁడుబలికె॥ క॥ మగనాండ్రమీరు నన్నుఁగ। దగిలిరమించుటలు నాకుధర్మ వెనేనా। వగకాఁడుగానుపొండో। మగువలు మీరైన నిట్టిమార్గముదగునే॥ మ॥ అనినం గన్నెలు చిన్నబోవ నగీ-ప్రౌఢాంభోజపత్రేక్షణ। ల్విన మేమంటిమి కృష్ణకృష్ణ వినరాలేసాలు మాతోడనా। యనరాదింతియెకాక కన్నయపుడల్లా తప్పదండాలుబె। ట్టిన మాసామివి నీవకాక వలపంటేవచ్చెనా బింకముల్॥ శా॥ కానీపోదుమె ప్రౌఢప్రౌఢునను వేడ్కన్నీవు ప్రార్థింపఁగా। పోనీబో మన వాఁడుగా యనుచు మాపుణ్యానఁగన్ వచ్చితే। కానంజాలక ధర్మశాస్త్రములు వక్కాణింపఁగాజొచ్చినా। వానే కాక మరేమిబుద్ధి కడు లెస్సాయెఁగా యశోదాత్మజా॥ మ॥ దినముఁగా చేష్టల చేగరంచగను పాతివ్రత్యధర్మంబుమే। మెనయంబాలుదు మెల్లుగా నదియు గాకేనాడు గాకిండిలో। నను నీరాడగ వస్త్రముల్గొనితో యానాడే జనేఁగాలజ్జయు। న్ననుగోపాగ్రణి యేమి జేసితిని యానాఁడేల నఁగ దూరఁగఁగ॥ చ॥ అనవుడునవ్వినవ్వికసితాఁబుజనేత్రలునీవెఱుంగవే। కనికనియుండి బిత్తరియై కిట్టికిరమ్మనిచేతులెత్తిమ్రొ। క్కినదనుకారిభోర్రి తిలకింపవె మర్మములెల్ల నెట్టినీ। మనుసతులట్టిసూపుదురెమూఁమెడ గన్గొనుగాక మాధవా॥ గీ॥ అనిననింతియుకాదె పద్మాక్షులార। దృష్టిదోషంబు పనిలేదు తెలియకేను। జనకితినెగాక నన్నుజూచితిరెజూడ। వల్లవుడగాని నేమీకు వల్లభుఁడనె॥ సీ॥ అలివేణినీవెకావా గుబ్బపయిచెయి వేసిన చెయిఁదట్టి వేసిచనుట। వనజాక్షినీవెకావా మోవియానవచ్చిన నెమ్మొగంబోర జేసికొనుట। అంగననీవెకావా వేణిపట్టిన పెనఁగినా చెయి విడిపించుకొనుట। అబ్జాస్యనీవెకావా వెన్కజేరినే కన్నులు మూసినకసగుకొనుట। వలపులేదేమొ నల్లనివాఁడనగుట। నటులనేలపతివ్రత లగుదురింతె। యదియెమంచిది సౌఖ్యంబు లందునిందు। కొందుటకు మంచికార్యంబు జేసినారు॥ ఉ॥ చిత్తమెలర్పఁగామగల సేవలొనర్పక యిట్టివేళలన్। వత్తురెమెత్తురేవరులు వంశమువాసికి గాసిదెత్తురే। జొత్తురె జారవిద్యలకు చూచినపెద్దలు సాగనిత్తురే। యుత్తమశీలులార

ననుదూరక మీశరణంబు లొందుడీ॥ మ॥ అనినం గాంతలు దృష్టిదోష
ములులేవా ధర్మముల్పల్కునీ । వనినంజాలును సృష్టిదోషములు లేవస్టై
నబల్స్నిగ్ధునన్ । నినుసేవింపముగాని యుండునెపుడున్ నీయందె మాచి
త్తము॥ త్పెనఁగన్ వల్లవచక్రవర్తి వివహాభేదంబునం జూడఁగన్॥ గీ॥ రూఢి
శృంగారరసమెయీరూపమగుట । శ్యామవర్ణుఁడ వౌదుగాదనగనేల । యె
ఱుఁగుదుమునిన్ను మమ్మునీవెఱిఁగియుందు। మేలయీవట్టిజోలి యీవేళకృ
ష్ణా॥ సీ॥ ధవసేవ ధర్మమంటివిగదా నీవెమాధవుడవెగావె కందర్పజనక ।
వంశంబునకుహాని వచ్చునేచేపట్టి నావుగదా వేణునాదలోల । కనినని
త్యానంద కాముకుల్మెచ్చరే తగులుచేసిన నమృతస్వరూప। యాత్మనివేద
నం బాగాకమాభక్తి జారత్వమేభక్తపారిజాత। కలవెసర్వంబు నీయందె
కలదనంగ । తగినపెద్దలు జగదద్భుత ప్రభావ । శరణమెయ్యది నీపాద
జలజయుగమె । శరణమగుగాక గోపాలజనశరణ్య॥ అనిమరియునిట్లనిరి॥
సీ॥ నటియింపవావిషానలఘోరఫూత్కార కాళీయఫణి స్ఫుటాగ్రములయం
దు । కబళింపవాజ్వల త్కాలానలజ్వాలికాభీలలోలదావానలంబు । ధరి
యింపవామహీసురవైరిముక్తాశ్వ వర్షదుర్ధర్షణవర్ధనంబు । మరలింపవావా
ర్ధివరఘటానీక తల్లోక కామిసినందు లోకులెన్న । మరియుగలవెన్ని యైనసీ
మహిమలెన్న । సులభమా నూకుఁ బరపురుషుండవగుదు । ననఁగనిను.గొ
ల్చెదము నేము కరుణఁజూడు। మేల మమ్మింత సేయఁగోపాలరాయ॥క॥ గాయ
కునకు మోహింపుదు । రేయడ స్త్రీలనుచు దేలుప విశ్రంతిగావో । గాయ
కుఁడ వేముగామో । తోయజనేత్రలము వట్టి దూరేమిటికిన్॥ క॥ చిక్కుల
బెట్టినబోమిక । నక్కనగదియించితారహారావళులం । జిక్కుల
బెట్టకయనుచున్ । మక్కువపైఁబడిన యదుకుమారుం డంతన్॥ సీ॥ అల్మ
బోయిన చేతికందని చిన్నిగుబ్బలబాలలవికాస బంధములను । తిమిరంబు
నిండిప్రాయము మోహనాంగులఁ గెరలించుయుపపతిక్రీడనముల । నగవు
లనఖరదంతక్షతంబులఁదేల్పు ప్రౌఢుల బహుచిత్ర బంధములను । జాతి
స్వభావ చేష్టలెఱింగి తత్తత్కళా స్థితుల్గరగించి లలితగతుల । నందజేకి

వన్నిరూపంబు లందిపొంద । దతఁడయ్యెను నొకవినోదంబుగాఁగ ।
నిరువురకు ముప్వురకు మరినేవ్వురకును । పడకయిచ్చుచు బెనఁగెగోపాలుఁడ
పుడు॥ చ॥ అలయవొకింతయైన చమటంటదు చెక్కులమించి యూర్పు
లం । బొలయవు చాలుచాలు నిక బొమ్మన నెందరువచ్చి వేడినం । గల
యక నీవు దేవుఁడవు గాక మనుష్యుఁడవే యటంచుఁబ్రేఁ । మలొనరింతు
రీహరిని మన్మథ కేళిక మించలాహరిన్॥ గీ॥ పాలుచల్లారబెట్టి యీవేళ
యింత । పాలుమాలక రాగ రాధాలతాంగి । పవ్వళించెనొ లేదొ గో
పాలగీతి । చెవినిబడనుల్కి పడిలేచి శీఘ్రమునను॥ క॥ పాలసిమజ్జిగలో
పల । బాలునతోడంబుబెట్టి భ్రమచే నిదురన్ । సోలెడిగృహజనమది
యే । వేళని పడకిల్లుజేరి వేడుకమీఱన్॥ సీ॥ ముంగొంగు బంగారు చెం
గావియటులుండ జిలుగుపైఠాణి దువ్వలువగట్టి । సంపెంగలటులుండ జా
జిక్రొవ్విరిదండ మెండుగా గీల్జడనిండఁ జుట్టి । కుంకుమ పంకంబు పొంకం
బుగానుండ గబ్బిగుబ్బల మంచి గంధమలది । కళుకు ప్రాగెంపుచెక్కడ
పుసొమ్ములటుండ తెలిముత్తియంపు సొమ్ములుధరించి । సొగసుమీఱఁ
గవెన్నెల సోగయుంచు । గాంచువారలు భ్రమయ శృంగార మెనయ ।
పండువెన్నెల నొకయింత భయములేక । రాధవెలువడె గోపికానాథుక
డకు॥ ఉ॥ తోరపుగుబ్బ జక్కవలతో వలతోడన నీలజాలముల్। తూలె
డివేఁడఁబాక చకితోచకితోరు మృగంబులంబొదల్ । దూరఁగఁజేయుజూ
పరహితోరహితోర్జితగంధకేతకిన్। దూరముసేయువాసనలతోనలతోయజ
గంధివచ్చుచున్॥ గీ॥ ప్రౌఢ్యముద్దులకూతురి యుద్దితోడ । గన్నెమావు
లక్రేసిడ కలువరాచ । చలువరాతిన్నెపై జాజిశయ్యమీఁద । గోపకాం
తాసహస్రముల్గొల్వసేయ॥ ఉ॥ ఒక్కతెగుబ్బపైనొరిగి యొక్కతెమా
రులయంఘ్రి సాచివే । రొక్కతెపిడెముయ్య మఱియొక్కతెవీవన వీవ
బంతితో । నొక్కతె పైటచెక్కు చమటొత్తఁగ లీలరతాంత కాంతుఁడై ।
చొక్కుడు కృష్ణుదూరమునఁ జూచికిరుక్కన రాధమర్లుచున్॥ సీ॥ నిండా
రుపండువెన్నెల కాకకోర్వక నెలనూవిసీడల నిలిచినిలిచి । కలకళ్లపల్కు

చిల్కలపల్కు వినలేక చెవులనంగుళములు చేర్చిచేర్చి । చల్లని తెమ్మెరలైనపఁగాఁజాలక జిలుగుపయ్యెదచాటు చేసిచేసి । హృదయంబుభేదించు మదనాశుగములకుఁ దప్పించుకొనలేక తలఁకితలఁకి । దావదంగజతాపాగ్ని తాళలేమి । సాహసము షడ్గుణంబుఁట సహజముగను । కంజవనలోలయగుచు తత్కంజలపన । చూతవన మండలాగ్రంబుజూపు నపుడు॥ క॥ అమ్మమ్మ తెగువయేటికి । సమ్మతిసేవిభుఁడువచ్చు చయ్యననుచుం। గొమ్మపయినుండి కొమ్మక । రమ్మననొక చిల్కరవాలు ప్రమదముమీఱ॥ క॥ చిలుకాపలుకు నాపై । గలిగెనె నీకైనననుచుఁ గరమానను నుతె । క్కలుదుప్ప నొక్కపూపొద । జలజాక్షుని దూరుకొనుచు సతియున్నంతన్॥ సీ॥ అదియెవ్వరేరాధ యాగద్దాయిం దేల వచ్చెనో హరిబిల్వ వచ్చెనేమొ । యీవేళ నొంటిగా నింతదూరమువచ్చు నా యశోదా దేవి యంపెబోలు । గాదుగాయిదియేమొ కలదుపో దోసమే యటువలె నుందురా నంబుజాక్షి । ఎక్కడి మోసమొ యెవ్వతె పలువదె వనజనాభుని చక్కదనమువినిన । అనుచు చెలులాడ జూచి యిట్లాడనేల । పిలువవచ్చుట నిక్కంబు తెలిసివత్తు । మీరలీ చునిల్వుడని నిల్పి శౌరివెడలి । యల్లపూపొద కడఁబొంచి యాలకించి॥ గీ॥ చిలుక శ్రీకృష్ణదేవుండు చిన్ననాట । నుంచినాపయిఁ గడుఁబ్రేమ నుంచి దినము। చెలగియెన్నైనచేష్టలు సేయునకట । యేలలేదానొ నొక్క యా హాళినేఁడు॥ సీ॥ వెనుకపాటునవచ్చి వెడదికన్నులు మూయుఁ జెలిపేరు చెప్పినఁ జెలఁగినవ్వు । చెలులెవ్వరైన వచ్చెదరు పోపొమ్మన్న పడకయియ్యనికొంగు పట్టితివియు । అలతోటలోన నన్నలయించి కొనిపోయి విడువక నగుచుసేవిక పడల్పు । నెడవైనతావున నెదురైన నన్నాగిపోనీకవాతెర తేనెలాను । సిగ్గుప్రతిబంధమై యెంత సేయునాదు । కోర్కెయీడేర దయ్యెయీ కూర్మియెంత । యరసియుంద్రు యశోదాదులైనవారు । నెనరుగలిమిని గనిపించుకొనరుగాని॥ ఉ॥ ఒకనాఁడొంటిగఁ గేళికాగృహములో నుండంగ శ్రీకృష్ణుఁడే । టికొనేఁబోయితి బోయినం జెరగుబట్టెంబట్టి

నం గొంగుదీ । య్యకురావచ్చెద రెవ్వరైనయని మల్లాడంగ నావేళనే
లకొయే తెంచి యశోదచూచి చనె నుల్లాసంబు సంధిల్లఁగన్॥ క॥ అదిమొ
దలుగ ముదముననా । సుదతీమణి నామొగంబు చూచిననవ్వన్ । నిది
యేలనినను నేమో । పెదవిగదలనీక తెలుపు ప్రియసతితోడన్॥ సీ॥ హరిఁ
జేరవచ్చుచో నట్టె నేజూచిన పడతులకనుగీటి కడకుఁబోవు। నందుడదేమ
న్న నవ్వుచుమీ కేల పొమ్మంచు నొకవేళ పులిపిఁపుచ్చు । నొంటిగానున్నచో
నొకశేనిపనిచెప్పి కమలలోచనుని చెంగటికిఁబంపు। వనితనీచేఁగాని వల్లడు
మీకృష్ణుఁ డనినన్ను బనుప భోజనము పెట్ట । గంధమైనను విరులైన గానివిడి
యు। మైనపండైన నాచేతఁ గానివేరె । యొకరిచేనంపదేయెంత యొడ్డికొ
నిన। ప్రేమవేడు యశోదయదేమొ యెఱుఁగ॥ ఉ॥ నవ్వుచు మాయశోద
యొకనాఁడు విలాసిని యాగృహంబులోఁబువ్వులు దెమ్మటన్న నఁటబోయె
డిచో హరిగుబ్బలంటరా । యెవ్వరికేఁగుదెంచిన నదేవిరులేవియనన్ య
శోదనే । పువ్వులుగానఁనందనిన బోటులు హాస్యము నేసిరయ్యెడన్॥చ॥హరి
యొకమాపునన్ జలకమైకుచలార్చఁగ జీనిజాళువా। సురటియొసంగి చేతికి
యశోద చనెన్ దఋనేనువీచబం । గరునను చెక్కులం జెమట గ్రమ్మెటి
సాత్త్వికమై పెరింగియో । గురుకుచనీకిఁకన్విసరికొమ్మనె శౌరిదరస్మితం
బుగన్॥ చ॥ తిలకముదిద్దుచున్న సుదతిన్నగదిన్నఁగ నీవుదిద్దుమా। తిలకిని
యమ్ముకుందునకు దీర్చెడిచో భుజమూలకాంతికన్గొనలకుఁజూడనే నెఱేఁగి
గొబ్బునఁగేలటు వంచితోడితా । య్యాలులదియేమటంచ్రు వశమావిను
తింపఁగ వ్రీడమున్గదుకన్॥ ఉ॥ హరితోనేనొకవేళ నొంటిమయి మాటా
డంగ నీళాక్షళో । దరితాన త్తతి పొంచిపొంచి గనసంతన్ శౌరిహుమ్మ
న్నచో । నరుగున్నైనటు చిన్నదానిపయి నేలా యింతకోపంబనన్ । దర
హాసంబున నెంతలేదను జగన్నాథుండు నాపైఁదమిన్॥ ఉ॥ ప్రేమము
నిచ్చ నిట్లువలపించిననుంగికురించియిప్పుడీ। భామలతోడఁ గూడుకొనె భావ
ములోనను నెంచడింతయున్ । యేమనిచూచుదాననిఁక నెవ్వరెఱుంగుదు
రీయధర్మమా। కాముఁడెఱుంగుఁగాని చిలుకా కలకాలము తన్నెనమ్మితిన్॥

క॥ అరిమంచిది రావలేఁగద । యనికోపము మీఱఁనేమొ యనిబూని
నచో। నినునమ్మినాఁడ రాధా। యనిహరి కౌఁగిటను జేర్చ నదిగనియలుకన్॥
గీ॥ పెనఁగివిడిపించుకొనుచునబ్జసరసాక్షి । మంచివాఁడవు పొమ్మంచు
మూఁచుమొగము । నేసికొనియుండ నేమిజేసితినినేర । మేలనేయల్క
యనుచుగోపాలవిభుఁడు॥ సీ॥ బారికిన్నరకాయ బటువుగుబ్బలుమీఁద గో
రుంచనియ్యవే కీరవాణి । తళుకుబంగారు నిద్దాచెక్కుటద్దాలుముద్దాడ
నియ్యవే ముద్దుగుమ్మ । కండచక్కెర పానకముగుల్కు కెమ్మోవిగంటి
సేయగనీవె కలువకంటి। తొలిగారు మెఱుఁగుతోఁ దులదూఁగు నెమ్మేను గాఁ
గిలింపగనీవె కమలవదన । పైటచాటేల చేసెదే పద్మగంధి । మోము
ద్రిప్పెదవేలనే మోహనాంగి । సారెజంకించెదేటికే సారసాక్షి । యే
ల మేనోసరించెదే యిగురుబోఁణి॥ క ॥ నాళీకశరుఁడుసుమనో । నాళీకము
నేయుఁదాళ నవచంద్రకళా । ఫాలా బాలా యీలా । గేలా చాలానలం
చనిఁక నేలగదే॥ క ॥ అనివేఁడుచు నేరంబిది । యనిమోపక యలుగనేమి
యనిమెదనేఁడే । చనిమెదనని యెవరికిరా । వనితామణి పిలువకేలవచ్చి
తి వనిన్॥ చ॥ వనజదళాక్షి యచ్చటికివచ్చితిఁ బిల్వకబ్రొద్దువోకనే। వ
మునబాటపాడినను వల్లవ కామినులెల్లవచ్చిరిం । తనుమను దేర నీవునను
దారున గన్గొని వారిబాసిక్ర । న్ననటువచ్చితింగలదె నాపయినేరమొ
కింతయేనియున్॥ గీ॥ అనినఁజిలుకయుఁ గలికి నీవప్పుడుజూచి । మగఁడుసా
హసమేఱఁగి నీమగఁడు వేగ। నన్నుగనుగీటవచ్చి క్షణంబులోన । నీతెగువ
మాన్పెనేయన కృష్ణుఁడపుడు॥ గీ॥ కాకనామీఁద నేరంబుగలిగెనేని। యిది
గో నామేను నీవేణి యిదిగోవలయుఁ । లీలదండించు మంచుగోపాలవి
భుఁడు । గీలుజడగేలు కందియ్య బాలనగియె॥ అంత॥ ఉ॥ వెన్నుఁడుసంత
సించి మనవేడ్కడు వెన్నెలలెస్సగాఁగఁ గ్రే। గన్నులచిన్నినవ్వు యొలుకన్
దిలకించుచు నిగ్గులాడున। క్కన్నియద్రాక్ష చప్పరము కమ్మని సయ్యకుదా
ర్చియింకనీ । మన్నెలగొల్పి ముంగురు లమర్చుచుఁ జెక్కిలిముద్దులాడు
చున్॥ గీ॥ మోవితనకిచ్చి కనుగవ మూసికొనిన । బాసిమరులంగ దేని

డగ్రోలిబాల । సొగసుకాఁడింత నంతంటఁజూచనేని । మానుమలరంగ మాడ్చిన నానఁబూను॥ ఉ॥ చక్కెరమోవియాని నను జన్నులక్రొన్నెల వంకిలుంచినం । జెక్కులుమించ నొల్లమినటించ బెనంగుచు నింతెకా నియ్యా । చక్కనిసామిలోఁ దొడల చక్కి చురుక్కన గోటనొక్కినన్ । జొక్కిమిటారి సొమ్మసిలు చూపుకరంగుట సాటిచెప్పఁగన్॥ చ॥ వలపులు రేఁచ గోలయని వల్లభుఁడల్లనఁ గేలిసల్పుచో । మెలఁతుకనిబ్బరంపు తమి మించఁగ చేతులుద్రిప్పి కొంచున । చ్చెలువుని మందవేగము హసింపుచు వేజరిచెం గరాగ్రసం । కలితసువర్ణకంకణము ఘల్లన వల్లవు గుండెఝల్లినన్॥ మ॥ గళనాదంబుల దత్తరింపుచును సీత్కారంబు దట్టింపఁ జె। క్కులపై స్వేదము గ్రమ్మసొమ్మసిలి తళ్కుల్ మేను వాల్గన్నుద । మ్మలసోనన్ మృదులోరువుల్ వ్రేనుచుఁ జుంబూబోణి దీనోక్తులం । జెలువున్ స్వేదరతాంత మంతసడలెన్ శ్రీకృష్ణుఁడున్ వేడుకన్॥ ఉ॥ సురతాంతంబున తాంతయై తరుణి మించు లుల్కుక్రొన్నిజాం। బరచొక్కించుక వైచియొత్తిగిల వ్రేచుఁగృష్ణుఁ డొయ్యారిబం। గరుచెక్కుల్దన చేల చేఁదుడిచి సింగారంబు గావించికి ప్పురపున్ వీడె మొసంగె నంతనల రెన్ బూబోణి విశ్రాంతయై॥ అంత॥ మ॥ తలిరున్ మోవిరి కద్దులేదనెడు నిద్రాకెంపు చిన్నారి చ । న్నులపై సన్నపుక్రొన్నెల త్వాలయు వెన్నుండిచ్చు కైదండతోఁ । గలకంఠీతిలకంబు వెల్వడలి రాఁగాఁ జల్లనై యామునా। నిలమున్ మెల్లన వచ్చెఁ జెంగలువపూ నెత్తావి పైఁ జల్లుచున్॥ గీ॥ అంతఁ గృష్ణుఁడు రాధాలతాంగిఁ జూచి । కంటెయుత్పల పత్త్రిసంక్రాంత మగుచు । నీనితంబంబు వలె మించె నీరజాక్షి । యనునుచు యామున సైకతంబున వసించి॥ సీ॥ ఒప్పుగా విరులతో నొక ... ఘటియించి బలుపుముత్యాల పాపట యమరి । ... చక్రవాకులారా॥ ... త్తిమోమున సొగసుగాఁ × ...జాస్త సుతాగితంబ నైఖరిబ...వై। చిమల్గొనిచంప సంది ... దవరిన యొక విపులపులినతలమధ్యమునన్॥ సీ॥ చిపాలిండ్ల చెద ... తారుసిగతోడఁ గమ్మకస్తురితిలకంబుతోడ। మోవి ... పసవ్వులతోడఁ గలితనాసామౌక్తికంబుతోడఁ। గిండ నిచ్చి ।

కౌఁగిలించి । మోహనాంగుని చెక్కిలిముద్దుగొనుచు॥ గీ॥ చిలుకతో నన్నుదూరుచుఁ జెలువవెనుక । నలిగియేమని గడిగితివనిననేమి। లేదనిమె రాధయెటువలె గాదు తెలుపు । మనుచుఁగృష్ణుఁడు వేడసిగ్గునలతాంగి॥ఉ॥ వచ్చినయప్పుడేననుచు వాకొనిగృద్వగ చానయేటికో । మచ్చికదెల్పు మంచు హరి మాటకివేడిన నిన్నుబాహులం । జెచ్చెరబట్టి క్రిందుపడఁజేసి మకరంబణగింతుగట్టిగా । తచ్చెననైనకంతునకు దప్పదునంచుఁ బ్రతిజ్ఞబూ నితిఁ॥ మ॥ అనినన్ రాధహసింప యింత యలుకా యారార నామీఁదనై । నను నీకోపము తీర్చుకొమ్మటులనైనన్ నీదుకోపంబుదీ । ర్పనెభావింతు నటంచు వేడుకొనుచున్ రాధావధూరత్నమో । యనపుంభావకళావిలా సముల నబ్జాక్షుండుహర్షింపఁగన్॥ క॥ అరాధాధర మధురసు । ధారస ధారాతిదర్పితస్వాంతమునన్ । గూరిమిరమణుఁడు దము తమి । జేరమినే రమిగనచటి చెలియలు కలగన్॥ మ॥ఇదిగోవచ్చెద నంచుబోయియిదియే మీరాడుకృష్ణుండురా । గదరేచూతమటంచునంగనలురంగద్రత్నమం జీరము । ల్గదలంగుబ్బలపైమెదల్పొదల సింగారంపు కీల్గొప్పులన్। బొ దలన్ తుమ్మెదలెల్లఁ బూబొదలనెమ్మిం బల్మరుం జూచుచున్॥ చ॥ ఒకపొ దరింటిలో దలిమ మొక్కటిగాంచియిదేమి చెల్లనా। యకుఁదువిశేషబం ధములనంగన గూడినపొల్పుదెల్పరే । వికసితజాజిశయ్య కడు వేడుకమీ ఱఁగ రాధగూడియే । డకుజనె నోపునింక నకటాశకటారిని నమ్మవచ్చు నే॥ సీ॥ గట్టిగాకీల్జడ గట్టివేయకమున్నె మోసపోతిమిగదా ముగుదలార। గుచ్చికౌఁగిటఁజేర్చు కొనివిడువకయుండ నేఱుఁగమైతిమిగదా నెలఁత భుఁడు । గ... మన చేల చెరగులాతనిచేల ముడిగొల్ప తెలియమైతిమిగదా చెలు సించి మనవేడ్కకు వెన్న... ముక ప్రేమానకగూడి యుపయింప నేరమైతిమిగదా దిలకించుచు నిగ్గులాడున। కన్నియద్రాక్ష చప్ప... వగలు। సేయుటలుదక్క ర్చియింకనీ । మున్నెలగొల్పి ముంగురు లమర్చుచు... మింతననుచు । వెతల చున్॥ గీ॥ మోవితనకిచ్చి కనుగవ మూసికొనిన । బాసిప... చేరి యదేరాధి ... నదెకాంత

శౌరిపిల్చెనట్లంచుఁ జనుచుఁ జనుచు। చాటునబర్హిపింఛముఁ జూచి చెలికొప్పు
హరియూను పింఛమో యనుచు ననుచు । కలరవంబులు బల్కు నలనామ
నోహర ఘనగళధ్వనియంచు వినుచు వినుచు । తరువుతరువును పొదపొద
తెరువు తెరువు । సైకతము సైకతమ్మును సారెసారె । యరసియరసి వ్ర
జాంగనలందఱు। మరియు మరియును వెదుకుచు మమత మొఱయ॥ సీ॥ నె
మలిపింఛమువాఁడు నెరిమించు సరిమించు గరమించు కాంచనాంబరమువాఁ
డు। వేణునాదమువాఁడు వినుగంపు నునుగంపు గనుపింపు కౌస్తుభ కాం
తివాఁడు। మొగులుచాయలవాఁడు మురిపెంపు కరిపెంపు మరపి పుగతివి
భ్రమములవాఁడు । వెడఁదకన్నులవాఁడు విరిబువ్వసరిక్రొవ్వు జిరినవ్వు కె
మ్మోవి జిలుకువాఁడు। సారఘనసార చందనచర్చవాఁడు । కాంతలతి
కాంత మౌళిభాగంబువాఁడు । మారసుకుమార సౌందర్య మహిమ
వాఁడు। మాధవుఁడు వచ్చెకానరె మల్లెలార॥ వ॥ అనిమఱియు నగంబుల
ఖగంబుల మృగంబుల నడుగుచు నడుగుచు చురుక్కను వెన్నెలబయళ్ళ వల్లి
కాయల్లిక భరంబునం దల్లడిల్లుచు హల్లకీభల్ల కృపాణులకు లోఁగి వల్లిన
పల్లవపాణు లల్లినల్లనం జనిచని॥ క॥ కందళదిందీవరని । ష్యందిత మకరంద
బిందు సందోహావళి । స్పందామందానందా । ళిందమిళింద వ్రజంగళీం
దజనగుచున్॥ మ॥ యమునా నీయమునాకు గాదనక పద్మాక్షుండు మ
మ్మీవనాం । తమునన్ స్వాంతమునందొకింత దయయైనన్ లేక నేఁ డించి న।
ప్రమదుండై ప్రమదంబుతో నరిగె జూపన్ లేవుగా దద్దియో। గమనిన్
భంగమునందె మాదృతులసంగ ప్రాప్తిరూపింగనన్॥ గీ॥ భూరికాఠిన్య
మత్కుచంబులను బోలి । యవనిబుట్టంగ నట్టి గోవాప్తివలన । నబ్జచ
క్రాంగ కరసంగ మభిలషించి । వగచెదరుమీరహ నిటచక్రవాకులార॥
క॥ అనుచున్ వెదకుచు జనుచో । వనజాస్త్ర సుతాసితంబ వైఖరిబట్టవై।
నను దెలివెన్నెల చెలువం। దనరిన యొక విపులపులినతలమధ్యమునన్॥ సీ॥
విరవాదినసలతో వెడబారుసిగతోడఁ గమ్మకస్తురితిలకంబుతోడ। మోవి
పైదిలకించు మొలకనవ్వులతోడఁ గలితనాసామౌక్తికంబుతోడ। గండ

మండలచల త్కుండలంబులతోడ రమణీయతార హారములతోడ । ఘన
కటీతటబద్ధ కనకాంబరముతోడ నవరత్నమయభూషణములతోడ । నిఖిల
భువనైక మోహననిరుపమాన। మానితాకార రేఖాసమగ్రగరిమ । నవ,
కుసుమన్మథమన్మథుండై నకృష్ణుం। డంబుజాక్షుల క్రమోలప్రత్యక్షమయ్యె॥ అ
ప్పుడు॥ ఉ॥ చక్కనివానిబోధనిధిసాధుతపోధనచిత్తవృత్తికిం। జక్కనివాని
బ్రహ్మశశిశేఖరముఖ్యులకైనదృక్పథం। బెక్కనివానిసంతతసమేధితభక్తికి
కానియేటికిం । జొక్కనివానిమానధన చోరునిశౌరినిజూచికామినుల్॥ క॥
మనమాన ధనముదొంగిలి। చనుచోఁదగ ద్రోహమునకుఁ జరణంబులు రా।
కనిలిచె నీగోకృష్ణుం । డనియవ్విభుఁజేర నేగి యంగనలెల్లన్॥ సీ॥ ఏకుందర
దనరా యీకమ్మకెమ్మోవి చిగురాకునజ్జ నజ్జగనుగరచె। నేగుబ్బలాడిరా
యీవెడందయురంబు గ్రుచ్చుచో గుబ్బలగ్రుమ్మికమ్మె। నేపద్మపాణిరా యీ
తేటముద్దుచెక్కుల నెత్తురులుగ్రమ్మ గోరఁజీరె । నేసిలవేణిరా యీతళ్కు
మేనంట ఘనవేణిచేవ్రేసె కందుబారఁ। నట్టిజగదంటకే గాని యనఁగి పెనఁగి।
యుండుమనుకనీవు మాబోంట్లయొద్దఁజేరి। యనుచు నెకచక్కెయములాడువ
నజముఖులఁ । గాంచి నవ్వుచు గోపికాకాంతుఁడనియె॥ చ॥ నెలఁతుకలా
రమిమ్మిచటనిల్పి యటం జనుదేరరాధ చె । య్యెల నెలయించి తావకవి
మోగము తెల్పిన నల్గిపోయెనా । మెలతుకగూర్చు కోక మన మేవిహరిం
చిన రట్టుబుట్టినా । వెలదులుమంచిదంచు హరి వెంటను రాధను చేరి నం
టునన్॥ సీ॥ ననవిల్తుగరడిసాధనకట్టుకంబాబు శుకవాణిప్రాణనాయకుని
నిమేను । కమలసాయకుపానకపుచలివెందరయిగురుబోణిరో జీవితేశు
మోవి । మకరకేతనునిధన్వంపు కుఠారంబు జలజాక్షివిభునివక్షఃస్థలంబు।
వలరాజపెండ్లిబువ్వపువిందు సంపూర్ణచంద్రాస్యకృష్ణుని జవ్వనంబు । కలికి
యటుగాన మనమునాటలకు బెనఁగి । దప్పిదీరంగ గ్రోలి ఖేద బుల్లల్లి।
వదలఁబవళించి యనుభవింపుదము గాక । యలుగనేటికి యనరాధచెలఁ
గెనంత॥ మ॥ హరిముఖ్యాద్వయ మధ్యవీధి హరిమధ్యా గోపమధ్యంబునన్ ।
హరిమధ్యామణి గల్గుమండలముమధ్యంబొందియానంది యై । మురళీనా

ద్ధమైన ర్చెఁ గృష్ణుఁడు జగన్మోహైకశృంగారభా । స్వరతన్నగ్గొని యచ్చ
రల్గొనగయ రాసక్రీడ యందంతటన్॥ సీ॥ అలసటమీఱనొయ్యారంబుగా
గేలదురుమునదురిమిన విరులురాల । వలసివల్లములుగా వలిగుబ్బచన్ను
లగదియించు సరిగెపయ్యెదలు జాఱ । నొళ్ళవిలాసముగాఁగ చికిలి గోరు
లమీటు చెక్కులజవ్వాజి చెమటదొరుగ । బడలికపొడమిపై పైనూర్పు
మూర్పుల కమ్మకస్తురితావిఘుమ్మనంగ । యల్లనల్లన నిడు పాదపల్లవను ల।
ఘల్లుఘల్లున కీలందెకపలుమొరయ । చెలువుకై దండ గైకొని చెలువు
మెఱయ । నంబుజాక్షులు యమునాతటంబు దొరయ॥ చ॥ అతివెలవ
క్త్రిముల్వికసి యబ్జములంచును జేరి షట్పద । ప్రతతుల చేరనిమ్ము మధు
పానమునన్నిశియామెఱుంగ ద । ద్భుతమిదిగాదె వారి కుచముల్వమబో
టులటంచు నెంతయున్ । హితమతి జేరు కోకముల కేమి వివేకము లేక
పోమెనే॥ అయ్యవసరంబున॥ మ॥ సరిగెమెఱుంగు బంగరపుచందుర కా
విపటంబులూడ్చిచి । త్తరముఁగజల్వపావడలు దాల్చి బయల్పడుగు
బ్బజక్కవ । ల్గరముల గప్పకొంచు కుతుకంబున దోయముజొచ్చి రయ్యె
డం । దెరుకువతో మిటారు లొరదీసిన మారుకటారులోయనన్॥ గీ॥
ఘదవత్తుల మల్లుకొనఁజేయు మదనుమెచ్చి । ముదముతోదో పొసంగిన
మురుపుదోఁప । తాళిగోణంబుగట్టి గోపాలమౌళి । చెలులతోఁగూడిజల
కేళిసలుపునపుడు॥ రగడ॥ అదుగోజూచితెకృష్ణ యరవింద కోశంబు ।
సుదతియూనాను వక్షోజప్రకాశంబు । అవులేరయివిగంటె యులరారెవి
రిగల్వ । లవియెనీకనులకునగు చుట్టలుచెల్వ । పిలుకుబేడసమీాసబి
త్తరంబులుగంటె । నెలతబెళ్కుగలాదె సొదు చూపులకంటె । ఎడతే
దు నిదురించె నిదీ చిన్నరాయంచ । నడకియున్నదిసీదు నడకూరరాయం
చ । మెుఁడయ్యెనారతుమ్మెదల ఝంకారంబు । దండిమన్మథునికోదండ
ఠంకారంబు । కడలేనివెతలచే గందెగా కోకంబు । పడతిగానకయున్న
ఛాయునేకోకంబు । సుడిలోనకేళ్ళల జొన్నెగోపాల । మరిమోదికన్పిం
చు నీమేబులోఁ త్తైన। వెరతులోలోపలికి గియ్యకుము । నాతోనెయివావ

గలు ననువింత సేయకుము । తలఁగోరి నీచోర తనము లేటికిఁగూడదు । తోలు
బల్కులకుఁగదా దూరెదవుననునేను । తలచూపె నెందుబోఁదగము నీకేవేళ ।
పూనుకొని మోరతోఁ బుడబోవ బోనీను । నేనునీకటిభూమి నిల్తు నేడకుబో
ను । క్రొవ్వాడినీచేతి గోరుజీరగ రాక । నవ్వెదను నీమేననాఁటింతు నాపో
తు । వేడెదవు కోపంబు విడిచితిఁ బ్రమ్మించి । మూఁడులోకంబులిమ్ముల నేల
నామించి । బావికుంకుమ శోణితహ్రదము చేసితివి । కావుననునే గట్టు
గను నేల దీపితివి । వనములో విహరించు వాంఛ పుట్టెనె నీకు । నినమూ
తి పైబ్రేమ హెచ్చనట్లనిపోకు । బలశాలి ఫ్ఫాదు వైపై నీళ్లు జల్లకుము ।
చెలియనీ యధరమధుర సేవవలే మళ్లకుము । మగనాండ్రనింతగా మరు
లుకొల్పితివౌర । వగలాడి నే జక్కవలువ గట్టగనేర । కలికి చెయ్యాల
నెన్నిగతులమించెదో యింక । వెలఁది ధర్మపుత్రోవ విహరింతు నీకింక॥
వ॥ అని పెక్కు తెఱంగుల మర్మగర్భితంబులయి శధర్మంబులగు నర్మో
క్తులు వెలయంగఁ గర్మసాక్షి కూర్మినందన నిర్మలోర్మికల దేలి కుసుమ
ధర్మధర్మ సధర్మ భ్రూవిలాస పటుభర్మ పటునితోడం దటము సేరి యం
తట॥ మ॥ బుసపాసీరలుగట్టి జంటఁ అవికల్పాంకించి సూపాంగి క్రో । విర్వారి
దండల్నెఱిఁగొప్పులందురిమి తావిస్ఫూంచు గంధంబు క । స్తూరియుక్తగోవజవా
దిసంకుమము మెచ్చుల్గుల్కగా బూసిక । ప్పారపుక్త నాభులుదీర్చి సొ
మ్ములిడి యంభోజాత పత్రేక్షణల్॥ సీ॥ చికిలి సేయించిన జిగుఱుఖండ జో
డుకన్నె గేగంగి చేకత్తులనఁగ । కందర్పుఁడాడించు కుందనాటకమున బొల్చు
కుందనపుఁ దోల్బొమ్మలనఁగ । చిలుకతేజీదొర శృంగారవనమున మొలఁగెడి
కస్తూరి మొలకలనఁగ । రతిరాజు మణిపంజరము వాసి దమయిచ్చ జెలఁగెడు
ముద్దురాచిలుకలనఁగ । కొలనువెలువడు రాయంచ కొదమలనఁగ । మేఘ
ముల బాయు క్రొక్కారు మెఱుఁగులనఁగ । పూర్ణిమాచంద్ర కళలనప్పు
వ్వుఁబోఁడ్లు । వెలసిరభినవ శృంగార కలనమునను॥ ఉ॥ ఒక్కతె పూలు
చుట్ట మఱియొక్కతె గందములందముందె వే । ఒక్కతె మిన్న సొమ్ములిడ
నొక్కతె బంగరు శాల్వ గట్టఁగాఁ । జక్కెరవిల్తుకన్న నెఱచక్కదనంబుల

జాణరాయఁడ । మ్మెక్కయనంగ జాలిన యొయారమునందగ నట్టి వేళలన్॥ సీ॥ స్వామిపరాకుహెచ్చరికంచు గొందఱుపంకజాక్షులుబరాబరులుసేయ । కీలుకంకణముల కేలెత్తికొందఱు మోహనాంగులు కొల్వుమ్రొక్కులిడగ । తంబురమీటికొందఱు కుందరదనలు తనమీఁదిపదములు వినికిసేయ । ఘనగోపికామానధనహారియనుచును గొందఱు చెలుఁలుపద్యములు చదువ । కోమలాంగులుదగ నూడిగమ్ము సేయ । భవ్యయానముసైకత భద్రపీఠి । రాధసంకంబునుంచిరా రాజసమున । పెద్దకొలువుండెగోపాల భిదురపాణి॥ మ॥ తొడపైనుంచిన రాధికామణియు నెంతోవేడ్కతోఁగ్రప్పుచున్ । మడుపుల్పల్మాఱనొక్క తానొసఁగ బల్మాఱుల్లాసంబుగ । స్వడగానఁదుచు మోవినొక్కుచును పైపైకొంగుబాలిండ్లకే । లిడుచున్ జెక్కిలిముద్దుగొంచునలరెం గృష్ణుండులీలాగతిన్॥ సీ॥ తరలాక్షియొకతె చేసురటినగ్గముజేసి బోటినొక్కతెకన్ను గీటికొనియె । సిగ్గులేదేమొ చూచెదమంచు నొకలేమ బామయొక్కతెను చేపట్టిదిగిచె । సుదతియొక్కతె యట్టిచూచిజంకెను బొమ్మముడితోనుచక్కనిమోముద్రిప్పె । నెఱుఁగవా యిందురా నీకంచునొకకల్కి చిల్కపైనిడియుట్టికెలయసాగె । మఱియుఁ దగునీగసంబున మగువలెల్ల । గుసగుసలబోవవారలకోర్కినెఱేఁగి । యందఱును నన్నిరూపుల యతుల గతుల । రతులనలయించె గోపికారమణుఁడపుడు॥ చ॥ వలిచనుగుబ్బలూతగొనివాతెర గ్రోలుచునెత్తికౌఁగిటన్ । మెలవుచుగొంతసేపు తమిమించఁగఁ గేళిఘటించితెచ్చుకో । లలయికనూరకున్న జలజాక్షునిచిత్తమెఱింగిగోపికల్ । చెలఁగుచు దాము పైకొనిరి చెల్వునచిక్కితి వంచునవ్వుచున్॥ అంత॥ సీ॥ కలగళధ్వనులతో ఖగకులంబులుమ్రోసె గ్రమ్ము నిట్టూర్పుతో గాడ్పువిసరెఁ। దెగుముత్తెసరులతోఁ దేరలెతారావళి చెదరుముంగురులతోఁ దేరలె తేంట్లు। కులుకుగుబ్బలతోడఁ జెలరేఁగెజక్కవ ల్బ్రిదుపేనలితోడ వీడెదమము । నెమ్మోముచెమటతోఁగ్రమ్మెఁదమ్మినితేనె సొగయుగన్నులతోడఁదొగలుఁము నిఁగె । నింకమీమీగృహంబుల కేఁగవలదె । యనుచురత్యాంత మునగ్రొ

ష్ణుఁడాదరమున । బలికినను విన్ననాగోపికలముఖాబ్జ । తల్లజంబులతోఁ
దూప్పతెల్లనయ్యె॥ గీ॥ అంతవారల మక్కువనక్కఁజేర్చి । యిందుము
ఖులార యీవేళయిండ్లకేగు । డటులనయ్యెడు రాత్రులయందుననుచు ।
నమ్మికలొసంగిహరిబంప నలినముఖులు॥గీ॥ వెన్కకనుఁగొని కనుఁగొని విడిచి
పోవ । లేక తమిమీరఁగా కౌఁగిలించికొనుచు। రేయిరమ్మని వేడుచు వేయు
వగల। మఱలిరొకభంగిగోపికామానవతులు॥ సీ॥ అంఘ్రులుఘలుఘల్లుమ
నఁగగీలూడ్చి పైచినరత్నఖచిత మంజీరములును। హారాయలుగాఁగొప్పుల
పయిపయిఁజరువుచో జాఱినకమ్మగొజ్జంగి విరులు । త్వరగొన్ని ద్రె
వ్వినదగఁగ్రువ్వగాలేక యట్టెవేసినతారహారములును। ఘణఘణల్లనమ్రో
యఁగావిసర్జించిన చిరుగంట మొలనూలిసరిపెణలును । మఱలిత్రోవలగం
చువిస్మయముతోడ। నాచునిలువెళ్ళినంజాలు ననుచు వెడలి । నట్టిరమణు
లురమణుఁలేమండ్రొయను భ । యమువనిజగేహములు సేరిరవనినాథ॥ గీ॥
కొమరేచందురుకావి కెక్కుములలీల । నమరెనరుణోదయద్యుతుల్కఁ
మలనాభు । రథమువలెఁదోఁచెరవియంత రశ్మిగణము । లలమ ద్విజసంఘ
ములకలకలము లేసఁగ। మ॥ తళుకుఁగన్నుల కెంపుకెంపు జిగినిద్రామో
విబల్గెంపు చ । న్నులపైగ్రొన్నెల సొంపుసొంపుగనియుఁ నోరెత్తఁగా
జాలక । త్తలుమాయల్మగలుఁ లతాంగుల యశోదాపుత్రుఁడెన్నెనిమా।
యలుకావించెనో కాని కాక నిటు సేయంబూనునే దాసులఁ॥వ॥ అంతశం
ఖజూట నృపభాసుర కేశిహంత కడ కొకనాఁడు నారదుండరుగుదెంచి స
త్కృతుండై యిట్లనినుతించె॥ ఉ॥ శ్రీవసుదేవపుత్ర సరసీరుహనేత్ర సువ
ర్ణగాత్రభృం । దావనమిత్రప్రత హావినస్యదమిత్ర సం । భావితగోత్ర
వేత్రపరిపాలిత గోత్రకరాంత గోత్రతా । రావగగోత్రకృష్ణ యదురాజ
శిఖామణి నిన్ను గొల్చెదఁ॥ వ॥ అనిప్రశంసించి భావికార్యవృత్తాంతంబు
చెలిపిచనె నంతజఘాంసాకంసప్రతిహతుండై విప్రహీకుండగు నక్రూరుఁ
డును రేపల్లెకు నరుగుదెంచి వల్లవీవల్లభుపాదంబులకు బ్రణమిల్లి యిట్లని
నుతించె॥ చ॥ జయజయకృష్ణకృష్ణ ఘనసన్నిభవిగ్రహ విగ్రహాక్షమా ।

జయజయ దేవదేవ జలజాతరవి క్రమవిక్రమస్పృహా । జయజయ శౌరి శౌరి వరసంవృత మార్గణ మార్గణప్రియా। జయజయ చక్రిచక్రి వరసంభృత. గోపకగోపకల్పనా॥ వ॥ అని యక్రూరుం డభినందించిన నందనందను డానందించి నందయశోదానుమతుండై రాధాదిగోపికల నూరడించి బలరామాక్రూరసమేతుండై మధురాపురంబున కేఁగు నెడ॥ క॥ భువనవ్యాపకుఁడగుమా । ధవుఁడవ్వఁ జూపె భక్తతమునకు యమునా । భువనంబున మృదుతాజిత । భవితాఖిల నీలమూర్తి ప్రత్యఙ్మూర్తిన్॥ క॥ అక్రూరుని వెంబడిగాఁ । జక్రాయుధుఁ డేఁగుదెంచి సహితాగ్రజుఁడై । చక్రాది దివిజగేహస మగ్రమ మణిధామమధుర మధురకు నంతన్॥ సీ॥ రజకునిఁగొట్టి వస్త్రములు గట్టకయున్న దనకు లేదాయెనే కనకపటము । వెసను దామఁ డొసంగు విరులు దాల్పకయున్న వక్షఃస్థలిని లేదె వైజయంతి । కుబ్జ చేకలపంబు గొనకున్న నిందిరా కుచకుంభ ఘుసృణ కొదవె తనకు । నంద కారాతి విల్లపహారింపకయున్న నరయుమే మనురాముఁ డనుచు దన్ను । కరివరదుఁ డయ్యు జెల్లునే కరివధింప । భువనపతియయ్యుఁ జెట్లతోఁ బోరవలెనె। హరికి నిదియును వినోదంబు లయ్యెనేమొ। యనుచు దోవచ్చు నక్రూరుఁ డనఁగ శౌరి॥ క॥ చనువున బలిమిం దగఁగై । కొనఁదగు గద మేనమామ కూతురినీక కం। సునిఁజంపి జయురమాక। న్యనువరియించెన్ ముకుందుఁ డందఱు మెచ్చన్॥ క॥ ఆశింపదయ్యెఁ గంస। శ్రీసర్వంబునకు నుగ్రసేనుని బతిగాఁ జేసెం బరమానందము। జేసెం దలిదండ్రులకును శ్రీహరి యంతన్॥ గీ॥ గొల్లయిల్లాండ్ర మానంబు కొల్లలాడి। నట్టితల్లిరి బ్రహ్మ చర్యంబు బూనె। వెనకటికె గాని యిటువంటి విద్య లేదు । వెనుక నొకనాఁడు కుబ్జఁ గూడిన దెగాని॥ క॥ గురుసుతుని దెచ్చుకొలఁకై । యరిగిన శంఖంబు దొరకె హరికిన్ దద్దు। ప్రకార్య కార్యఘటనము। దొరకిన సత్కీర్తిమూర్తి దోదగెననఁగన్॥ అంత॥ సీ॥ నలువంకతను కాంచనముల పూమొగ్గలు ప్రజ్వలస్తభ దీపములుగాఁగ। పొన్నసకమ్మప్రప్పాడిదిన్నె యడ్డంబు మీఱిన దాడిమంబుగాఁగ। దళుకు కెందలిరుటాకుల గుంపులందంద జరచు హరిద్రహస్తములుగాఁగ । కలకలకంఠి

కావళనంబు లల్లల్లనె రెడిపాటిల యనువుజూప । ప్రేమమీఱంగ లతకూనపేరటాండ్రు। కోమరెక్రొవ్విరి వెండిపళ్లెముల దేఁటి। యలతిజిమ్మిలివాయనమందుకొనఁగ । ప్రథమఋతువయ్యె వనలక్ష్మి ప్రాభవమున॥ గీ॥ అట్టివాసంత వేళ నుద్యానవనము। సుక్కువజరింపుచుమురారి యొక్కనాఁడు। చెలిమిమీఱంగనుద్ధవు జేరఁబిలిచి । పలికెఁగెమ్మోవిచిరునవ్వు మొలకలెత్త। ఉ॥ అక్కటనన్ను శాసి క్షణమైన సహింపఁగ లేరుగోపిక । ల్చకెక్కరబొమ్మలేకరణి సైచిరొయిన్ని దినంబులందు లో । మిక్కిలిరాధయీమెడను మేనుధరించుట దుర్లభంబునీ। వక్కడికేఁగి కృష్ణుఁడిదె వచ్చె నటంచువచింపుముద్ధవా ॥ ఉ॥ యుత్తలమూమలర్ మగలనన్నలదమ్ములఁ దల్లిదండ్రులం । జిత్తులముద్దుబెట్టుచును చీటికిమాటికి నన్నె చేరఁగా । వత్తురుమేలుకర్జములువంతుల కిత్తురునిండుకౌగిటం। గుత్తపుమారుకేళి కనుగూడుచుమెత్తుగుమత్తచిత్తలై ॥ శా॥ ఏనక్రూరుని వెంట వచ్చునపుడట్టె నన్నువీక్షించినే । డైనన్నిల్వు మటంచు కన్ను గొనలం బ్రార్థించినం గూడదం । జేనెమ్మోములవంచి యుస్సురనుచు న్నేత్రాంబువర్షంబులన్ । మానంజేసిరిపైటలచ్చెలుల మూనన్ నేర్చునెయుద్ధవా॥ ఉ॥ ఎన్నడుగారవించునొకోయెనిఁకనిచ్చటనుండివచ్చినన్ । గన్నెలుగారవించుముఖకంజములక్కున జేర్చిమక్కువన్ । గన్నుల బాష్పము ల్దొరుగ గద్గదికోక్తులనన్నదూరినన్ । దిన్నని మాటలం గలకదేర్చుచు వేడుక లోలలాడుచున్॥ సీ॥ చొక్కమైనరగంట జూడగానేర్చిన యప్సర స్త్రీలనీడనగవచ్చు । నడకువతిన్నగానడుగిడనేర్చిన నాగకన్యకలనీడనఁగవచ్చు । నెలవంటిముద్దుమోములుగల్గినగంధర్వ సతులనీడనఁగవచ్చు । మెఱుఁగుతీగెలవంటి మేనులూనినను కిన్నరకామినులనీడనంగవచ్చు। నితరమానవ కాంతలనీడనంగ। రామకల్లలుగాదు నీ మీఁదియాన। కంతుప్రతిసృష్టి యేమొయీకంజముఖులు । బ్రహ్మసృష్టినిగాన మాపాటివారి॥ క॥ చుక్కలలోపల మిక్కిలి । చొక్కంబగుచంద్రరేఖ సోయగమునవా । చక్కెరబొమ్మల మించిన చక్కదనంబునను రాధసన్నుతికెక్కెన్॥ సీ॥ సొలపుమీఱఁగ నోరచూపు

ఋబూచెనా వలరాచజాలరి వలలు వెదకు । మొలకనవ్వులుగుల్కు మొగమింతయొత్తెనా ఘనచకోరముల యాకండ్లు దీరు । ముద్దుమాటాడి కెమ్మోవిగదల్చెనా కలకలధ్వనులకోయిలలు చేరు । నొయ్యారమునఁజఋ పయ్యెదజార్చెనా కుంభిరాజములుఢీకొనఁగ నేర్చు । నాచపలమీన లోచన నామృగాంక । వదననాపల్లవోష్ఠినా మదగజేంద్ర । కుంభజృంభిత వక్షోజకుంభ రాధ । నభినుతింపంగ శక్యమేయజునికైన॥ గీ॥ మగువ నెఱికప్పుగొప్పు యమాసయనుచు । పొలతినెమ్మోముగగ్గొన బున్నమనుచు । భ్రమసియుండుట సంతసపర్వమయ్యె । గలదెయిటువంటి వింతలోకంబునందు॥ గీ॥ ఇంటివారలొకించుకయదుగనియ్య । రాదనుచు సంచరింతుము రాధనేను । నాభయమునంభ్రమము జేయు నవనిపాన । కంబులోపలిమిరియపు కారమట్లు॥ సీ॥ ఒకగుబ్బనాప్రక్క నొరయమూర్ఛనపోఁక నిడనుత్సవముల సందడులయందు । జాతరలోనున్న సన్న సేయుచు లేని పనుల బెట్టుక వచ్చు భవనమునకు । సంకేతమొనరించు సంధ్యవేళను దానె వెదకుచోటిదియంచు వేడ్కమీఱ । నడురేయినిద్రించు నను లేపి కొనిపోవు వేగయామునతీర విపినమునకుఁ । బాటబాడిన నామీఁద బాట బాడు । మించుపాలిండ్లయందు నే నుంచునట్టి । పచ్చికొనగోళ్ల పయ్యెదవిచ్చివిచ్చి । వేగిలేచిన ననురాధ వింతవగల॥ మ॥ కలకంఠుల్వలిగుబ్బ జంట నెలవకంల్వేడ నేమేనియుం । బలుకన్నేరక రాధసిగ్గునమల్కఁ బంతిఁ యశోదాంగనా । తిలకంబేమిటి మాటతాఁకినది యింతే కేతకీకంటకం । బులు బొమ్మంచదలింపనట్లయను నవ్వూబోణి లేనవ్వునన్॥ క॥ ఆనాటి వినోదములె । న్నెన్నా గలదైన దెన్నా కలుగునొకో । యానారీ పరిరంభం । బేనాటికినై నవచ్చు నిదెహారియనుమీ॥ క॥ అనిపంప నుద్ధవుఁడుఁ జని । వనితలతోమాటలాడి వచ్చిలతాంగుల్వినుపింపుమ నినమాటలు । తనతోఁ దెల్పిన మురారి దరహాసమునన్॥ ఉ॥ ఏమనిరోయ యుద్ధవ మృగేక్షణలా మధురాపురంబులోఁ । బ్రేమను వన్నె బెట్టివలపింపఁగనాయకు రాండ్రు గల్గినా । మోముల జూచునేయుఁకను ము

చ్చటఁగానని రేభలాభలా । యేమిటిమాట నామనసొకింత మెఱుంగరు గా వ్రజాంగనల్॥ ఉ॥ ఎప్పుడు వచ్చునంచు తమి హెచ్చఁగనొక్కెడ గాచియున్నచో । కొప్పరపిడ గబ్బిచనుగుబ్బలపయ్యెద జాఱసంభ్రమం । బుప్పతిలంగ జేర ముద మొప్పఁగవచ్చియుఁ గౌగిలించుచో । నప్పటిసౌఖ్య మింత గలవా వెలబోటులయందు నెయ్యెడన్॥ మ॥ అనినన్నవ్వుచు నుద్ధవుండు కమలాక్షుం డుగ్ధజారాంగనా । జనసంగంబిది యంతమన్మథకళాశాస్త్రైక పారీణులై । వినయోక్తుల్ఘనరక్తులు న్వెలయఁగా వేయాఱుబంధంబులం । బెనగంజాలిన ప్రౌఢవారసతులన్ బేర్కొన్నచో నావుడున్॥ మ॥ అయినం జూతమటంచు నున్నయెడ యజ్ఞాజ్ఞానుకూలంబుగా । ఘానుండ స్తనగంబు జేరఁజనుచోఁ బ్రాగద్రికూటంబునన్ । శ్రీనాధప్రియకారియై పొడమె రాజీవారి తచ్చంద్రికా । శ్రీనై పుణ్యము మించెఁ జోరజనరాజీవారియై యయ్యెడన్॥ సీ॥ తళుకుసంపగిమొగ్గ తాయెతుల్మొలయంగ నరవిరివిరిజాజి సరులుచుట్టి । తీరుగాకస్తూరి తిలకంబుతీరిచి మేలిమిబురుసారుమాలగట్టి । ముదువైనహురుమంజి మురుపుతోఁ గట్టాణిఘనమైనగొప్ప చౌకట్లుదాల్చి । తావికుంకుమపు గంధముపట్టియురమున రాణించు తారహారములువైచి । వలిపెచెంగావి దుప్పటివల్లెవాటు । నేలజీరాడు గిలుకుపావాలుమెట్టి । చికిలినాసాకరంబున చెలువుగులుక । నగధరుండొంటిగా తన నగరువెడలె॥ గీ॥ వెంటనరుదెంచు నడువవాల్గంటిచేతి । యంది యడపంబు గైకొని యుద్ధవుండు । కెలనుజనుదేర పరిజనంబులనుబిలిచి । కమలనేత్రుఁడు నగరమార్గమునఁ జనుచు॥సీ॥ విటవిటసల్లాప వికవికవాసన ల్గళనాథసహకారి కలరవములు । పురుషాయితాంగనా పరిహాసవచనము ల్చటులకచాకర్ష సంభ్రమములు । తతహృత్కళాది భేదనముష్టి ఘాతముల్మోదకల్పితశుష్క రోదనములు । కోపనానూపుర కోలాహలంబులు కఠినరతాసహాక్రందనములు । ప్రథమరత్యంతకామినీ ప్రార్థ్యమాన । సరసశృంగార పదపద్య చాటువులను । వేఁడువీణా వినోదముల్వినుచు వేశ్య । వాటిలోవాసు దేవుండు వచ్చునపుడు॥

గీ॥ చకితనేత్రలు దమతమ సంభ్రమములు । వదలి కృష్ణునిఁ జూడఁగా
వచ్చిరపుడు । ఏమియాశ్చర్య మాతని నప్పుడపుడు । గాంతుమని
యున్న వారలు గారెవారు॥ సీ॥ విడువిడు రాయని విటుని చెక్కిలిగొట్టి
తనమోవి విడిపించికొని యొకర్తు । విటుఁడు పయ్యెదఁ బట్టి విడముకుచ్చెల
లెల్ల చనఁబోక ముడిబట్టుకొని యొకర్తు । పసగాఁడు వలపుగావలె నంచుఁ
గినుకతో నధిపుకౌఁగిలి విడనాడె యొకర్తు । రతిమధ్యమున లేచి రమణుఁడు
ప్పటిచీర యనుచు నట్టెటుఁ జుట్టుకొని యొకర్తు । కేళిసదనంబు నందుండి
జాలకముల । గాంచి రితరులు ద్వారభాగములఁ గడచి । కెలన చేరియు
నేది శ్రీకృష్ణుఁ డనుచు । జెలులు వెదిరి తమకంబు కొలదిమిగుల॥ చ॥
కనుఁగొని కృష్ణుఁ గామినులు గంతుని బారికిఁ జిక్కి చొక్కుచుం । గొనకొ
ని యేమినోచిరొకో గోపిక లోపికమీఱ నిట్టిదే । వునిమనసార నిద్దపుకవుఁ
గిటనుంచఁగ నిప్పుడేమిటా । రిని కరుణించి వచ్చెనొకో ప్రేమనటంచును
జూచుచుండఁగన్॥ చ॥ కలికిమిటారి కత్తె యనుగారి చొకారపు మేలుబం
తిక । న్నెలతల మిన్న బంగరపు నిగ్గు మనోభవ రాజ్యలక్ష్మినా। గలయొ
కకాంత మాధవునిఁ గన్గొని మోహరసైకలోలయై । తొలఁగడు వేడ్కతో
హరిని తోడుక రమ్మని తల్లిఁ పంపినన్॥ సీ॥ కప్పు వేసిన వెండ్రుకల గొప్ప సవ
రంబు సవరించి పెట్టిన జాజికొప్పు । దురుసుగా పైకెగ ద్రొసి కట్టిన వా
లు చనుదోయి బిగిచూపు జంటిరవిక । మిసిమి పైపూఁత క్రొమ్మెఱుఁగు నె
మ్మోమున సొగసుగా నిడిన కస్తూరిబొట్టు । జిగిదక్కి క్రుక్కిన చెక్కిలి
కుబ్బుగా దాపిన కపుర నెత్తావి విడెము । వడియు నెమ్మేని కొకవింత బెడ
గునెరపు । సరిగ చెంగావి పావడ చలువపలువ । చెలువుగులుకంగ చెలు
వ చెంగలువబంతి । హరికిఁ గానుక యొసఁగి లోలాంబుజాక్షి॥ క॥ కేలె
త్తి మ్రొక్కు తరిభుజ । మూలన నఖక్షతలు చెలగు మురుపున మోముం ।
గీలుగొన గంటి వడువుగన్ । మేలిమి దెలుపంగ హరికి మెలఁతుక వలికెన్॥ గీ॥
దేవర కుగంధ మొసఁగిన పూవుఁబోఁడి। వక్కలాకులు గైకొని వత్తురనుచు। నిం
టికై తోడి తెమ్మనె నిపుడటన్న। నౌనె యా కుబ్జ గేహమా యనుచు శౌరి॥

క.॥ అనుటయుతు జ్ఞానామం॥ బునకుం బనిలేదు స్వామిపుణ్యంబునను॥క్క నిద మ్యో నియ్యాడనునే॥ ననరాదివాడగల రె యూపాటిచెలుల్॥ గీ॥ అనిననీ కేలసంకో చమంబుజాక్షి । కంతుసింగాణి మువ్వంక గాదె మెఱుపు । పలుదెఱంగుల మెఱుగదే పద్మముఖికి॥ మునుపుకొదవేమి యనుచు నమ్మదితగనుచు॥ సీ॥ నీరజాననముద్దు నెమ్మోముచెలువంబు గనుగొన్న పద్మిని యనుచుదోఁచె॥ కంబుకంధర కంఠకంబుసౌందర్యంబుగనుగొన్న శంఖిని యనుచుదోఁచె । హస్తీంద్రనిభ యానయానశృంగారంబుగనుగొన్న హస్తిని యనుచుదోఁ చె । నీమనస్విని కి నాపైమది గల్గుట గనుగొన్న చిత్తినియనుచుదోఁచె॥ జాతిమెయ్యది యొక్కొయీనాతికనిన । మాధవునకేల జాతిసంబంధమన్ను చు । నుద్ధవుఁడుబల్క నవ్వుచు నుద్ధవమున । నద్ధవుఁడుసేరఁగావచ్చున నసరమున॥ చ॥ పొదిగిటనిల్చిచూచు విరిబోఁడిమదంబెదఁబిక్కటిల్లగా॥ నెనుపగవచ్చి దోవజెలులిచ్చిన కమ్మనితావినీటత । త్వదజాతముల్గడిగి పమ్యెదచేఁదడియొత్తియింపుసాం॥ పొదవగఁగేలొసంగివిన యోక్తులఁదేని యలొల్క బల్కుచుః॥ సీ॥ గోపికారమణులఁగూడుక క్రీడించు శ్రీకృష్ణు వ్రాసిన చిత్తరువులు । సకినెలతలగడ ల్చప్పుడై నను దోన కివకివల్గొను గుపారువపుజోళ్లు । కమ్మక్రొవ్విరి మేలుకట్లకు దేటులైతిలకించు సాం బ్రాణిధూపములును । పదివన్నె దివ్వెకంభమున మాణిక్యంబులీలనెంత యుఁ బ్రజ్వలించుదివ్వె । గలిగివిలసిల్లు కేళికాగారమునను । జాళువా కోళ్ల పట్టుమంచంబున దు । ధవునివసియింప బంచియుద్ధవునిచెంతఁ । బళి డిగద్దియనుండె నప్పద్మగంధి॥ గీ॥ వక్కలాకులు విరులొక్క వరుసనొ మ్ము । రవికెపావడజంటి చెరంగుచీర । యుద్ధవుఁడొసంగవింతసేయుదు రెయంచు । చెలువజనని ప్రియోక్తులు బలుకుచుండ॥ గీ॥ సదనమున కేఁగి పన్నీట జలకమాడి । హరువుమీఱంగఁగై సేసి యారగించి । లలితమ న్మథ సామ్రాజ్య లక్ష్మిమనోలి । వచ్చినిలుచున్న చెలి చెలువంబుగాంచి॥ సీ॥ శశిసహస్రకళా ప్రసన్నుఁడై యుండెనా చెలిమోముతోసాటి సేయువ చ్చు । జలజపత్రములు చారలకెక్కుడుండెనా పొలఁతికన్నులసరి బోల్ప

వచ్చు । పదియేడువన్నెలబంగారుగల్గైనా కలికిమేనికి ప్రతిబలుకవచ్చు । కనకాద్రికింకనొక్కటి జోడుగల్గెనా వనితగుబ్బల కెనయనఁగవచ్చు। నను చుఁబొగడుచు తలయూచి హరివయస్య । మోముజూచిన యంతట స్వామికరుణ । యట్టిదే కాదె యాశ్చర్యమాయటన్న । మంచిమాటఁ వేశ్యమాతయపుడు॥ గీ॥ కామినీమణిచిన్నది యేమియరుగ । టల మతిజెప్పి సేవ సేయించుకొనఁగ। పలెనొ మీది త్తమనుచునచ్చెలువచే । విడియముప్పించఁగైకొని వెన్నుఁడపుడు॥ క॥ గంధవడి వక్కలాకులు । ముకనుద్ధవుఁడు వారిజాక్షులు సన గో । విందుఁడు గాంభీర్యంబున । ముందుగఁదను జెనకకున్న మోహము మీఱఁ॥ సీ॥ మడుపు పాలుటయును మదిరాక్షి సరినేలు గులుకమంచముమీఁదఁ గూరుచుండి । చిఱునవ్వుమోమున చెలువుని పాదపల్లవములు గోమలోరువులనుంచి । తలిరులు పెనగను చెలువున నొత్తుచుగిలిగింతగొనఁగఁ గెంగేలుదొడల। సోఁకింపుచును గొటి సాదలంటిబిసుకుచుగరకంకణంబులు ఘల్లుమనఁగ। జిటపొటగ్రుద్దుచు సం గుళంబులు మెయ్య నెటికలుదివుచుచు నెయ్యమునను । కన్నుగవనొత్తు చునుగబ్బి చన్నుగవను । జేర్చుకొంచుబదాబ్జను సేవ జేసి॥ చ॥ పలు దేమిస్వామి యొకపాటివభూటిని నీవుమెత్తువే । చెలువముగుల్కు లె చిత్తమురంజిల సేవసేయఁగాఁ । గలిగినకాంత జేకురినగాకిపుడా వంచుకొంటివో । పులుకలునిండెనంచు విరిబోణిముదంబున పక్క చుక॥ సీ॥ ఏదేదిసామినామీఁదిప్రేమకు గురు తనుచుబుక్కిటివీడిం బుఁగొంచుచు । నవుమంచివగకాఁడవే నీవుచేనందుకోవంచుమడుపు నసాసగుచు । విడువరామడుపుసందడిమోవి నేలనొక్కెదవంచు జంకించుకొనుచు । మొదట నేనునుబోక ముడికి పెనంగెదునసగాదో యించుమనలు కొనుచు । ఎంతదడవ్వూరకుండఁగా నేమియెఱుఁగ। యనియుంటినీవేల యెఱుఁగవింత। నాఁడెవ్రేపల్లె సతులమానములుగొ చతురుఁడవుగా వెయనసగి శౌరి బలికె॥ చ॥ చెలియ్యా భీరుల నన్న నేలం యక్షీణ ప్రతాపంబుతో । నలరున్నేజివజీరుపోరునను పోఢాడంగసీ

గుఁ । తొలుతఁ రాధను జెల్లునన్నగినుకఁ లోలాక్షి దేవాంగనా । తిల
కం బెయ్యది యంచు మార్మోగముగా ధీరుండు లేనవ్వుచుఁ॥ చ॥ వనితరో
కోపమేమిటికి వల్లవకాంతలలోనజాణయా । నని యలరాధ బేర్కొనుట
యంతియె నీసరియైన జేసినఁ । గినుకను నేప్వ సూపుటలు గేలిగదాయని
వేడినిక్కమా । ననిమరు డెచ్చరింప ఘనమా తమి మన్మథ యుద్ధలోల
లై। సీ॥ అంగనకును బోమశింగాణియెక్కిడి బొరిబొరిచూపు తూ
పులునిగుడ్ప । పతివాడిరీక్షణప్రత్యస్త్రములద్రిప్పి నిఖిలాంగకంబుల
నిగుడఁజేయు । నభిమంత్రితంబులై యవివశీకరములై కుచకుంభమధ్యంబు
గుఱిచ్చునపుడు । కుంకుమఘర్మపుక్రొన్నెత్తురందంద యలరంగ గళ
వట్టినట్టుసాగయు । నలుకబలు మెడ కోజననటపటాగ్ర కలితకేతువు వాల్చ
లోకట్టు నెదరి। బట్టబయలయ్యె రణమహీభాగమంత।. గాంతలోనయ్యెనని
శౌరికౌతుకమున॥ క॥ స్తనకుంభికుంభయుగముం జ । ఘనఘనచక్రంబునఖ
రఖక్షతములుగా । నొనరిచిబాహుయుద్ధం । బున బెనగుచు క్రిందుపడి
చిపోరగనంతఁ॥ చ॥ పొలఁతుక క్రిందుమీఁదగుచు భూషణతూర్యనినాదమొ
ప్పఁగాఁ కొలగొనగోళ్ల లావుకలు కోకిలముల్కలహంసముల్శిఖా । వళిములు
శారువాలు నలువంక ప్రతిధ్వను లియ్యలీనమై । గళరవము ఘటించె
రతికాంతరణాంతరశంఖభంకృతిఁ॥ సీ॥ అంగంబులవు డేకమయ్యెనో నా
గట్టిగా బాహులతల చేఁగట్టిగట్ట । మొనలుఱొమ్మునునాటి వెనుచక్కి వె
డలఁగా కోడెగుబ్బలఱొమ్ముగ్రుమ్మిక్రుమ్మి । యలకలుబవలించి యధరా
ధరముపంటజిక్కించికొని గంటి చేసిచేసి । మొనగోరనిజబాహు మూల
ముల్కంఠంబు చిన్నారిచెక్కులు జించిచించి । యతనుసమరంబు సేయు
నయ్యతివక్రిందు । బఱచెహరి యంతయంతలోపద్మముఖియు। మరలిబై
కొనె మొలనూలిచిరుతఘంట । మ్రోఁతచేడిఁడిమధ్వని బ్రోదిసేయ॥ ఉ॥
కుంచితపాదయై తిపురు కోపులుమీఱఁగధూర్తకృష్ణుని ।— వంచనజేసి క్రిం
దుపడవైచితి నింకటనీమదంబడం । గించకపోదునేయనుచు గేరడముల్ప
చరించుచెక్కుదా । టించుగురుల్గ్రహించు నెఱటెక్కునవాతెర గ్రోలు

ప్రోలుచున్॥ గీ॥ అంతనొక్కింత బడలిపద్మాయతాక్షి । స్వామిచెంగ
టనే పౌరుషంబునెరప । నెంతదాననటంచుశయించి చిత్ర । రతులదే
లించెఁ జొక్కితిగతులశౌరి॥ అప్పుడు॥ సీ॥ ఏదేదినాసామి యదివింతయా
నంటివనిగళధ్వనిమెచ్చు కొనెడిసొలపు । ఔరనాప్రాణ నాయక యేలితి
వి మేలు మేలనిరతిశక్తి మెచ్చుమేలపు । నయ్యయ్యో నీదాసి నయ్యెదరా
బాయకురయంచు 'మిరేగికొసరువలపు । బడలితివేమొనా పంచదార
ల మోవియిందరాయని తేనెలిచ్చుదలఁపు। నలసినానింక విడవరా యను
చుసొక్కు । మోడ్పుకన్నుల కెంగేలమ్రొక్కునలపు । బతినిగరగించె బ
తికేళిసతినిగరచె । నిరువురును గేళివిశ్రాంతి బొరసిరంత॥ మ॥ సరసాలా
పములన్ వినోద గతులన్ సంగీతసాహిత్యమై। ఖరులన్ ద్యూతకళావిలా
సముల శృంగారప్రసంగంబులన్ । స్మరశాస్త్రార్థవివేచనంబులను శశ్వ
ద్వంద్వమై చిత్రులన్। హరికిన్ వేడుకజేసెనిద్రపయినీర్ష్యాంగాంతరేయుం
తటన్॥ అంత॥ క॥ కలకల పక్షులుబలుకఁగ । జలజాక్షుఁడు విస్మయము
న సఖియరోయపుడే । తెలవారెనేమొయొక నిమి । షమువలెఁదోఁచెన్
విలాసవైఖరి వలనన్॥ క॥ నెఱజాణవు నినుమెచ్చితి । వరమిచ్చితి వేడు
మనిన వనితదినమునీ । పరిరంభము కావలెనన । హరిమంచిది యనిమె
ననిన నతివ చెలఁగుచున్॥ చ॥ తలిమము డిగ్గిచొచరణ తామరసంబులు
పైడిగుల్కుపా । వలుధరియించి కేలొసఁగ వల్లభుఁడల్లనకేళిగేహమున్।
వెలువడి కాంతనిల్పి కడువేడుక నుద్ధవుకేలుదండతో । నలరుకటారికాని
నెఱయంచము గేలియొనర్చుబాగునన్॥ ఉ॥ చెంపకొకింతజాఱుసిగ చెక్కు
టి గోపనుకన్నుగోనలం । గెంపునుగెంపుమోవి బలుకెంపును నెమ్మొయి
చిట్టు గంధమున్ । సొంపులుమీరనారజపు సోయగ మారయటంచుగో
రిలో। చంపకగంధులాడుకొనశౌరి గృహంబునకేగె నీటునన్॥ క॥ లోకా
రాధ్యుడుగావున । శ్రీకృష్ణునకిటులనడువ జెల్లెందగునే। యాకైవడివర్తిం
పఁగ । లోకము వారలకు రాజలోకవతంసా॥ అంత॥ *క॥ హరియక్రూరు
నిబంచెన్ । ధర పాలిప్పించు పాండుతనయులకంచున్ । *కురుపతియుఁధత

వరియించె విని౦దకుఁడార్తిఁ గుందఁగన్॥ మ॥ అట కాళిందిని మిత్రవిందను
సుదంతాబ్జాక్షి భద్రామహీ । కటినిన్ లక్షణ బెండ్లియై సంతసిన్ ఖం
డించి ఖానింటిలో । కటమైమించు బదాఱు వేల మహీరాట్కన్యావతంసం
బులన్। ఘటియించెన్ దనకున్ గులాంగనలుగాఁ గల్యాణలీలాగతిన్॥ సీ॥
కలహాంతరితభోజకన్యను లాలించు స్వాధీనపతికసత్యను భజించు । వాసక
సజ్జిక యౌ సుదంతనుగూడు విప్రలబ్ధను మిత్రవిందనరయు । ఖండితయై
న లక్షణ వేడికోను విరహోత్కంఠితను భద్ర నూరడించు। కాళింది నభిసారి
కను జేసి కలయు ప్రోషితభర్తృకను జాంబవతినిఁ జేరు। కడమ పదియాఱు
వేవురుకంజముఖుల। భావహావవిలాసవిభ్రమవిహార । లలితబిబ్బోక చకి
తలీలాద్యరస్మి । తాది శృంగారచేష్టల కలరు శౌరి॥ క॥ సిళాసీలాలకరా ।
బాలలవను దోడి తెచ్చి దయమీఱంగా । నెలెం గులకాంతలతో । నాళీ
కాక్షుండు తతుల నానాగతులన్॥ గీ॥ చంద్రముఖి కోరగ నుపేంద్రుఁ డిం
ద్రుఁ గినిసి । పారిజాతంబు గొనెఁ దనపాలుగాఁగ । భామినుల వల్లగాదె
సౌభాగ్యమునకు । గలుగు కొక్కక్క యుపవిభాగంబు ధరను॥ క॥
కనె బదుగురి బదుగురిఁ బతి । వనితామణి యందు సుతుల వనజాక్షుఁడు ద।
త్తనయులకు లెక్కలేదిల । ఘనవర్ణుని భాగ్యమెన్నఁగాఁ దరమగునే॥ చ॥
అలరు కటారిజోదు మొదలైన కుమారులు దత్తసూజులున్ । చెలువము
మీఱఁగాఁ గొదమ సింగములంబలె బాగ్యసీమలన్। గొలువఁగ నిండుకొ
ల్వాయి ముకుందుఁడు వేడ్క జగజ్జనంబు మె । చ్చులకయి విశ్వరూపమును
జూపినవైఖరి మించె నెంతయున్॥ క॥ హరుఁ గొలిచి సాంబుఁ గనియెన్ ।
హరి యందురు గాని యదిరి యనిపించెనయా। హరుఁ గెలిచి బలు మారుని।
కరములు ఖండింపఁడే జగంబులెఱుఁగన్॥ వ॥ అంతనఘశిక్షకుండు నృగున
కు మోక్షంబొసంగి యాదవమోదంబుగావున నారదు భ్రమియించి భీమా
యుధస్ఫూర్తి రాజమండలగ్రాహక మాగధ తమస్స్ఫురణంబడంచి సుదర్శ
నంబున దమఘోషనందనుని తేజంబునుం గూల్చి మరియు భూభాగరులగు
సాల్వగంత వక్త్ర విదూరాది భూపతుల హరించి సకల దిగ్విజయలక్ష్మీ
సమేతుండై జగత్కల్యాణకరుండై ద్వారక సామ్రాజ్య మేలుచుండె నగ
తనొక్కనాఁడు। గీ॥ తనకు చేలత్వమటయు ధాన్యంబుగాఁగ। జంపిదోవతి
కొంగున చేరెడంత। ముడిచి తెచ్చిన యటుకులు పిడికెడేటి । మహిత

కృష్ణుఁడు మెసవెడి సమయమునను॥ సీ॥ చిఱిఁగిమాసికలు వేసినకోకబంగా రు చెరగులచెంగావి చీరయయ్యె। చెవులకుచాలని చిరుతలక్కాకలు కట్టాణి ముత్యాలకమ్మలయ్యె। పుస్తెమాత్రమెకాని పోడిమెయుంగనిగళ మునహారము ల్నెలవుకొనియె। నొకటిరెండో గాజలున్నకరంబుల నవర త్నమయకంకణములువొదవె। నలకుచేలుని సతికి దుస్సలకుమఱియు। చూడ చూడఁగమ్రైగమ్ము సొమ్ములకును। కొదువలేదయ్యె ప్రబలుసంపదలవలన। రుక్మిణీనాథు దివ్యకారుణ్యమునను॥ వ॥ ఇవ్విధంబున స్వగృహీతకుచేలుండగు కాంచనచేలుండు సుశ్రీలుగావించి కాండవదహనంబునన్నైన యాఖండలు భండనంబున గాండీవకోదండునకు విజయసుభద్రావాప్తిఘటించి మనసుభ ద్రావాప్తింజేసినదిహెచ్చుగాదు పరవాసు దేవలోకనివాసులగు భూసుర కుమారులం దెచ్చి విప్రుచ్చుం జిచ్చుజొరకుండమాన్చి రక్షించెనదియునుం గాక మిపెద్దలగుపాండునందనులఁ బెక్కుచందంబులఁ బ్రోచెనదియెట్లనిన॥ సీ॥ కృష్ణమానంబురక్షించె శాకాన్నంబుగొని పాత్రినఁ దోదనమునిం చె। కట్టిసారథియయ్యెఁ గాంగేయుపైచక్రమెత్తివివచ్చున కీశుచేతఁ। బరి హాస్త్రముప్పించె భానుగప్పెను భగదత్తాస్త్రమునకురఃస్థలముపూనె। ద్రోణువారించె కర్ణునిశక్తినురపించె నహిబాణమునకు దేరణఁగద్రొక్కె। సన్న జేసిసుయోధుని సమయఁజేసెఁ। బెనిచె నుత్తరగర్భంబు భీముఁబ్రోచె। మహికిఁ బట్టముఁగట్టెధర్మజునివింటె। పంకజాక్షుని పాండవపక్షుమ ధిపా॥ క॥ తనుగొలిచిన తనబాగడిన। దనచారిత్రములువిన్న ధన్యుల కెల్లన్। వనజాక్షుఁడు గృష్ణుఁడుగో। రినకోరికెలొసఁగునని నృపుఁడల రారెః॥ సీ॥ పెనచికట్టినపట్టు పింఛంబు నడిపట్టు చంద్రకాంచితవిలా స ముబదనర। పుట్టినవంశంబు పట్టినవంశంబు బహుపర్వసంగతి వరిఢవిల్ల। భాసమానగళంబు పదపద్మయుగళంబు నలర ముక్తాశ్రయంబై తనర్ప। నవదానుజాతంబు నాన్యానుజాతంబు నానాసుదృఙ్మోహనంబు గాఁగ। శ్రీ లవిలసిల్లు గోపాలకృష్ణమూర్తి। గంధగజహేమ పర్యంకికాతురంగ। చా మరభటాది శాశ్వతైశ్వర్యమొసఁగి। సేవకశ్రేణినెపుడు రక్షించుగాత॥ క॥ అని శ్రీవైశంపాయన। మునిముఖ్యుఁడు దెల్పవిని బ్రమోదాన్వితుఁడై। జన మేజయుఁడవ్వలికథ। యనఘావినవలతు దెల్పుమని యడుగుటయుఁ॥ మ॥ ఛలనిద్రానవచుంబనావసరదృష్టి శ్రీకపోలస్ఫుర। త్పులకప్రీళిత ముగ

శోక కుచసభ్రూభంగ మధ్యాధర । స్థలదంతక్షత కేళికా పరమనోజ్ఞాత ప్రగల్భాంగనా। కలనాదోదిత పాహిపాహిముఖవాః కల్లోలవ ల్లోహలా॥ క॥ అనురాగ సమాకర్షిత । కనకాంశుక నీవిబంధఘటనాక్షమతా । వన మన్మృగధీగోపిక । ఘనజఘనాదానవర్షి గజరాజఘనా॥ ఉత్సాహము॥ రాధికాదిమహీతపర్వరసిరస్సాన్నదానధీ రాధికాను మోదరంగదంత రంగిసంగతా।రాధికాధినాధభక్తరంజనాననప్రచా। రాధికారనంగసంగరంగణాదిభంగదా॥ గద్య॥ ఇది శ్రీరామభద్ర దయాభిరామభద్ర కరుణాకటాక్షవీక్షాపరిప్రాప్త దీప్తతరాష్టభాషాకవిత్వ సామ్రాజ్య ధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణీదేవుల నాగనామాత్య సుధాసముద్ర సముద్భిన్నపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతంబైన దశావతార చరిత్రంబను మహాప్రబంధంబునందు నవమాశ్వాసము.

తొమ్మిదవ యవతారంబగు బలరామావతారము సంపూర్ణము.



నవమాశ్వాసము.

బౌద్ధావతారకథ.

శ్రీలాలిత మగదలవం । శాలంకారా యుతోదయ సమగ్రదయా ।
లీలాలవాల హృదయ క్షు । మాశేఘశరణ్య కృష్ణమంత్రివరేణ్యా॥ గీ॥ అ
వధరింపుము జనమేజయ క్షితీశ । శేఖరునకిట్లులను వ్యాసశిష్యవాని ।

బుద్ధకల్క్యవతార ముల్భ్యాప యిఁకను। తెలియఁజెప్పెద వినుమని తెలు
పదొడఁగె॥ సీ॥ శ్రీతారకబ్రహ్మ సేవకుండైభవ తారకుండగునర్థతారకా
ధి। పతిశిఖామణితనాభవునిచేఁ బరవీర తారకాభయదుదా తారకాసు।
రుఁడు గాల తత్కుమారులు తారకాక్షుండుకమలాక్షుఁడును భుజాగర్వశా
లి యైన విద్యున్మాలి యనశనవ్రతమూని వేయేండ్లుతపము గావించమె
చ్చి। ధాతప్రత్యక్షమై కామితములువేడు। మనిన దైత్యులమర్త్యత్వ
మభిలషింప। వలదువేరొక కోరికె దెలుపుడనిన। బ్రహ్మఁగనుఁగొని వా
రలు పలికిరిట్లు॥ గీ॥ అబ్జసంభవ స్వైర విహారయోగ్య। మమరగంధ
ర్వ సిద్ధసాధ్యాదినిఖిల। శాత్రవాసాధ్యమైన పురత్రయంబు। మాకు
దయసేయుమనిన నాలోకవిభుఁడు॥ క॥ మయునిఁ బిలిపించిపుర। త్రయ
ము న్నిర్మింపుమీపు తాదృశ మహిమన్। దయసేసెద పురములకని।
ప్రియమున నజుఁడనియె దనువు బిడ్డలతోడన్॥ గీ॥ ఎన్నఁడైన నేమియీపు
రత్రితయంబు। నొక్కదిక్కు జేరు నొద్దికగుచు। నాఁడుబలియుచేత నా
శమొందాఁక। సమయదనుజు నజుఁడు పనియెదివికి॥ సీ॥ శతయోజనా
యుత శాలసౌధాగార శృంగారవనికావిచిత్రములుగ। చిహ్నంబుచే
వెండిచే నుక్కుచేతను త్రిపురముల్మయుఁడు నిర్మించియొసఁగ। హేమపు
రంబున యేలికయై తారకాక్షుండుత్రిదశాలయంబునందు। నాయస
పురికీశుఁడగుచు విద్యున్మాలి యుర్వియందు నెలంగుచుండిరప్డు। దిగధి
పాలముఖ్య దేవతాజయ్యులై। సకలభోగభాగ్య సహితులగుచు। నెదురు
లేక సంచరింపుచునుండిరా। దివిజులెల్లగుంది తల్లడిల్ల॥ సీ॥ వ్రాలునిం
ద్రాది దిక్పాలవల్లభుల పట్టణములు నేలమట్టములుగాఁగఁ। బఱచుహేమ
నగాది పర్వతరాజశృంగంబులు ఛిన్న భిన్నంబులుగను। నెగయుభానుశ
శాంక నిఖిలగ్రహములూడిపడగ బ్రహ్మాండ కర్పరముదాఁక। దూరువా
రాసులు దుర్వారతరసప్తపాతాళవాసులు పగిలిపాఱఁ। దిరుగు బహుచి
త్ర గతుల నంబరమునందు। నిజగతాగత మెఱుఁగక నిబ్బరముగ। నొ
రసి దేవవిమానములుర్విఁ గూల। ప్రశమితజగత్త్రియంబు పురత్రయంబు॥
సీ॥ అనిచేసిపొడిసేతు మని యెందువెదకుచు పురములుగానక తిరుగుటయు
ను। పరికించిచొరలేక ప్రైపై చివజ్రాది బహుశస్త్రములుమొక్క పఱ
చుటయును। పాలెంబుడిగి యున్నపట్లనెందేనొక్క పురిగుప్పు మనిగూల

బోలియుటకును । కైలాస మందర కనకాద్రిముఖ్య భూధరకందరములం
దు దాగుటకును । నెందు బెడ బెడమనిన మహీధరంబు। విరిగిపైబడునంచు
ను వెఱచుటకును । గాని దైత్యాది పతులతోఁ గలసిమెలసి । యాహవ
ము సేయ జాలరింద్రాదిసురులు॥ క॥ పురదైత్య పరాజితులై। హరిహయ
ముఖ దివిజు లజుని బ్రార్థింప వచో । వరుఁడాయమరులతోఁజని। ప రువే
డిన నతఁడుశౌరి నడుగుదమనుచుఁ॥ మ॥ నెలపుందాలుపు గిబ్బనెక్కి వెడ
లఁ వెన్వెంటనచ్చంపుఁ తె । క్కల తేజీనడిపించె పద్మజుఁడు మిన్నాకండధ
ట్టింపుచుఁ । వలచే వాగెబిగించి హస్తిడిగి యశ్వంబెక్కి కూడెఁ వి
శ్వం । ఖలుఁడై వాసవుఁ డన్యనిర్జరులు వెన్కంబోయి రంతంతటఁ॥
క॥ అప్పుడు గలశాంభోనిధి ।, చప్పుడువెద విన్నపములు సాగింపం
గా । నప్పలుకు చెలువచెలువుఁడు । విప్పంగనుదొరలతోడ వేడుక
ననియెఁ॥ మ॥ చెలువారంగ తరంగహస్తముల రాజీవాయతాభీలచం
చలవాతాహతదూతశీతల వృషత్సంఘాత ముక్తాళిచే । కలశాంభోనిధి
సార్వభౌముఁడు వియద్గంగాలతాతన్వి పైఁ। దలబ్రాలోయి తెఱంగుగం
టిరె శుభోదర్కంబుగా నీయెడఁ॥ క॥ కలశాంభోధి మథింపఁగ । గలి
గినయమృతంబు మిసుగ్రైకొని వెన్నఁ । నలినాక్షుని పాలిడినటు । వలె
నున్నది తెల్లదీవి వైఖరినిచటఁ॥ క॥ సమ్మదమొసఁగఁ గంటిరె । తు
మ్మెదగల మావిసంటితులదూగుచు నీ । క్రొమ్మొగులుడాలు వేలుపు ।
కమ్మనికుందనపు మేడ కడుచోద్యంబై॥ వ॥ అని కుంఠిత మహిమాకరంబగు
వైకుంఠపురంబు వాఁకలకంఠకంఠకామనోహరుండు వర్ణింప సముత్కంఠ
వినుచు నీలకంఠాది విబుధకంఠీరవులుపకంఠ నిరవకుంఠన ముక్తా తోరణ
ఘృణిశుంఠి శతసహస్రి గురువరారోహాజారంబగు హరిహాజారంబు బ్ర
వేశించిదగద్ధగితమణిమయ చతురకక్ష్యాంతరంబులుగడచి యవల వఃమా
న జనంబులవలన లలనా సమేతుఁడై శృంగారవనంబున కరుగుటవిని యు
ద్దేవుని రాకకై యుద్యాన వనవాటికా ద్వారంబున గైరవాప్తం దృణీక
రించు నిగనిగని మగరాల వెన్నెలగనియగు వెన్నెలగని వసియింప నెం

చునవసుంబున॥ గీ॥ చెలువ యొక్కతె వచ్చెనా చెలువజూచి । కమల యంచును భ్రమసిరి యమరులెల్ల । కనకవేత్రంబుగని దాదిగాఁదలంచి । యుండి రాఖండలాదు లయ్యువిద యంత॥ క॥ హరునివచో యువతిమ నో । హరునిఁబులోమాసుతేంద్రహరునిఁ గురునిఁ । హరిరమ్మని యెనటన్నఁ । హరుసముతో వారునలువు రతివినయమునన్॥ మ॥ చనివీ క్షించిరి భూమి నీళ మొదలౌ చంద్రాస్యలంటిపురం । బున కేఁగన్ కమ లాలతాంగి యెదపైపొల్పొందు మాల్యంబుచా । లునసిల్వన్ ఫణిరాజ పీఠ మునసీటుల్గుల్కఁగొలైవ్వ ఖగేం । ద్రునిచేతన్మడుపందు మందరధరున్ లో కైక రత్నామణిన్॥ క॥ కని మ్రొక్కినఁ గనికరమున । కనికగమున లేవనెత్తి కరకంపంజెం । తనుచిత పీఠివసింపన్ । ...నిచెం నిలుమండి రెదుటబ్ర హ్మేంద్రగురుల్॥ గీ॥ చంకచేతులబెట్టుక సవినయముగ । కెలననిలుచు న్న వారినీక్షించిశౌరి । మీరుగూర్చుండుడని పలుమాఱుబలుక । నుచి తవైఖరివారు గూర్చుండిరంత॥ క॥ ఏమీవచ్చినకార్యము । కౌమారి యటన్న ముకుళకరకమలుండై । స్వామియెఱుంగని కార్యము । లేము న్నవి త్రిపురదైత్యు లెచ్చిరటన్నన్॥ శా॥ స్నానంబుల్ జపముం దపంబుగ్ర తువుల్స్వాధ్యాయముల్దేవతా । ధ్యానంబుల్ మొదలౌ ధరిత్రి గలశ్రు త్యాచారముల్దప్పిరిం । తైనన్ దానవజేసి దానవు లజయ్యత్వంబునన్నించి ర । లైనన్ సత్యముశౌచముల్ దయయులే వావంతయున్ శంకరా॥ సీ॥ చంద్రశాలలయందు సంపూర్ణచంద్రుని కన్నులకింపుగాఁ గాంచుటకును । వైడూర్యమయసౌధవాతాయనంబుల సూర్యకరాళిమై సోఁకుటకును । సుర కాంతకాంతలైసురపొన్నపీవన సురభిమారుతములఁ జొక్కుటకును । శీత కాలంబుల శ్రీచందనహసంతికాహుతాశను సెగ గాంచుటకును । భయ మువమదురుకలనైన పరులఁదలప । ననుటసవ్యస్తముగుగదా యసుర వసుల । కట్టెపరమపతివ్రతలాంధ్రుగాఁగ । నెటువారలఁగెలువనా నెవరి కైన॥ గీ॥ అదితియునుంగాక యల తారకాక్షసుతుఁడు । హరివిరించిగు జించి తయ్యద్భుతముగఁ । దపముగావించి స్వపురమధ్యమున నొక్క

యమృతకూపంబువడసె నీ యజునికరుణ॥ క॥ అదికారణముగ దైత్యులు। త్రిదశులతో వెరవ కెదిరి తెగిన దనుజులన్। బ్రతుకంజేయుదు రొకనన్నిన్। బదుగురిగా నజు వరప్రభావమువలనన్॥ గీ॥ అనిన నేమాయయిప్పుడా య మృతరసము । సంగ్రహింప నిశాచరాచారమడప । పురపురంధ్రీ పతివ్ర తాచారముడుప । కడనిశాటులగెడప । నేఁటినుపమ॥ క॥ అనియోగన దెలిపి కపట ధనిజూచి సురేజ్యులాది దివిజగణంబున్।బనిచి యజు దూడ గమ్మని।వనజాక్షుండు దనువై యవారికొశక్తిన్॥ గీ॥ ఖచరకిన్నర గంధర్వ గ రుడసిద్ధ । సాధ్యవిద్యాధరాది నిర్జరవితాన । దుర్గమం బైనదాన వేంద్రుని పురంబు । పాయమునజొచ్చి యటమాయమాయమె దవు॥ సీ॥ రాఁకించు చు నుపచ్చరాచక్కటపునేల మెఱుఁగుపచ్చికలంచు మేయ చుండు।నర్భకల్ల దూడనదలించ హుమ్మని వలుదకొమ్ములఁగ్రుమ్మవచ్చు కినుక । చేపిన పొదుగువర్షించు దుగ్ధంబులు నించివెల్లువలు గట్టించుపింత । యొద్దకిమీఱం గ నొక్కెడవసియించి యెడనెడనెమరుబెట్టెడి విధంబు । గాంచియెక్క డనుండియిక్కడికివచ్చె । నొక్కొ యీయావుదూడయు చక్కనుచు। నసురలచ్చెరువంద నందందమెలఁగి। భ్రమయఁజేయుచు నమృతకూపము న దుమికె॥ అప్పుడు॥ గీ॥ ఆవుబావిబడియె నయ్యయో కాలుగీ । లేమియు య్యెనొక్కొ యట్టులనుచు । వగచి దైత్యులెల్లడిగి యెత్తజనియందు । ధేనువమృతరసము గానలేక॥ క॥ ఆవిటుల నేర్పునే మాయా । పీయు దీయనుచు తారకాఖ్యాసురుతో। నాయింత దెలుప దనుజుల। లావింతటనణ గెనని ప్రలాపాస్వనాంద్రై॥ క॥ [illegible] వ్యాధుల భావం బుతత్త్వ వైఖరి వెలయఁ । లోక [illegible] పెల పుచును ని । రాక్ష తిగావించె మదయ మహా [illegible]॥ వా॥ [illegible] బర్హిబర్హా ము చాసంగ [illegible] । [illegible] బంగరంబువతె రాజిల్లన్ గ లోహితాం। ? మెుప్పాఱఁగ నుజ్జ్వల ప్రభదలిర్పన్ వార్ధి కన్యామనో। హరుఁడా దైత్యులఁ జేరగాజనియె బౌద్ధాకార మేపాఱఁగన్। సీ॥ మణిమయకోటీర మండితంబగునుత్తమాంగంబుమండితం బైన దేమిఁ।

కనకాంబరంబులు గట్టనర్హంబైన కటి కావికోకలు గట్టనేమి। యాయుధో
చితమైనహస్తపద్మంబున బర్హిబర్హంబును బట్టుటేమి । జగమునేలంగ తే
జంబుగల్గియునిట్టి సన్న్యాసమవధరింపంగనేమి। యహహ సన్న్యాసిగాడు స
న్న్యాసియైన। దండముగమండలువు నెద్ది ధరణినెన్నఁ । డిట్టివేషంబుగనుఁ
గొనమెవ్వఁడోకో । యామహామహుఁడంచు దైత్యేంద్రులపుడు॥ గీ॥
తనకు మ్రొక్కిన కుశలమా దైత్యులార। యనిన వేదోచితాచారమున మెలం
గు । మాకు కీడేలగల్గు సేమంబె గాక। యనిన పకపకనగి బుద్ధుఁ డనియె న
పుడు॥ క॥ ప్రస్తుతియోగ్యమె శ్రుతి వ్య । త్యస్తము పునరుక్తవాక్య మన్నృ
తోదిత వి । ధ్వస్తము మరి వ్యాఘాత । గ్రస్తంబది నిజము సేయఁగానేమి
టికిన్॥ క॥ యజమాన ప్రస్తరమును। నిజమా యామాట యది యనిక్కం
బైనన్ । యజతే యను వాక్యంబును। నిజమని నమ్మదము శ్రుతి ప్రమాణ
ము సేయన్॥ క॥ మనమెఱుఁగ నెయ్యెటికి జె। ప్పెను మున్నె శ్రుతిర్విమస్య భే
షజమను చున్। మనమెఱిఁగిన మాత్రమె యది। యు నెఱుంగగనుండు యుక్తి
యుక్తముగాఁగన్॥ సీ॥ కర్మంబు ఫలదాత గాదీశ్వరుండంచు ద్వైవిధ్యమైమీ
మాంస విఫలమయ్యె। నొక్కజీవుడటంచు పెక్కుజీవులటంచు వేదాంత
శాస్త్రంబు వితథమయ్యె । హరియెక్కుఁడంచును హరుఁడెక్కుఁడంచును
బహుపురాణంబులు పాటిదప్పె । నైకవిధ్యంబు లేదరయఁగా స్మృతుల
నే తెఱుఁగునదీసిన దీయవచ్చు । దానములొసంగకుండు నంతటనె నరక।
కూపములఁ ద్రోయుదురె మేలుగోరితమకు । బుద్ధిహీనులు ప్రతిమలబూ
జసేతు । రనఁగ నెందును వినరె ప్రజ్ఞాఢ్యులార॥ సీ॥ అకలంకులార యిం
కొకకర్మమది యవివేకంబు వినుఁడతి విస్మయంబు । గర్మంబువలన వైక
ల్యంబుగలదటుఁగలుగ ప్రాయశ్చిత్తకలనము నను । బోనట పాచితంబున
ను వైకల్యంబు బోరయుఁబోనట హరిస్మరణమునను । అదియెనిశ్చయ
మైన యాస్మరణము మున్నె సేయరాదేమి సెల్లెఁదమకు । నేర్పుతో
కొంగనెత్తిని నెయ్యిపెట్టి । కరగి కన్నులనిండిన గానకుండ । పట్టికొనవ
చ్చునను మతిభ్రష్టుఁగలఁడె । కలఁడె యననేల తాదృశుల్కర్మఠులు।

భాభోగములగోరి యాగముల కర్థంబెల్ల వెచ్చించుటా । యంభోదంబుల
జూచి చెర్వు జలమాద్యంతంబు జల్లించుట । ల్సంభోగేచ్ఛ జనించెనేనివా
రివేశ్యారత్నముల్లేరొకో । సంభోగింపఁగరాదె కానరుజనుల్ జ్ఞానంబుసా
మాన్యమే॥ క॥ వినుఁడొకటి బావమరుదులు। జనకకుమారకులు మఖము
సల్పినరంభా । వనితంగలయుదురటులై । నను లేవేవావివర్తనలుయుజ్వ
లకుల్॥ మ॥ వికటంబిఁతియొకాక తృప్తియగునే వేరైనశ్రాద్ధంబుచే। నక
టా ప్రేతల కట్టులైన మరియేలా యూరికిం జద్దిగ । ట్టుకపోగా దనపేరు
సెప్పికొని యింట్లోవారెభోసేయుమం । చొకమాటాడి చనంగరాదెతన
బాహుల్నొవ్వమోపేటికిన్॥ గీ॥ కాకపితరులుకూటికి కాతురనిన । తెలి
య దేయందుననె పుణ్యకలుష ఫలము । లనుభవింపను మరలియూ యు
వనియందు । జననమొందేమి శేముషీసాంద్రులారా॥ శా॥ లోలంబైజల
రాశిలోబొడము కల్లోలంబు లేలాహతిన్ । దూలన్ వేరొకవీచివచ్చుగతిజం
తుశ్రేణిలోనొక్కఁడా । చాలింగూలిన బుట్టునొక్కఁడు పునర్జన్మంబు తే
దెన్నఁడున్ । జాలున్ బుణ్యము దుష్కృతంబనుచు దుశ్శంకల్ ప్రవర్తిల్లు
టల్॥ సీ॥ సురద్రావుచుండుమీ గురుఁడు భార్గవమానిపాలుఁడే నరకకూప
మునమునిఁగె। చలపట్టియధ్వరాశ్వముల దొంగిలిపోవు వాసవుండే రౌరవ
మునఁగూలె । నేకర్మములులేక యిచ్ఛగావిహరించు సనకాదులెట్టియాతె
నలఁబడిరి। బలవంతమున గురుకులకాంతబట్టిన వనజారి యేదోష మనుభ
వించె । భళిరవారికిలేని పాపములుమనకె। గలిగెనే తనయుక్తినిగదయ
టన్న । కాయమెడలిన మోక్షంబుగాకమరి శ । రీరమేడదిసుకృతదుష్కృ
తములేవి॥ క॥ సత్తైనదెల్లక్షణికము । నిత్యముగాఁదంచువాహ నివహము
వలెనే । చిత్తైనజీవుఁడటువలె । సత్తై క్షణికుఁడుగాక శాశ్వతుఁడగునే॥ క
ఎటువలెనున్నదిపటమిది। ఘటమిదియనుచోటవడిని గలజ్ఞానంబా । ఘటి
లేదు ఘటజ్ఞానము । పటిలేదుగగానగనుడు ప్రత్యేకముగన్॥ గీ॥ అఖిల
భోగానుభవయోగ్యమైనతనువు । వడసియునుజప తపముల పాలుజేసి
సౌఖ్యమొందక చెడుమూర్ఖజనుల దెల్ప । పూటయేమాకు వారక్షైన

నిమ్ము॥ క॥ మొదటికి యిహమేలేదట। పిదపం బరమెట్లగల్గుఁ జేల దనముగా। కిదిమతముగాదు నామత। మిది గైకొనుఁడిహపరంబు లిచటనె కల్గున్॥ గీ॥ అప్పుకొనిైన దొంగిలినైన లేన్న। జిహ్వ కింపైన దాని భుజింపవలయు। కంటికింపైన కాంతల గలయవలయు। బ్రతుకు దినముల మోక్షంబు వెఱ్ఱనేల॥ గీ॥ క్షితినిసర్వజ్ఞుఁడనమారంజిత్తసంగ। నేనె తన్నిమములు సెల్లె నీశ్వరునకు। నతనికివి చెల్లుననిన మాయామునుకుం డు। నెఱుఁగకేటికి వలచెదై త్యేంద్రులార॥ వ॥ అని ప్రత్యక్షానుమాన ప్రమాణోత్తరంబులగు హేతువాదంబుల బుద్ధుండుబోధించిన సిద్ధంబని నమ్మి వేదంబు లర్థవాదంబులనువారును యజ్ఞవిగ్రహ లజ్ఞవిధులను వారును శాస్త్రార్థంబు లపార్థంబు లనువారునునై బహుకాలంబు చారుతర వేదాచారులగు త్రిపురనిశాచరులు శీఘ్రంబున నత్పరిచారులు యథేచ్ఛాసంచారులునైనవారి విధంబు చారులవలనవిని యింద్రాది గగనచారులు గత విచారులై యుండిరంత॥ శా॥ శ్రీమద్బుద్ధ మునీంద్రుఁడంతిపురి గౌరీ పూజ గావించుచు। త్రామారాతికులాంగనామణులఁ జేరంబోయితద్రూపుఁడై। కామాహాత్మ్యముమానసంబు గలవాఁ కందర్పదర్పోదిత। వ్యామోహం బతివేలమై నిగుడఁగా వారి న్నిరీక్షించుచోన్॥ క॥ పరపురుషుఁ డెవ్వఁడో యిట। కరుదెంచెనటంచు దానవాంగనలవనీ। ధరకన్యగర్భగృహమున। కరగిరపుడు దాది నిలిచి యమ్మునికనియెన్॥ గీ॥అరసిచూడ త్రిమూర్తుల యందునొకఁడ। వింతయేకాని యన్యులకిట్టిదివ్య। తేజమొదఁగూడ నేరదు దేవదేవ। తెలుపుడన బోఁడి దేవర తెలిపెనపుడు॥ క॥ బుద్ధుఁడనను గొ ... చినభవ। బద్ధులరక్షింతు నిహము పరమొసగిచటన్। సిద్ధముగానావచన ... । బద్ధముగాదనిన దాది పర్వానజనుచున్॥ క॥ ఈ వేళ ప్రత్యక్షంబోయిన। ... వర మెదురయ్యె బుద్ధ దేవర మనకున్। గావలసిన వరమియ్యఁగ। ... వచ్చినవాఁడు రండు తామరసాక్షులే॥ క॥ అనిదాదిపలుక దేవుం డను ... క్తిని సతులువచ్చి యంఘ్రుల కెఱఁగన్। తనువు పులకింప మునిలె। ... సి వనితల నెత్తి యిట్టు లనియెన్ ప్రీతిన్॥ ఉ॥ హృద్యముగాదు మీర

లిట్టి యీశ్వరియందును ధూపదీప నై । వేద్యములిచ్చి తాఁ బ్రతిమ నేయు విధంబుల పూజసేయుట । లోచ్యముగాక యేఫలము సూడ్వడి తాళ్లకు సీలఁబోసినన్ । వేద్యము లాఫలార్థులకు వృక్షములుండఁగ నీవృథా శిలల్ ॥ గీ॥ రాజముఖులార శుక్రవారమున బాహ్య । జలముల మునింగి బత్తి బిత్తరి మెరావి। కౌఁగిలించిన మీకెల్లఁ గార్యసిద్ధి। గలుగు నామాట సత్యము కల్లగాదు॥ మ॥ అనినన్ మంచిదె యంచు లేనగవుతో నబ్జాస్య లంతఃపురం। బునకేగంగఁ బదంగ సంగత మనోబుధ్యాదియై మారుమో। హన బాణంబులు సోఁకి బ్రమూర్ఛపడియె నాయశ్వత్థమై బుద్ధుఁడా। వనమధ్యంబున నుండె తాపస్యము దళవ్యాజంబునం దెల్పుచున్॥ గీ॥ చంద్రసూర్య మరుత్తులు సంచరింప। నళికి కపకపత్త్రోపల నడుగుచున్న। ప్రమదవనమున కోకనాఁడు భ్రమరమునుర । నమరపరిపంథివల్లభ ప్రమదలరిగి॥ ఉ॥ పొన్నలు పోకమ్రాఁకులును పూచినసంపెఁగలున్ మధూకము । త్రిన్న నినారికేళములు తియ్యనిద్రాక్షలు గుజ్జుమావులున్ । కన్నులఁగోరఁ గించు జిగిగల్గిన మోదుగులున్ వనంబులో। నన్నియుఁ జూచి తాంచి చెలులచ్చటనచ్చట పూలు గోయుచున్॥ క॥ పదిరెండేఁడుల పాయపు। సుదతీమణి యవయవములు సొబగు దలిర్పన్ । గుదిగొనజిగిర్చి తమక । ట్టెదుటన్ గనుపట్టు రావు వీక్షించినతుల్॥ క॥ బుద్ధముని చెప్పినటువలె। బద్ధాదరచిత్తవృత్తిఁ పాటించి తమున్। సిద్ధంబుగ మనకోరికె। సిద్ధించుననటంచు కొలను జేరిపురంధ్రుల్॥ సీ॥ కురువేరు మొగలిరేకులు పెట్టి యల్లిన జడవిప్పి కీల్గొప్పు నవధరించి। బిగిచన్నుగవగుత్తమగు ముత్తియపుజంటి జవికెసడల్చి హారములు దివిచి। తళుకు లేజెక్కుటద్దముల విద్దెముచూపు కట్టాణిపేర్లు కదియనడిమి । చిలుక బవంతిచీరెలు గట్టుపైనుంచి జిడగు చెంగావిపావడలు విడిచి। మాటుఁజార్తి నియ్యమొయియు కటాక్షులనగ। సోఁకుమూరాక మిటారులు సోలిగ్రాఁగ। కొలను రాయాంచ బాముల యుస్సుటు దెగడి । కొలనుచొచ్చి విహారముల్సలుపుచుండ॥ సీ॥ పెంటిగానక లేక బిస్సునవలిగుబ్బచంటి వ్రాలెడు చక్రవాకము నకు । తల్లిగానగ లేకలఘుకటి త్తరి తేఁటి వాలుగన్నుల వ్రాలు వాలుగకును॥

కోదమలఁగానక గుమికూడి యపలిభాగమ్ములగ్రుమ్మ భృంగంబునకును ।
తోడియంచలఁ బాసి తొగరాకుఁబసుగుల పైనఁగ్రాఁడు రాయంచ పిలుకల
కును । చెలికిఁ దప్పించుకొనుచు బిట్టులికిపడు మ। కలికి నవ్వుచు రావె యీ
వలికి నీవు । వలికి వెరచిన నని కేరి పలికికొనుచు । పేఁడిన్నలు సీరాడి వేడ
లునపుడు॥ గీ॥ వారివీక్షించి యామునవారి వెలి । గోపవారిజనేత్రలు
కోకలడుగ । వచ్చునాటి విలాసంబు మెచ్చుకొనుచు । న్యగ్రమున నెన్నె జె
ట్టునన్న శౌరి॥ సీ॥ అపుడె వెన్నాడి దుర్యశమునసంసభాగమున గిన్పట్టి
కీల్గంటుతోడ । పదిలమైయుండుము హృదయమూయనురీతి చనుగవగడి
యుహస్తంబుతోడ। నిదిదాఁచుకున్న దా నేమి సేయుఁగటన్న కరణి సందుం
చిన కరములతోడ । నభిమానములు బ్రోవుమని నమస్కృతి సేయు గతి
మించు నానతాంగంబుతోడ। బెళుకు చూపులు నునుసిగ్గు మొలకనవ్వు
కదలుపిఱుఁదును మిగులసింగారమొలక। కులుకువడఁజేరి దినమొలపొల
సుదిండి। లేమలశ్వత్థములఁగౌఁగిలించిరపుడు॥ మ॥ అసురాబ్జాస్యలు కౌఁగిలిం
చుతరి నయ్యశ్వత్థనారాయణుం । డసమాస్త్రోపమ రూపురేఖఁ దగి బు
ద్ధాకారుఁడై దాను ది। గ్వసనుండై దనుజాంగనాకుచతటీ గాఢాంకపాళిక్రి
యా । రసికుండై కళలంటఁజొక్కి రిసతుల్ రాగాబ్ధినిర్మగ్నుఁడై॥ మ॥ జను
లగ్గింప జలంధరాసురుని పేపంబూనితత్కాంతబృం। దనుగామింపఁడె గో
ల్లగుబ్బెతల మానంబెల్ల కొల్లాడఁడే । దనుజధ్వంసికి క్రొత్తయే త్రిపుర
కాంతాసంగ ధౌర్త్యంబుగ । ల్గిసజాలుం జెలుతేడనైన గలయుకా లీలా
వినోదంబులన్॥ గీ॥ అంత మరియేమిచేసెనో యసురసతుల । బుద్ధ చే
వర యిదియేల ప్రొద్దుబోయె । కడమకథవిను మాదిత్య గణముగోలు
వ । కమలలోచనుఁడీసు చెంగటికి నరిగి॥ సీ॥ లనమహిమహీళ్ళ శతాంగం
బుగాఁజేసి కన్నుల రెంటి చక్రములు చేసి । బలితంపు టూర్పుగాడ్పులహ
యంబులు జేసి యాత్మజాగ్రేసరు నంతఁజేసి । యుగ్రగజబలగము లస్త్రాశన
ము జేసి నెజ్జయాంబిలుపసింజినిగఁజేసి । ఐలము లయుం ద్ధబలముల రథి
జేసి తనుసముస్త్రైవతాస్త్రముగఁజేసి । చుఁఖులలయుపిహ్మాఁ చిటచిటభటలు

హావల । దైత్యపురములఁగూర్చి దగ్ధంబుజేసి । శంకరుపురారి యనిపిం
చె జగములందు। శ్రితజనయశస్కరుండు లక్ష్మీశ్వరుండు॥ మ॥ కురిసెన్
కల్పక పుష్పవర్షములు రక్షోరాజి భీతిల్లగా । మొరసెన్ నిర్జరదుందుభు
ల్దివి మహాంభోవాహ గర్జార్భటిన్। నెరసెం దెల్వి సమస్తదిగ్వలభులన్
నిర్నిద్రహర్షస్థితుల్ । దొరసెన్ వేల్పుల సమ్మనంబులకు నుల్లోలంబుగా
నత్తరిన్॥ క॥ శ్రీవిభుఁడిటువలె బుద్ధుం। డై విహరించినవిధంబు హర్షము
మీఱఁగ । గా వినువారలు ప్రబలుదు। రీవసుమతిసుమతిశుభ సమృద్ధుల
తోడన్॥ గద్య॥ ఇది శ్రీరామభద్ర దయాభిరామభద్ర కరుణాకటాక్ష వీక్షా
పరిప్రాప్త దీప్తతరాష్ట్రభాషాకవిత్వ సామ్రాజ్య ధౌరేయ సకలవిద్వత్కవి
జనవిధేయ ధరణీదేవుల నాగనామాత్య సుధాసముద్ర సమున్నిద్ర పూర్ణి
మాచంద్ర రామమంత్రీంద్రప్రణీతంబైన దశావతారచరిత్రంబను మహాప్ర
బంధంబునందు తొమ్మిదవయవతారంబగు బౌద్ధావతారము సంపూర్ణము.



దశమాశ్వాసము: కల్క్యవతారకథ.

క॥ వినుమిఁక హరి కల్యంతం। బునకల్క్యవతార భావమున మ్లేచ్ఛుల
నెల్లనడంచి ధర్మసంస్థా। పన మొనరింపఁగలఁడవనిపాలకతిలకా॥ క॥ అని
శ్రీవైశంపాయన । ముని దెల్పిన మిగుల మోదమున జనపాలుం । డన